# పరతత్త్వ ప్రసంగము

(పరమగమ్యమును చేరుమార్గము)

శ్రీ విరజానందస్వామి

అనువాదకుడు.

కందుకూరు - మల్లికార్జునం

"ఏకం సత్ విప్రా బహుధా వదన్తి"



శ్రీ రామకృష్ణ మఠము

మైలాపూరు : : మద్రాసు - 4

# పరతత్త్వప్రసంగము

## (పరమగమ్యమును చేరుమార్గము)

1. ఈశ్వరానుభూతి నొందగోరు సాధకునికి ఈ క్రింది గుణము లత్యావశ్యకములు: ఓర్పు, పట్టుదల, మనశ్శరీర పారిశుద్ధ్యము, ఆవేదనారూపతృష్ణాతీవ్రత, శమాది షట్క–సంపత్తి: అనగా శమము (మనశ్శాంతి), దమము (ఇంద్రియ నిగ్రహము), ఉపరతి (విషయాసక్తి పరిత్యాగము), తితిక్ష (సర్వవిధ క్లేశములమధ్య అచంచలచిత్తత), శ్రద్ధ (గురూప దేశములందును, శాస్త్రోక్తులందును విశ్వాసము), సమాధా నము (ఇష్టమూర్తి యందు, లేక ఈశ్వరుని యందు, చిత్తైకాగ్రత.)

* * *

2. పారమార్థిక సాధనలచే లబ్ధములైన సత్యాను భూతులు, దృశ్యములు, మున్నగు అనుభవములను నీ గురువునకుదక్క ఇతరుల కెవ్వరికిని తెలుపవలదు. నీ పారమార్థిక ద్రవ్యనిధిని—నీ అత్యగాధభావములను—నీ లోపలనే దాచియుంచుకొనుము. అవి సామాన్య జనుల కంట బడరాదు. అవి నీ పవిత్రస్వామ్యములు—నీవును ఈశ్వరుడును తప్ప ఇతరు లెవరును ఎఱుగగూడని రహస్య విషయములు. ఇట్లే నీ లోపములనుగూర్చి, నీ దోషములనుగూర్చి ఇతరు లతో చెప్పకుము. అందుచే కలుగు ఫలము: నీవు నీ ఆత్మ

గౌరవమును కోల్పోవుట, ఇతరులకు నీయందుగల గౌరవము నశించుట. ఈశ్వరసమక్షమునమాత్రమే నీవు వానిని ఒప్పుకొనవలెను. వానిని లోబఱచుకొను శక్తికై ఆయనను ప్రార్థింపుము.

*　　　*　　　*

3. ధ్యానమున కుపక్రమించునపుడు మొదట కొంచెముసేపు సుస్థిరముగా కూర్చుండి నీ మనోగతిని పరికించుచుండుము. దానిని స్వేచ్ఛగా సచరింపనిమ్ము. నీవు సాక్షివని—ద్రష్టవని—భావించుకొనుము. మనస్సు తేలియాడుటను, మునుగుటను, పరుగిడుటను, గంతులిడుటను కనుపెట్టి చూచుచు కూర్చుండుము. "నేను శరీరమును కాను, ఇంద్రియములను కాను, మనస్సును కూడ కాను. నా కీ మనస్సు కేవల భిన్నవస్తువు. మనస్సు సైతము భౌతిక వస్తువే—సూక్ష్మతరమగు భౌతిక వస్తువు. నేను ఆత్మను, ప్రభుడను, మనసు నాకు బంటు" అని తలచుచుండుము. పనికిమాలిన తలంపేదియైన 'మనస్సులో పొడచూపెనేని, వెంటనే దానిని బలవంతముగా అణచివేయ ప్రయత్నింపుము.

*　　　*　　　*

4. విశ్రాంతి కాలమున ఎడమ ముక్కు ద్వారాను, కార్యాచరణకాలమున కుడి ముక్కు ద్వారాను, ధ్యాన కాలమున రెంటిద్వారాను, మనుష్యులకు సామాన్యముగా శ్వాసములాడుచుండును. మనశ్శరీరములు ప్రశాంతములుగా నుండి, రెండు ముక్కులలోను శ్వాస సమానముగా ఆడు వేళయే ధ్యానమున కత్యంతానుకూలమైనది. కాని నీ శ్వాస

చలన వైఖరిని కనుపెట్టుట కంతగా ప్రాధాన్య మీయ వలదు, నీ కర్మాచరణ విధానమును నియమించుకొనుటకు దానిని ఆధారము చేసికొనవలదు.

* * *

5 నీ చిత్తము పరిపూర్ణ ప్రశాంతదశలో నున్నప్పుడు శ్వాసచలనము నిలుకడయై, కుంభకము (ఊపిరి బిగియబట్టుటచే స్తంభించియుండు స్థితి) పరిణమించును. శ్వాసము ఎచ్చుతగ్గులు లేక సుస్థిరముగా నున్నప్పుడు మనస్సు ఏకాగ్రమగును. భక్తి (ఈశ్వరప్రేమ) కూడ అప్రయత్నముగా కుంభకమును కలిగించును. అందుచే గూడ శ్వాసచలనము నిలుకడ నొందును. ఈశ్వరుని స్మరించి ఆయనను గూర్చి చింతించుచు అత్యాసక్తి జనితపరితాపముతో జపమొనర్చిన యెడల, యోగాభ్యాసమేమియు లేకయే ప్రాణాయామము (శ్వాసనియమనము) స్వతస్సిద్ధముగా లభించును.

* * *

6. చిత్తైకాగ్రత సాధించుటకు అభ్యాసము (విడువక పట్టుదలతో మాటి మాటికి పరిశ్రమించుచుండుట), వైరాగ్యము (ఐహిక విషయములయెడ నిస్సంగత్వము) తప్ప వేఱు ఏ మార్గము — సులభము, అనుకూలము అయినది — లేదు.

7. జపధ్యానములకు నీవు వినియోగించుకాల మెంత యైనను — పది నిమిషములో పదునైదు నిమిషములో మాత్రమే యైనను—వానియందు నీ మనఃప్రాణములను

పరిపూర్ణముగా నుంచి చేయుము. ఈశ్వరుడు అంతరస్థుడు, అంతర్యామి. ఆయన చూచునది నీ హృదయమును. ఆయనను గూర్చి నీ వెంతసేపు ధ్యానింతువో, ఎన్నిసార్లు జపింతువో అనికా దాయన చూచునది. నీలోని వాంఛ యెంత ప్రబలముగా నున్నదో అనునదియే ఆయనకు ముఖ్యము.

* * *

8. మొదట మొదట జపధ్యానములు కొంత రస హీనముగా, అరుచికరముగా నుండును. కాని నీవు—మందు మ్రింగినట్లు తోచినను—వానిని విడువక అభ్యసించుచునే ఉండవలెను. మూడు నాల్గేండ్లు సుస్థిరముగా—పట్టు విడువక —అభ్యసించిన పిదప నీ కందు ఆనందము చూపట్టును. ఆ పిదప నీ వొక్క—నాడైనను ధ్యానము చేయకున్నచో, నీ కేమియు తోపక ఖేదము నొందుదువు, ఏదో కీలు తొలిగి పోయినదశ ననుభవింతువు.

* * *

9. పరమార్థసిద్ధికి పురుషకారము (మనుష్యుని ప్రయత్నము) ఆవశ్యకము. "సాధన లొనర్చి నా స్వప్రయత్నముచేతనే ఈశ్వర సాక్షాత్కారము నందెదను" అను సుస్థిర మనోనిశ్చయముతో, ఉచితాసనమున కూర్చుండి, మూడు నాలుగేండ్లపాటు ప్రాతస్సాయంకాలములందు, కనీసము రెండు గంటలు, జపధ్యానములు అవిరామపరిశ్రమముతో చేయుచుండుము—విజయము లభించునో లేదో నీవే చూడుము.

10. ప్రాణాయామముగాని, యోగముగాని, అధికముగా చేయుట గృహస్థులకు శ్రేయస్కరము కాదు. వాని నాచరించియే తీఱవలె నను గాఢాసక్తిగలవారు జీవన మార్గము లన్నిటియందును పరిమితిని, క్రమబద్ధతను, నిష్ఠురముగా పాటింపవలెను వేళ తప్పక పుష్టికరమగు సాత్త్వికాహారమును గైకొనవలెను, వారి కార్యము లన్నియు సునియమితములై యుండవలెను, జీవితమును నిర్వ్యాకులముగా జరుపుకోవలెను. పరిశుద్ధమగు గాలి, సమశీతోష్ణ దేశము, వివిక్తము, ఆరోగ్యవంతము నగు స్థలము; మలబద్ధకము లేని కడుపు, వాఙ్నియమము—ఇవన్నియు ముఖ్యములు. అన్నిటి కన్న ముఖ్యము నిష్ఠుర బ్రహ్మచర్యానుష్ఠానము. ఈ నిషేధములం దెట్టిలోపము కలిగినను హృద్రోగమో, మేదో రోగమో (Brain disease) సంభవించును.

* * *

11. జపధ్యానము లవిరామపరిశ్రమముతో కొంత కాల మనుష్ఠించుటవలన చిత్తము శాంతి పారిశుద్ధ్యము లార్జించినప్పుడు, నీ చిత్తమే నీకు గురువు (అనగా, మార్గ దర్శకము) అగును. సర్వమును నీ వప్పుడు సరియగువిధమున గ్రహింప నారంభించి, నీ పారమార్థికసంశయములకు, సమస్యలకు, పరిష్కారము నీయందే కాంతువు. నీ వెప్పుడెప్పుడు ఏమేమి చేయవలయునో, ఎప్పుడెట్లు ప్రవర్తింపవలెనో, ఒకటి పిమ్మట నొకటి, ఎప్పటి కప్పుడు, నీ మనస్సే నీకు తెలుపుచుండును.

* * *

12. జపము చేయునప్పుడు, నీ యిష్టమూర్తియొక్క రూపమును కూడ ధ్యానించుచుండుము; లేనిచో, జప మెన్నటికిని అగాధము కానేరదు. ధ్యానమునందా మూర్తియంతయు నీకు కాన్పింపకున్నను, ఏ భాగము కాన్పించునో దానితో ప్రారంభింపుము. ప్రయత్నము సిద్ధింపకున్నను మాటిమాటికి ప్రయత్నించుచుండుము. సిద్ధింపకున్న మాత్రమున నే, యత్నించు టేల మానుకోవలెను? పట్టుదలతో కృషిని సాగించుచునే ఉండవలెను. కోరినంతమాత్రాననే ధ్యానశక్తి లభించునా? ఇతర విషయములనుండి మరల్చి మనస్సును ధ్యేయవస్తువుపై కేంద్రీకరించుటకు అవిరామ ప్రయత్నములు చేయుచునే ఉండవలెను. సాధనలు జరుపుకొలది, సిద్ధి చేకూరగలదు.

* * *

13. జపమును (మంత్రము యొక్క మానసికస్మరణమును) వ్రేళ్ళపై లెక్కించుట, జపమాల నుపయోగించుట, స్మరణ మెన్నిసార్లు చేసినది లెక్కయుంచుకొనుట——ఇవన్నియు మనస్సు నితర వస్తువుల నుండి మరల్చి, ఉపాసిత దైవముపై కేంద్రీకరించుటకై ప్రారంభ దశలో అవలంబింపబడు మార్గములు. ఇట్లు చేయనిచో మనస్సు అన్యవిషయముల మీఁది కెప్పుడు పాఱిపోవునో, నీ వెఱుగజాలవు, నీకు కునికిపాట్లు కలిగినను, కలిగియుండవచ్చును. ఈ కర్మములు మనస్సునకు కొంత విక్షేపము కలిగించునవిగా మొదట కానిపింపవచ్చును. కాని మనశ్చాంచల్యములపై దృష్టి యుంచుటకును, వెంటనే వానిని కనుగొనుటకును, మనస్సును వెనుకకు మరల్చి

ధ్యేయ వస్తువుపై కేంద్రీకరించుటకును, ఇవి ఉపయుక్త ములుగా నుండును.

* * *

14. "నేను బలహీనుడను" అని ఎన్నడును తలప వలదు. పూర్ణమగు ఆత్మవిశ్వాసము కలిగియుండుము. "నేను చేయజాలని దేదియు లేదు, సంకల్పించితినేని, ప్రతికార్య మును నేను నిర్వహింపగలను" అని తలచుచుండుము. నీ మనస్సు ఎదుట నీవు ఓటమి నేల ఒప్పుకొనవలెను? దానిని లోబఱుచుకొనగలిగితి వేని యావత్ప్రపంచము నీకు పాదా క్రాంతమగు నని ఎఱుగుము. ఆత్మ విశ్వాసము లేనివాడు యథార్థ భగవద్విశ్వాసముకూడ లేనివాడే. ఆత్మవిశ్వాస రహితుడే నిజమగు నాస్తికు డని శ్రీ వివేకానందస్వామి పలికియున్నాడు. ఆత్మవిశ్వాసరహితుని మాటను మనుష్యు లెవ్వరును ఆలకింపరు, అతని ప్రార్థనల నీశ్వరు డాలకింపడు.

* * *

15. సాధకుడు దీర్ఘకాలము సుస్థిరముగా, అశ్రమ ముగా, ధ్యానోపవిష్టుడై యుండుట కెట్టి అంగవిన్యాసము అనుకూలించునో, అట్టి అంగవిన్యాసమును "ఆసన" మందురు. కాని వెన్నెముక వంకర తిన్నగా నిలిచి యుండ వలెను. ఎదురురొమ్ము, మెడ, తల ఒకే సమరేఖగా నిలిచి యుండవలెను. అప్పుడు శరీరముయొక్క ఊర్ధ్వభాగపు భార మంతయు బరెముకలపై నిలిచి వక్షఃప్రదేశము వంగిపోక తిన్నగా నిలిచియుండును. గూనుగా వంగి కూర్చుండుట ఆరోగ్యకరముకూడ కాదు.

16. ప్రపంచము అవాస్తవికమనియు, క్షణభంగుర మనియు, బ్రహ్మ మొక్కఁడే సత్యమనియు, హృదయము నందు సుస్థిరవిశ్వాస మేర్పడువఱకును, ధ్యానవేళయందు నీ మనస్సు చలించుచునే యుండును. ఇంద్రియభోగతృష్ణ ఎంతమేర తఱిగిపోవునో, అంతమేర ఈశ్వరప్రేమ పెరిగి, మనస్సు శాంతిల్లును. ఈశ్వరప్రేమానుభూతి అణుమాత్ర మేని లభించినయెడల ఐహికభోగములు తుచ్ఛములుగా, అరుచికరములుగా నుండును.

* * *

17. జపము, ధ్యానము, పూజ, స్తోత్రము, స్మరణ మననములు, శాస్త్రపఠనము, సాధుసాంగత్యము, భగవ ద్విషయకసంభాషణము, వివిక్తస్థలావాసపరమార్థచింతన: వీనిలో నిన్నేది — సమయానుకూలమై, మనోభావాను సారమై—ఆకర్షించి, ఆనందదాయకముగా నుండునో, ఆ ఆనుకూల్యమును చేపట్టి, ఆ కర్మమున ప్రవర్తిల్లుము. కాని జపధ్యానములు అన్నిటికన్న ముఖ్యములు నీ వెంత కార్య నిమగ్నుడవై యున్నను, వ్యాధిపీడితుడవై యున్నను, బలహీ నుడవై యున్నను—దురదృష్టకాలముననైనను, విపద్వేళలం దైనను—వాని నొక్కదినమేని విడనాడకుము. అట్టి స్థితు లలో, నీ సాధనను పూర్తిగా నిర్వహించుట శక్యముకా కున్నను, అనుకూలముగా నున్నను, ప్రణామ మాచరించి, ప్రార్థన సలిపి, 10, 15 నిమిషముల పాటైనను జప మొనర్పుము.

* * *

18. బుద్ధిమంతు డెవ్వడును తన వ్యాధినిదానమును తానే చేసికొని, వైద్యగ్రంథసాహాయ్యముతో ఆ వ్యాధికి తానే ఔషధనిర్ణయము చేసికొనడు. వ్యాధివిషయమున చికిత్సకుని సలహాలను పొందవలెను. అట్లే అనేక గ్రంథములను, శాస్త్రములను, పఠించినవాడు ఒక సాధన తన కనుకూలమైనదని తానే నిర్ణయించుకొనెనేని, వాని బుద్ధి సంశయములతోను, అనుమానములతోను సంక్షుభితమై, పురోగమనము విఘ్నితమై, పరిశ్రమము వ్యర్థమైపోవును. హానికూడ కలుగవచ్చును. ఇందుకు కారణమేమనగా వివిధ శాస్త్రములు పరస్పరభిన్నములును, ప్రత్యక్షవిరుద్ధములును, అగు మార్గములను, బోధనలను చేయును. అవి వివిధ ప్రకృతులు, వివిధసామర్థ్యములు కలిగి వివిధజీవితాశ్రమములలో నుండువారికొఱకుద్దేశింపబడియుండును. కావున నీ స్థితికి పూర్ణానుకూలమైయుండున దిది యని నీవే నిర్ణయించుకొనుట ప్రాయికముగా అపాయకరముగా నుండును. నీకు సరియగుమార్గమును చూపగలవాడు గురువొక్కడే. పారమార్థికజ్ఞానము గురువునొద్దనుండియే ప్రత్యక్షముగా ఆర్జించుకొనవలసియుండుట కిదియే కారణము. గురువు చేయు మంత్రోపదేశము, ఆయన యొసగు బోధలు—వీనియందు మాత్రమే నీవు అనుసరింపవలయు మార్గముండును. ఆయన ఉపదేశములను పూర్తిగా అనుసరించి — ఆ ఉపదేశములందును, ఆయనయందును, పరిపూర్ణ శ్రద్ధావిశ్వాసములతో —సాధనలాచరించితివేని, కాలపరిపాకమున నీకు విజయము లభించుట సిద్ధము. ఏది ఎట్లున్నను, మఱియొకరి మాట విని

ఈ సాధనలను విడనాడి, వేఱుమార్గములను పట్టవలదు. ఒక దానినుండి మఱొకదానికి దుమికితివేని, త్రోవతప్పి అగతికముగా కొట్టుకొనిపోవుదువు. ఏమియు సాధింపలేక పోవుటయే దానిఫలము.

* * *

19. శ్రద్ధ అద్భుతఫలముల నొసగును — అశక్య విషయములనుకూడ శక్యములుగా నొనర్చును. శ్రద్ధ పొడి నేలమీదకూడ నౌకావిహారము చేయగలదు. సంశయాత్మ చీలమండలోతునీటిలోనే మునిగిపోవును.

* * *

20. ఆశాశీలమే జీవము. సర్వబల, సర్వప్రయత్నముల కు ఆశాశీలమే మూలము. నిరాశోపహతుడైనవాడు మరణయాతనల ననుభవించును—జీవన్మృతుడగును. జీవితాంతమువఱకును ఆశ నంటిపట్టుకొనియుండుము. ఈశ్వర సాక్షాత్కృతిలభించు నను ఆశను మరణకాలమువఱకును విడనాడవలదు. ఆయన సంకల్పించెనేని తన యనుగ్రహ వృష్టిని నీపై నెప్పుడైనను కురియగలడు—ఈ విశ్వాసము కలిగియుండుము. ఆయన యొకవేళ నీ యంతిమక్షణమున నేని, నీకు సాక్షాత్కరింపవచ్చును.

* * *

21. ఈశ్వరుడు తన అపారకృపావిశేషమున గురువు ద్వారా సిద్ధిమంత్రమును (ఇష్టమూర్తి పేరుగల నిగూఢాక్షర వ్యూహమును) — తన గర్భగృహద్వారమును తెఱచు తాళపుచెవిని — నీ కందజేసినపుడు ఆయన నీకు తన్ను

పూర్ణముగా నిచ్చివేసికొనెనని ఎఱుగుము. కానీ నీ వా విష యమును దృఢముగా నమ్మియుండుట అత్యంతముఖ్యము. అజాగ్రత్తవలననో, సంరక్షణాలోపముననో, ఆ అమూల్య మణిని కోల్పోయితివేని, నీ వాయనయనుగ్రహము నొందు టకు అపాత్రమ వగుదువని ఎఱుగుము. అమూల్యమగు ఆ ప్రసాదమహత్త్వమును యుక్తరీతిని గ్రహించుటనగా పరమ గమ్యమును చేరువఱకును, శక్తివంచన మేమాత్రమును లేక, త్రికరణశుద్ధిగా, మంత్రమును జపించుచు, గురుని ఉపదేశ ములను ''తు'', ''చ'' తప్పక పాటించుచుండుటయే. ఆయన ఋణమును కొంతవఱకైన తీర్చుకొనుమార్గ మది యొక్క టియే. నీ యత్యంత సన్నిహితులకన్నను, ప్రియతముల కన్నను, ఆయనయే నీకు సన్నిహితుడు, ప్రియతముడు అని నీకు ఎంతవిస్పష్టముగా గోచరించునో, అంతగా నీ కాయన కృప లభించుచుండును. ఆయన కృపాఫలముగా నీ వీ జీవిత మునసే శాశ్వతానందము ననుభవించుచుందువు.

* * *

22. ఈశ్వరునియెడ భక్తిప్రేమ లభివృద్ధినొందు దనుక ఈ ప్రపంచము అనిత్యమనియు, అసారమనియు సాధకుని కెఱుకపడదు. మనస్సు అవిభాజ్యము. దానిని వేర్వేఱు అఱలుగా విభజించుట—ఒక అఱ భగవంతుని కిచ్చి,తక్కిన అఱలలో పేరుప్రతిష్ఠలకొఱకు, ఇంద్రియవిషయ భోగములకొఱకు కోరికలు నిండించియుంచుట—అలవికాదు. మనస్సు నంతయు భగవంతునికి సమర్పించినగాని, ఆయన సాక్షాత్కృతి లభింపనేరదు. అట్లొనర్పజాలనివాడు ఎన్నియో

పొందవలెనని మన యభిలాష. వెఱ్ఱికోరిక! మిత్రమా, అది అసంభవము.

*　　　　*　　　　*

26. ఈశ్వరుడు వచ్చి "నీ కేమి కావలెను? నేను కావలెనా—పేరుప్రతిష్ఠలు, ఆయురారోగ్యభోగభాగ్యములు కలిగి కళత్రపుత్త్ర పౌత్త్రులతోడి నూఱేండ్ల సుఖజీవనము కావలెనా?" అని యడిగెనేని, కోటికొక్క డెవడో తప్ప అందఱును రెండవవరమునే ఇమ్మని పరమాసక్తితో ప్రార్థింతురు!

*　　　　*　　　　*

27. ఈశ్వరసాక్షాత్కార మర్థించువాడు త్రికరణ శుద్ధిగా — నూటికినూఱుపాళ్ళు — ఆ కృషికే జీవితము నంకిత మొనర్చుకొనవలెను. నూఱవపాలిలో శతలక్షాంశ మైనను, ఇంకను బహుసూక్ష్మాంశమైనను, కొఱవడరాదు. ప్రాయికముగా మన మెల్లరమును ఎట్టి పరిత్యాగము లేక, విస్తారము కృషిచేయక, కష్టింపక, సులభముగా ఆయన సాక్షాత్కృతి నందగోరుదుము. లోకమునకును, ఈశ్వరునికిని పొత్తు కుదుర్పజూతుము. గురువు తన అపారకృపాతిశయము చేత ఈశ్వరుని తెచ్చి మనకు మోక్ష మిప్పించినచో, ఎంతో బాగుండునుగదా అని అనుకొందుము అయ్యో, ఇది జరుగు మాటయేనా? "భగవంతుడు తనకురావలసిన దానినంతయు— పైసలు సైతము — రాబట్టుకొనియే తీఱును."

*　　　　*　　　　*

28. ఈశ్వరు డెవనికి యథార్థముగా కావలెనో,

వాని కాయన లభించును, అక్కఱ లేనివాడు పిశాచపంచకపు సుతి కనుకూలముగా నాట్యము చేయవలసియుండును. అతడు పంచభూతములకు—దేహము యొక్కయు, ప్రపంచము యొక్కయు భౌతిక పదార్థమగు పృథివ్యాపస్తేజోవాయు రాకాశములకు—క్రీడావస్తు వగును; సర్వవిధదుష్ప్రేరణల బలమునకు అవశముగా దాసానుదాసుడై యుండును.

* * *

29. వర్తక ప్రకటనలోని మాటలు యథార్థమని నమ్మి అనేకులు తులము అర్ధరూపాయవంతున బంగారు కొనుటకు పరువులిడుదురు! కాని వాస్తవమగు బంగారే కదా బంగారు, బంగారు జిగిగల దంతయు బంగారుకాదు, కృత్రిమానుకరణము. నీ అర్ధరూపాయ నష్టమే యగును.

* * *

30. ప్రార్థన మనగా ఇప్పటికే కూర్పబడియున్న శబ్దసముదాయమును ఒప్పజెప్పుట కాదు. అట్లుచేయుట నిష్ప్రయోజనము. నీవు ప్రార్థించు వస్తువు నీకెంతో ఆవశ్యకముగా తోచుచు, దాని లేమి నిన్ను బాధించుచుండవలెను, ఆ ప్రార్థన సఫలమగువఱకు నీవు తీవ్రబాధయు, నిర్భర మనోవేదనయు అనుభవించుచుండవలెను; ప్రార్థిత వస్తువును లభ్యపఱచుకొనుమార్గము కనుగొనుట కారాటపడుచుండవలెను, అనుల్లంఘ్యములగు నంతరాయముల నెన్నిటినైన దాటి—నీ జీవితము దానిమీదనే ఆధారపడియున్నట్లు—గాఢాతిగాఢముగా పరిశ్రమింపవలెను. అప్పుడుగాని నీ ప్రార్థన మాలకింపబడదు; నీ హృదయవాంఛితము తీర్ప

బడదు. అట్టి ప్రార్థనములే మహోన్నత సింహాసనాసీనుడగు దేవాధిదేవుని చెవినిబడును.

* * *

31. మహోన్నతజ్ఞానము, భక్తి, పారమార్థికత— ఇవి అత్యంతగాఢమగు స్వయంకృషివలనగాని ప్రాప్తింపవు. వానికై అపారముగా పరిశ్రమింపవలెను. అప్పుడే అవి మనకు స్వామ్యములై, సుస్థిరముగా నిలిచియుండి, మనస్సును వర్ణనాతీతమగు ఆనందముతో నిండించును. వీని నెవ్వరును ఇతరులకు దానము చేయజాలరు. సాధనలు శ్రద్ధతో అనుష్ఠింపబడవలెను. అప్పుడుగాని సంసిద్ధి లభింపదు. పారమార్థిక పరిశ్రమము తీవ్రతరమగు కొలది సిద్ధికూడ పూర్ణతరమగుచుండును. శిక్షయు, గాఢపరిశ్రమమును లేక, లభించిన అనుభూతియొక్క మహిమ తఱిగిపోవును, దాని విలువకూడ ఎక్కువగా నుండదు, గాఢపరిశ్రమ ఫలముగా కలుగు అనుభూతి యొసగునంతటి సుఖమును అది ఈయదు. మఱియు, అది ఎంత సులభముగా వచ్చునో అంత సులభముగా పోవును. జీవితములోని భీకరకల్లోలప్రఘాతకాలములలో అది అంతగా ఉపకరింపదు. అపాయములు, కష్టములు, విషమపరీక్షలు, ఆపదలు ఎదుర్కొన్నప్పుడది కొట్టుకొనిపోయి కాన్పింపనే కాన్పింపదు. పారమార్థికతను తన స్వామ్యముగా నొనర్చుకొనుటకు సాధకుడు తద్భావైకభావితుడై (ఆభావమునందే మునిగి) యుండవలెను. అందుచే అతనిప్రకృతియే మాఱిపోయి, పూర్ణముగా క్రొత్తమూర్తిమత్త్వ మతనిలో నావిర్భవింపవలెను. ఈ శరీరముననే మరలజన్మించుటవంటిదిది. ఇదేమి, బాల

క్రీడయా? తన సర్వజీవితము దానిమీదనే ఆధారపడియున్నట్లు భావించి, సాధకుడు పూర్ణ జాగరూకతతో తన యావచ్ఛక్తిని వినియోగించి, పరిశ్రమించిననేగాని ఇట్టి స్థితి సాధ్యము కానేరదు. ఇట్లు పరమార్థము లభ్యమగువఱకు సాధకుడు సాధన లవిరామముగా, ఏకాగ్రభక్తిశ్రద్ధలతో, జరుపుచుండవలెను.

* * *

32. తుచ్ఛమగు నీ జీవాత్మను (దేహాత్మభావము గల ఆత్మను) విడనాడితివేని, నీ యథార్థాత్మను కనుగొనుటయేకాక, ఇతరులనుసైతము స్వకీయులనొనర్చుకొందువు. నీ జీవాత్మను సంరక్షించుకొనయత్నించుకొలది, నీ యథార్థాత్మను కోల్పోవుచుందువు. ఇతరులనుకూడ దూరమొనర్చుకొందువు.

* * *

33. అవిరామపరిశ్రమము సాగించుచుండుము. వీరునివలె పోరాడుము. వెనుకకు తిరిగి చూడనే చూడకుము. సదా ముందుకే సాగుచుండుము. గమ్యమునకు పురోగమింపుము! త్రోవలో అలసిపోయినను, చీల్చివేయబడినను, వికలాంగతనొందినను, సరకుగొనకుము. అభీః! అభీః! నిర్భయుడవై యుండుము, ధైర్యసాహసోపేతుడవై యుండుము. అపజయము అను భావమే నీ హృదయములో ప్రవేశింపకుండుగాక. గమ్యసంసిద్ధియో, శరీరపతనమో, జరుగుగాక! ఇదియే నీ మూలమంత్రమగుగాక! విజయమో, మరణమో! ఇదియే ప్రతిజ్ఞ.

మరణింపవలసినచో వీరమరణ మొందుము. ఇట్లుగాని దుర్గమును ముట్టడింపజాలవు.

*  *  *

31. మూలుగుచు, ఏడ్చుచు, నీ దశకు నీవు జాలి గొనుచు ఉండుట నిష్ప్రయోజనము. "నేను పరమనిర్భాగ్యుడను, తుచ్ఛుడను, అధమాధముడను, దుర్బలుడను; స్వతంత్రముగా నే నేకార్యమును చేయజాలను"— వెఱ్ఱిభావములుకలిగి, శూన్యోద్యములై యుండు జడస్వరూపులమాటలివి. అట్టివా రేకార్యమునైన నిర్వహింపగలరా? గాఢపరిశ్రమ మొనర్పుము. జాగ్రదవస్థాసమగ్రతను కలిగి, ఉద్యమమును సాగించుచుండుము. జయము సిద్ధించుమార్గ మది యొకటియే. "అయ్యో, ఈ మార్గ మింతదూరమే, ఇంత దుర్గమమే" అని చింతించుచు కూర్చుండిన, మార్గము ముగిసి అంత మొందునా? లెమ్ము, నడువనారంభింపుము, నడచుకొలది మార్గము చిన్నదగుచుండును. ధైర్యము, బలము, ఆశాపూరితబుద్ధి: వీని నవలంబించినచో ఎచ్చోటినుండియో సహాయము — ఎదురుచూడనిది — వచ్చును. మార్గము క్రమక్రమముగా సుగమము, సరళము అగును, అతిశీఘ్రకాలముననే గమ్యమును చేరుదువు. ఆ వాంఛితసిద్ధి ఎంత ఆనందదాయకము!

*  *  *

32. జ్ఞానసిద్ధుడగు గురువునొద్ద ఉపదేశముపొందినచో, ఆయనసంకల్పబలముచే, అనుగ్రహముచే, తమ వ్యథలెల్ల ఏదో నిగూఢమార్గమున నంత మొందునని అనేకుల

భావము 'అసాధ్యవ్యాధులు బాగగును; అభిమతసంసిద్ధి నొసగు ఉద్యోగములు లభించును, ఐహికభోగభాగ్యములు ప్రాప్తించును, కుమార్తెల కనుకూలసంబంధములు అప్రశమముగా లభించును, స్కూలుపరీక్షలందును, కాలేజీపరీక్షలందును, విజయము లభించును, వ్యాజ్యెములలో గెలుపు కలుగును; వాణిజ్యవ్యాపారములు అభ్యుదయముచూపును; గృహచ్ఛిద్రము లంతమొందును, శని మున్నగు దుష్టగ్రహపీడచే కలుగు దుర్దశలు శాంతిల్లును, ఇంకను ఇతరశుభము లెన్నెన్నియో చేకూరును!' వారు గురువునర్థించువిషయములకు అంతమే లేదు! ఉపదేశ మనగా పరమార్థమార్గప్రవేశమనియు, దానికిని తుచ్ఛములగు ఈ ఐహికవిషయములకును ఎట్టి సంబంధము లేదనియు వా రెఱుగుదురుగాక. ఇట్టి ఉపకారములకై గురువును ప్రార్థించుట మూఢత; పారమార్థికతాలక్షణమే కాదు. ఆయన శక్తిసమేతుడగు మహేశ్వరుడు కాడు, ఐహికవాంఛితప్రదాత కాడు, ప్రపంచజనభాగ్యవిధాత కాడు. ఇట్లాయనను ప్రార్థనలతో పీడించుచుండుట దుష్ప్రవర్తనము. ఇట్టి ప్రార్థనలుచేయుశిష్యుడు గురువునకు కోపపాత్రుడగును కాని కృపాశీర్వచనపాత్రుడు కానేరడు. గురుశిష్యులకు గల సంబంధము కేవలపారమార్థికరూపమైనది—పారమార్థిక విషయములందుమాత్రమే అది వర్తించును.

* * *

36. ఫలాకాంక్షతో చేయు సేవార్చనలు వట్టి బజాఱుబేరమువంటివి. ఈ దృష్టితో యథార్థపారమార్థికత

నీ మనస్సునుండి తుడిచివేసి లేచినిలుచుండి, వీరపురుషోచిత ముగా ఇట్లనుము "నేను చేయజాలని దేమైనకలదా? నేను అమృతపుత్త్రుడను, అమృతత్వము నా 'జన్మహక్కు', ఏదియు దానినుండి నన్ను తొలగింపజాలదు!"

* * *

40. దౌర్బల్యముగాని, నిరుత్సాహముగాని, నీ చిత్తము నెప్పుడైన నావేశించినచో ఈపద్యమును* స్మరించు కొనుము

ఏను దైవంబఁ, దద్భిన్న మేమి కాను.
ఆ యఖండపరబ్రహ్మ మౌదు నేను,
వ్యథయు క్లేశంబు నను స్పృశింపంగ లేవు.
సచ్చిదానందమేను. నైసర్గికముగ
నిత్యముక్తుండ. భీతిన న్జేరఁగలదె?
ఉల్లమా పల్కు "ఓహో! తత్సదోమ్!" అఁటంచు.

* * *

41. ఈశ్వరుని స్మరించి, ఆయనను గూర్చి నీచేత నైనంతగా చింతింపుము. నీ కాయనయే స్వకీయుడనియు, నీ ఆత్మకన్న ఆయనయే ఎక్కువ సన్నిహితు డనియు, ఎక్కువ ప్రియుడనియు ఎఱుగుము. ఈ లోకమునను, పర లోకమునను ఏకైకశరణము, ఏకైక బలము, అగు ఆయన నొక్కనినే త్రికరణశుద్ధిగా ప్రేమింపుము. మానవుడు తన

---

* ఆంగ్ల పద్యమునకు తెనుగు.

ప్రేయసినిగూర్చి తలచుకొనును. అట్లు తలచుకొనుటచేత హర్ష సుఖములుపొందును. అత డెప్పుడును ప్రేయసితోడనే ఉండగోరును, తన బుద్ధి నితరవిషయములపై మరల్చుసంభావణలయెడ కినుకబూనును. ఐనను, ఇట్టి ఐహిక ప్రేమకు— ప్రాపంచికవిషయములన్నిటి వలె — కొంత కాలమునకు వియోగము, అంతము, కలుగును. కాని ఈశ్వర ప్రేమకు అంతముకలుగదు. అది వెచ్చింపశక్యముకాని నిధానము! అది తరుగకోలది, దప్పి యెక్కువగుచుండును; చివరకు ఆనందపారవశ్యమున నిన్ను నీవే మఱచి, దానిలో లీనమై పోవుదువు. అప్పు డీ జీవత్వము ద్రవించి యదృశ్యమైన, దేవత్వము తత్ స్థానము నాక్రమించుకొనును. ఈ శవప్రాయ అస్తిత్వస్థానమున దివ్యచైతన్యము (శివత్వము) ప్రవేశించి ఆత్మను తేజరిల్లజేయును. మరణతాండవము శాశ్వతముగా అంతమొంది, నీకు అమృతత్వము (మోక్షము) లభించును.

* * *

42. పారమార్థికబోధనలు నీవు కావలసినన్ని చదివినావు, విన్నావు. ఆ బోధనలు కొంతవఱకైన నీ నిత్యజీవితములో అనుష్ఠింప యత్నింపవేని, అవన్నియు నిష్ప్రయోజనములగును. ఇతరు లెవ్వరును నీకొఱ కేమియు చేయించిపెట్టజాలరు, స్వయంకృషియే నీ కుపకరింపగలదు. పరిపూర్ణశ్రద్ధాభక్తులతో పరిశ్రమింప నుపక్రమించితివేని, ఈశ్వరుడు నీకు సహాయపడి తన కృపను నీకు ప్రసాదించును. అట్టిసాధకుని భారమును ఈశ్వరుడు స్వయముగా తన భుజముల మీదనే మోసికొనివచ్చి, కొంతదూర మతనికి దారిచూపి

పిలుచుకొనిపోవును. స్వయంకృషి ప్రథమము, ఈశ్వరకృప ద్వితీయము, సత్యానుభూతి చివరది.

* * *

43. యథార్థపారమార్థికత నార్జించుకొనుట అత్యంత కష్టము. ఎల్లరు దానిని సాధింపజాలరు. సాధకునికి స్వకీయ సత్త్వము (Substance) కొంత ఉండవలెను—పురాకృత పుణ్యకర్మము, (లేక, ఆజన్మసిద్ధములగు శుభసంస్కారములు, అనగా వాసనలు), ఆర్జవము, నిష్కాపట్యము, హృదయాంత రాళమున నేదో యొక అభావబోధము (Feeling of want; ఏదో లోపించియున్నదను భావము). ప్రేమమూర్తియు, దయాపరిపూర్ణుడును, అగు శ్రీగురుదేవుడే (శ్రీరామకృష్ణుడు) ''పచ్చిబెండుకట్టె''గా—రగులుకొని కాలుట కెంతో తడవు ఊద నవసరమైనదిగా—నుండుదానిని, అనగా, కేవలము ఐహికబుద్ధులగువారిని, చూచువాడేకాడు. ''ఈ జన్మమున కాదు వీరికి పరమార్థసిద్ధి'' అని పలుకువాడు.

* * *

44. మిక్కిలి అలసటను, శోషణభావమును కలిగించు నంత దీర్ఘకాలము జపధ్యానములు - బలాత్కారముగా - జరుపరాదు. అందువలన ఉపకారముకన్న అపకారమే అధికముగా కలుగును. జపధ్యానములకు వినియోగించు కాలమును, శక్తిని, మెల్లమెల్లగా, కొంచెము కొంచెముగా అధికపఱచుచుండుము. చిత్తశుద్ధి, అగాధాసక్తి, దృఢసంక ల్పము. ఉన్నచో కాలపరిపాకమున, ఈశ్వరానుగ్రహము వలన, నీ యీప్సితార్థము పూర్తిగా సఫలమగును.

**45.** భక్తిపూరితబుద్ధితో, పట్టుదలతో, ఓర్పుతో, జపధ్యానములు సాగించుచుండుము. క్రమక్రమముగా మనస్సు ప్రశాంతమై, ధ్యానము అగాధ మగును, ధ్యాన పిపాస కలుగును. ఒక్కనాడైనను ధ్యానముతప్పిపోయిన యెడల—మత్తుపదార్థమున కలవడినవాని కా పదార్థ మొక నాడు వేళకు లభింపనట్లు —, సర్వము చప్పగా తోచును. కీ లొకటి తొలగిపోయినట్లు మిక్కిలి బాధగా, వేదనగా, నుండును. ఒంటరిపాటున, దీర్ఘకాలము ధ్యానమగ్నుడవై యుండ నభిలషింతువు

* * *

46 బ్రహ్మము, శక్తి, పురుషుడు(విశుద్ధాత్మ), ప్రకృతి (జగత్తు), వీనిని ఒకటిగానుండు రెండు అనిగాని, రెండుగా నుండు ఒకటి అనిగాని, చెప్పవచ్చును. నిజమున కవి అభిన్నములు. ద్వంద్వతాభావము — అర్చకుడు, అర్చితుడు అను భిన్న భావము—మనసులో నిలిచియుండునంతవఱకే భిన్నతా భావము నిలిచియుండును.

* * *

47 గురువునుగూర్చిగాని, ఇష్టమూర్తినిగూర్చిగాని, దేవదేవీ మూర్తులను గూర్చిగాని కలలుగనుట మిక్కిలి శ్రేయస్కరము. అందువలన మనస్సునకధికమగు ప్రోత్సాహము, ఆనందము కలుగును. కాని అట్టి స్వప్నములు తఱుచు రాకుండినచో అసుఖ మొందకుము, ఖిన్నుడవు కాకుము. అవి వచ్చినట్లు ప్రతివానితోను చెప్పకుండకుము, ఇచ్ఛ వచ్చెనేని నీ గురువునకు చెప్పవచ్చును. కాని కలలోని ప్రతి

భాగమునకు అర్థము కనుగొనుమని మనస్సును వేధింప వలదు. కల కలయేగాని అంతకన్న అధికము కాదుగదా. దానియంతటిలో సామంజస్యము ఉండునని తలచుట వెఱ్ఱి. ఆదేశము (ఈశ్వరాజ్ఞ, లేక, మార్గనిర్దేశనము) లందును, ధ్యాననిమగ్న వేళలందు లభించు సాక్షాద్దర్శనము (Intuitive perception) నందును. ఉపలబ్ధి (Realisation) యందును మాత్రమే అవి యుండును. అట్టి విధములుగా ప్రాప్తించిన సత్యము సంశయాతీతము. ఆ సత్యానుభూతిని పొందినవాని జీవిత మంతయు మాఱిపోయి అతడు దైవమగును. అట్టి యనుభూతి ప్రతివానికిని లభింపదు. సుదీర్ఘ కాలము, గాఢ తపస్సాధన లభ్యసించినఫలముగాను, భగవత్కృపాఫలము గాను అది లభించును.

* * *

48. కొందఱు స్వప్నమున నొక మంత్రము నొందుదురు. కాని పెక్కుతడవ లా మంత్రము శాస్త్రనిర్దేశానుసారమైనదిగా నుండక, ఆ మానవుని ఊహాజనితముగానో, ఇష్టానుకూలమైనదిగానో, ఉండును. ఐనను అత డా మంత్రమును సుస్థిరశ్రద్ధావిశ్వాసములతో నిరంతరము జపించు టభ్యసించెనేని, కాలక్రమమున, ఆ మంత్రమూలముననే సత్యానుభూతి కలుగవచ్చును.

* * *

49. ఏకాంతప్రదేశమున, మందకాంతిలోగాని, చీకటిలోగాని, ధ్యానాభ్యాసముచేయుము. వదులైన బట్టలు ధరించి, నోటిని మూసికొని, ముక్కుతో ఊపిరిని నడుపు

చుండుము. ధ్యానవేళయందు ఇంద్రియములను అంతర్ముఖముగానుండునట్లు లోనికి మరలింపుము. కన్నులు మూసికొని, మానసికదృష్టిని హృదయముపై అనగా, నీ అగాధాంతః ప్రదేశముపై, నిలుపుము. అచ్చట నీ యిష్టమూర్తి తేజోరూపమున వసించియున్నాడని భావింపుము.

* * *

50. ధ్యానకాలమున దేహాత్మబుద్ధిని, అనగా, నీవే ఈ దేహము అనుభావమును, మఱచిపొమ్ము. నీవు సూక్ష్మసత్తా (Subtle Entity) స్వరూపుడవనియు, నీపై "అహం" భావము ('నేను', 'నాది') అనుభావము అధ్యస్తమైనదనియు తలంపుము, నీ యిష్టమూర్తి శుద్ధచైతన్యస్వరూపుడనియు (of the nature of unconditioned consciousness) —— నిత్యశుద్ధుడు, నిత్యముక్తుడు, స్వయంప్రకాశుడు — నిరుపాధికుడనియు తలంపుము. ధ్యానకాలమున ఆయన శుద్ధబోధస్వరూపము నీ అహంకారబోధమును నిండి వ్యాపించియున్నదనియు, నీ ఆత్మ (అహంకారాత్మ) ఆయనలోపల (శుద్ధచైతన్యములోపల) నున్నదనియు తలంపుము. సత్యదృష్టికి మీ రిరువురును ఒకే మూలసత్త్వము (Substance) నకు చెందినవారు. అభివ్యక్తిలోని తారతమ్యమే భేదకారణము. ఇదంతయు నిర్దుష్టముగా అర్థము చేసికొనుటకు సాధనలావశ్యకము, కేవలవాగ్రూపబోధల వలన తెలియుట అశక్యము. "జీవుడు —— మానవుని జీవాత్మ —— బంధమున జిక్కియున్న ఆత్మ, శివుడు — పరిశుద్ధాత్మ — బంధమున జిక్కకయున్న ఆత్మ."

51. ధ్యానస్థితుడవై యున్నప్పుడు నీ భావపరంపర నీ క్రిందివిధమున సాగించి ప్రార్థింపుము. "ఈశ్వరా, పరమార్థతః నేనును మూలస్వరూపమునకే చెందినవాడను. మాయాబద్ధుడనై, 'నేను', 'నీవు' అను భ్రాంతిలో చిక్కి, ఈ దేహమే నేనని భావించి, చెడుతలంపులకు, చెడుకోరికలకు, చెడుపోకడలకు దాసుడనై యుండుటే నా యీ దుర్దశకు కారణము. ప్రభూ, నే నీ కారణమున వ్యాధికి, దుఃఖమునకు, దౌర్భాగ్యమునకు, నైచ్యమునకు, భయమునకు, వ్యాకులతకు ఎరనైతిని, నీచుడను, అధముడను, అపరిశుద్ధుడను ఐతిని, మరణమునకు, ఐహికవిషయపరిపీడనమునకు లోబడితిని, అసహాయుడను, ఆధారరహితుడను, దిక్కుమాలినవాడను, అల్పుడను, దుర్బలుడను, తుచ్ఛుడను,ఐతిని. ప్రభూ,అనంతకారుణ్యమూర్తీ, నన్ను దయాదృష్టితో చూచి, నా దోషములను, లోపములను, అభావములను, దుఃఖములను, నిర్మూలింపుము. నాయందు ప్రచ్ఛన్నమై, నిర్జీవమై, పడియుండు అనంతశక్తిని నేనప్పుడు మేలుకొల్పగలుగుదును, నీ నిత్యసత్యతత్త్వమును గ్రహింపగలుగుదును,నిత్యము, నిత్యశుద్ధము, నిత్యముక్తము, నిత్యబుద్ధము అగు, నా యథార్థతత్త్వమునుకూడ అనుభూతమొనర్చుకో గలుగుదును!"

* * *

52. ఇష్టదైవధ్యాన మొనర్చుటకు సాధకునికి కొంచెము భావనాశక్తి, కొంచెము అవలోకనశక్తి, ఆవశ్యకములు. భావనాశక్తిరహితుడై, కొయ్యవలె నీరసుడై, దృశ్యప్రపంచమునే నమ్ముకొని, అనాత్మవాదపక్షమునకు మొగ్గుదృష్టిగలిగి,

యుండరాదు. ఇష్టమూర్తి కృపాప్రపూర్ణ ముఖాకృతితో, హృదయకుహరమునో, హృదయాబ్జమునో అధిష్ఠించి యున్నట్లు సాధకుడు భావనారూపమున చూడవలెను. అట్లే యోగశాస్త్రమునందలి షట్చక్రములు — షట్పద్మములు, లేక నాడీగ్రంథులు (Nerve Plexuses) — శరీరములో భౌతికరూపమున నుండవు, కంటికి కానిపింపవు. కాని, పర మార్థసాధకులు ఊహించి, తమలో ప్రచ్ఛన్నముగా నిలిచి యుండు మహాశక్తి నిధానములుగా వానిని తలపవలెను. యోగాభ్యాసమూలమున వానిని మేలుకొల్పవలెను. ధ్యానము గాఢము, అగాధము అగుకొలది, మనస్సు క్రమాధికముగా పరిశుద్ధము, ఏకాగ్రము అగును, ప్రచ్ఛన్నమై, నిద్రాణమై, పడియుండు ఆ శక్తియు మేలుకాంచి, క్రమ వికాసమునంది, చివరకు పరమానందదశయగు భావాతీతనిర్వికల్పసమాధిగా పరిణమించును.

* * *

53. కన్నులుమూసికొనియే ప్రాణాయామము నభ్యసింపవలెను. అప్పుడు ఇష్టమూర్తిరూపమును ధ్యానించుటకు మారు ప్రాణాయామసాధనపై దృష్టిపఱపుము. యథాప్రకారము ఎడమచేతివ్రేళ్ళపై లెక్కించుచు, నీ మంత్ర జపముచే నిర్ణీతసంఖ్యవచ్చునట్లు చూచుకొనుచుండుము. ఈ క్రియావిధానములు గురువునొద్ద నేర్చుకొనవలెను. లోనికి గాలిపీల్చుకొనునప్పుడు పారిశుద్ధ్యము, దయ, బలము, ధైర్యము, మున్నగు దివ్యసుగుణములను పీల్చుకొనుచున్నట్టు భావింపుము, వెలుపలికివిడుచునప్పుడు నీలోని లోపముల

నన్నిటిని — చెడుతలంపులు, మాలిన్యములు, సంకుచితత్వము, ఈర్ష్య, దుష్టమనోవృత్తులు మున్నగువానిని— నీలోపలినుండి వెలికిద్రోయుచున్నట్లు భావింపుము.

* * *

54. నీ యిష్టమూర్తి నీలోపల, నీ హృదయాంభోజము నధిష్ఠించియున్నట్లు ధ్యానింప నీ కశక్యముగానుండునేని, నీయెదుట నొకసింహాసనమునో, పద్మమునో అధిష్ఠించి యున్నట్లు భావించి ధ్యానింపుము. ఇందు మొదటిది నిస్సంశయముగా ప్రశంసనీయము, శ్రేష్ఠతమము. ఏలయన ఆ విధము నవలంబించినప్పుడు సాధకు డాయనను తన హృదయగర్భాంతరాళమున నిలుపుకొని దర్శింపగలడుగదా. రెండవ విధమున ఆయనను వెలుపలనుండువానిగనే భావింపవలెను. కావున క్రమేణ, అవిరామపరిశ్రమ మూలమున, ఆయన నీలోపలనున్నట్లే భావించి అచటనే దర్శింప యత్నించుచుండుము. మానవు డొకనిని ప్రేమించినచో, ఆ ప్రేమ మధికమగుకొలది, అతనిని తన కత్యంతసమీపమున—హృదయాంతరాళమునకు హత్తుకొని — ఉంచుకొనుటకుగదా వాంఛించును. "చిత్తమా, నీవును నేనును తప్ప నిం కెవ్వరును ఆయనను చూడకుందురుగాక!"

* * *

55. నిర్దిష్టాసనమున కూర్చుండి ప్రాతస్సాయంవేళలందు దీర్ఘకాలము జపధ్యానము లనుష్ఠింపజాలవేని, ఇతర వేళలందును; సుఖముగా నుండువిధమున కూర్చుండియో, వేఱురీతినో, నీకు జబ్బుగానున్నచో పక్కపై పరుండియో;

వాని ననుష్ఠింప వచ్చును. లేక వేకువ జామున—నిద్రమత్తుగా నుండక, అలసట లేకయున్నచో—పక్కపై కూర్చుండి అభ్యసింపవచ్చును. కాని నిర్ణీతవిధమున జపధ్యానము లను ష్ఠించినచో మనస్సు సులభతరరీతిని స్వాధీనమగును. నడచు నప్పుడును, పయనించునప్పుడును, ఏ దేని పని చేయుచున్నప్పు డును, ఈశ్వరస్మరణముకై మంత్రమును మానసికముగా—లెక్కింపకయే—జపించుచుండవచ్చును. కాని అట్టి సమయ ములందు ధ్యానింపవలదు. చుట్టుప్రక్కలనుగమనింపకుంటి వేని విపత్తులుకలుగవచ్చును. కాలము అమూల్యము, జీవి తము పరిమితము, అనిశ్చయము, ఒక్కక్షణమైనను వ్యర్థ పుచ్చకుము.

* * *

56. గుణదోషములకలయికయే మానవుడు. ప్రతి వానియందీ రెండును—ఏదోయొకటి ఎక్కువగ, ఒకటి తక్కువగ—నిలిచియేయుండును. ఇతరులలో దోషములను, లోపములను వెదకుటకన్న నీలోనున్నవానికై వెదకుము. ఇతరులగుణములను నీ దోషములను అధికతరములుగా నెన్ను చుండుము. ఇతరుల దోషములను నీ గుణములను స్వల్పతర ములుగా భావించుచుండుము. పుండ్లమీదను, పెంటమీదను వ్రాలు ఈగవలెకాక, పుష్పములచే నాకర్షింపబడుతుమ్మెద వలె నుండుము. ఇతరులనుగూర్చి ఖండనరూపవిమర్శ లొన ర్చుటయు, వ్యర్థప్రసంగములందు కాలయాపన చేయుటయు, ఆత్మసంస్కృతికి హానికరములు.

57. అవతారమూర్తులు మాత్రమే దోషలోపరహితులై, సర్వసద్గుణసహితులై యుందురు. సిద్ధపురుషుని యొక్కయు, మహోన్నత పారమార్థికభూమికలంది పరమభక్తిశ్రేష్ఠులనబడు ఆధ్యాత్మికబోధకునియొక్కయు, పరిపూర్ణాధికారియగు గురువుయొక్కయు, ప్రవర్తనములును చర్యలును కేవల దోషలోపరహితములుగా నుండకపోవచ్చును; వారి నిర్ణయములు పొరపాట్లుగా నుండవచ్చును, ఏదో ఒకవిధమగు గ్రహణశక్తి లోపములుకూడ వారిలో నుండవచ్చును. కాని వారి అసామాన్యగుణోత్తరతా ప్రాబల్యము వీనినన్నిటిని మఱుగునకుద్రోసి, వారిలోపములను, స్వాభావికవైపరీత్యములనుకూడ వారి శీలమునకు అలంకారప్రాయములుగా కానిపింపజేసి, వారి నధికతర ప్రేమపాత్రులనుగా జేయును. మఱియు, ఈ మహాపురుషులవిషయ మటుంచినను, ప్రేమదృష్టికి ప్రేమపదముల యొక్కయు, ఆరాధితుల యొక్కయు దోషములు, వికారములు, కానిపింపవు.

* * *

58. గురువునందు త్రికరణశుద్ధితోకూడిన భక్తిశ్రద్ధలుండినగాని, పారమార్థికమార్గమున పురోగమించుట అసాధ్యము. గురువుమాటలందెన్నడేని సంశయము, అవిశ్వాసము ఉంపవలదు, వేదశాస్త్రోక్తులవలె నవి పరమపవిత్రము లని ఎఱుగుము, సత్యానుభూతినొందగోరితివేని. గురూపదేశమును పరిపూర్ణముగా అనుసరింపప్రయత్నింపుము. గురువువంటి శ్రేయోభిలాషులు నీకు ఇహమునగాని పరమునగాని మఱెవ్వరును ఉండరని ఎఱుగుము. ఆయన కనబఱచిన మార్గమును

సుస్థిరముగా ననుసరించుటే ఆయనకు యథార్థమగు సేవ చేయుట అని ఎఱుగుము. అందుచే ఆయన కత్యంతప్రీతి కలుగును.

* * *

59. ప్రారంభ దశయందు జపము మిక్కిలి నెమ్మదిగా (Slowly)—మంత్రమును విస్పష్టముగా మనస్సులో నుచ్చరించుచు,—చేయవలెను మొదటి దశలో ఇది చేయుటకు తడవగును, 'గంటకు రెండు మూడు వేలసార్లు కెక్కువగా మంత్రమును ప్రథమదశలో జపించుట సాధ్యమై యుండదు. కాని అభ్యాసము సాగుకొలది, అంతకన్న త్వరితముగా జపింపవచ్చును. కాలక్రమమున గంటకు ఎనిమిదివేల, పది వేల సార్లుకూడ సులభముగా జపించవచ్చును. జపవేళ యందు మనస్సును మంత్రముమీదను, తత్సూచిత ఇష్ట మూర్తి మీదను, మాత్రమే కేంద్రీకరింప ప్రయత్నింపుము.

* * *

60. నీవు స్వయముగా గాఢపరిశ్రమము చేసినగాని, గురువు నీకు సత్యానుభూతి కలిగింపజాలడు. గురువు మార్గమును చూపగలడు, సందేహములను తీర్పగలడు, కష్టములను తొలగింపగలడు; తప్పుత్రోవపట్టితివేని, హెచ్చరింపగలడు; సరియైనత్రోవలో మరల నిలుపగలడు, ఆ త్రోవను కొంత దూరము నీ చేయిపట్టుకొని నడిపినను నడుపగలడు. కాని నడుచుట నీవేచేయవలసిన పని — నిన్నాయన భుజములపై నెక్కించుకొని గమ్యమునకు తీసికొనిపోజాలడు. మార్గము నిస్సంశయముగా దీర్ఘము, దుర్గమము. కాని ఆ కారణమున

నీవు మార్గమధ్యములో కూర్చుండి 'ఇక పోజాలను, శక్తి ఉడిగినది,' అని చెప్పుటయు, భయమొందుటయు, ఆశలు దక్కుటయు తగదు. నిలుచుండి యూరకుందువా? ముందుకైన పోవలెను, వెనుకకైన తగ్గవలెను. వెనుకకు తగ్గితివేని, అప్పటికి లభించినదానినికూడ కోల్పోవుదువు. పురోగమించు కొలది మార్గము సుగమమగును, బలధైర్యములు వచ్చును, ఆనందము ప్రాప్తించును.

* * *

61. సాధకునియందు "సత్త్వము" (Substance) లేని యెడల, ఎంతటిసాహాయ్యమేనియు నిష్ప్రయోజన మగును. విత్తనములు పంట పండని రాతినేలలో చల్లినప్పు డెన్ని నీళ్ళు కట్టినను, ఎంత కలుపు తీసినను, ఏమి ఉపయోగము? కాని బబ్బుభూమి పెక్కువిధములుగా బాగుపఱుపవచ్చును. అప్పు డందు మంచి పంటలు పండును. అట్లే ఐహికబుద్ధులగు జనులు గురూపదేశములను మనఃపూర్ణవిశ్వాసముతో, పట్టుదలతో, అవిరామపరిశ్రమముతో, అనుష్ఠించినయెడల వారు జీవిత పరమార్థమును సాధింపగలుగుదురు. జీవిత మప్పుడు ఆనందపూర్ణము, మధురము అగును.

* * *

62. ముందుకు నడువుము! ముందుకు సాగుము! ఇటు నటు చూడవలదు. జ్యోతిర్దర్శనాదియోగసిద్ధులు లభించినచో, వానివిషయమే పెట్టుకొనవలదు. ధ్యాన మభ్యసించు కొలది, వివిధయోగసిద్ధులు తమంతటతామే లభించును, అలౌకికపదార్థము లెన్నోరీతులవి కానిపించును, అందుచే

నీకు కొంత సుఖముకూడ కలుగవచ్చును. కాని వానినంటు కొని అచట నిలువవలదు; అట్లు నిలిచినచో, అంతకుమించి పురోగమన మంతగా పొందజాలకపోవుదువు. ఎల్లప్పుడు, దృష్టినంతయు గమ్యముమీదనే నిలిపియుంపుము; ఈశ్వరు నందు భక్తిప్రేమలు వృద్ధినొందించుకొనుట ఎట్లు, మనస్సును ఆయనయందు మగ్నముచేయుటెట్లు, ఈజీవితమునందే ఆయ నను సాక్షాత్కరించుకొనుట ఎట్లు, అనునవే నీ ఏకైక వాంఛయు, లక్ష్యమును, అగుగాక!

* * *

63. సిద్ధులును, విభూతులును (యోగప్రాప్తములగు అమానుష శక్తులు) భోగప్రలోభనమును (Temptation) కల్పించి మాయాభ్రాంతిబంధములలో చిక్కించి, గమ్యము నుండి క్రిందికి దిగలాగును. ఈ సిద్ధులందలిఆసక్తి ఈశ్వర దర్శనసిద్ధికి ప్రబలాంతరాయ మగుటయేకాక, సాధకుని క్రమేణ చెఱచి, నాశమునొందించును. యోగసిద్ధులు భగవ త్ప్రేమకారకములు కావు, మోక్షమార్గములును కావు. పేరుప్రతిష్ఠలు కల్పించుట, లోకమున అభిమతార్థోపభోగము కలిగించుట ఇంతకన్న అవి ఏమియు చేయజాలవు. ఈ వాంఛలను — ఇవి ప్రాయికముగా అపవిత్రములుగా నుండును— ఈడేర్చుకొనుటకై మానవు డితరులను నాశ మొనరించుటకుకూడ వెనుదీయడు. కావున యథార్థభక్తులు వీనిని విఘ్నప్రాయములుగా భావించి త్యజింతురు.

* * *

64. పెక్కుతడవలు మన ప్రార్థనలు వట్టి నోటి

మాటలే—పెదవులనుండియే అవి వెలువడును; హృదయ మునుండి కానేకాదు—కావుననే అవి నిష్ఫలములగుట. హృదయమునుండి చేయబడు ప్రార్థనలు సిద్ధించుట నిస్సంశయము. జపధ్యానములవలన ఎట్టి ఫలముగాని లభించుట లేదని నీకు తోచినయెడల అంతర్ముఖుడవై నీలోగల లోపములను—పాత్రములోని జల మంతయు కాఱిపోవు సెలియలను, కలుగులను—పరిశీలించికొని, వానిని సవరింప యత్నింపుము. ప్రాపంచికతృష్ణాధిక్యము—ఇంద్రియ విషయములపై, కామకాంచనములపై, గాఢవాంఛలు — కలవాని మూర్తిమత్త్వమును జపధ్యానములు మార్పజాలవు. కాని ఆ కారణమున జపధ్యాననిరంతరాభ్యాసము చాలింపవలదు, సకాలమున ఇష్టసిద్ధులు పొందితీఱుదువు — క్రమక్రమముగా లౌకికభోగములు అవాస్తవికములుగా, చప్పిడిగా తోచును, భగవత్ప్రేమయు, భక్తియు అభివృద్ధినందును, ఆయనయందుమాత్రమే నీకు ఆనందము కలుగును.

* * *

65. మన మోక్షాసక్తి వట్టిబూటకము; అయథార్థము, హృదయపూర్వకము కాదు. మనయొద్దకు ఈశ్వరుడు వచ్చి "ఇదిగో నీకు మోక్షమును ప్రసాదించుచున్నాను, కైకొనుము" అన్నచో మనకు భీతికల్గి, దిక్కుతోపక "వలదు, వలదు, ఇప్పుడు నాకుముక్తివలదు, నాకిప్పుడే ముక్తిలభించిన యెడల నాకు సన్నిహితులై ప్రేమపాత్రములుగానుండు వీరి గతి యేమగును? నేనేగదా వీరి కాధారము! నేను మరణించిన పిదప ముక్తి నిమ్ము!" అని మొఱపెట్టుకొందుము.

కట్టెలు కొట్టుకొనివచ్చి జీవించుచుండిన ముసలివానికథ నీకు జ్ఞప్తిలేదా? తాను మోయు భారముచే డస్సి వాడు మృత్యు దేవతయగు యము నిట్లు ప్రార్థించెను. "స్వామీ, ఈ భార మును నే నిక మోయజాలను, నన్ను విముక్తుని చేయుము!" కాని ఆ దేవత వచ్చి వానిని తీసికొనిపోవుదు నని చెప్పగా వా డిట్లనెను: "స్వామీ, వలదు, వలదు, ఈ కట్టెల మోపును నా తలమీదికెత్తి సాయపడుమనియే నేను నిన్ను ప్రార్థించినది!" కాలు సేతులు కట్టి ఈ లోకమునకు బంధింపబడియుండువా రందఱి దురవస్థయు ఇదియే. తమ కష్టములనుండి తప్పించు కొనుటే వారు కోరునది—నిజముగా ముక్తినొందుటకు కాదు.

* * *

66. నీవు గాఢముగా కోరు ఈప్సితార్థములు నీకు తప్పక లభించును. నీకు నిజముగా ఈశ్వరుడే కావలసి యున్నచో, నీ కాయన కాన్పించును, లేక ప్రాపంచిక భోగ ములకై ప్రార్థించితివేని, అవి ప్రాప్తించును. కాని ఇం దేది కోరినను, పరిశ్రమ మవసరము, ఎంతో వేదనతో, గాఢ ముగా, పరిశ్రమింపని దేదియు లభింపదు. లౌకికలక్ష్యసిద్ధికై మానవులు చెప్పరాని ప్రయాసము లెన్ని పడుదురు! ఆలు బిడ్డలకై, ద్రవ్యముకై, ఆస్తిపాస్తులకై, పేరుప్రతిష్ఠలకై, వారు నిద్రా భోజనములుకూడ కోలుపోయి రేయుంబవళ్ళు మనశ్శరీరాత్మలతో గాఢాతిగాఢపరిశ్రమ చేయుదురు. ఒక్క క్షణమేనియు విరామముండదు, విశ్రాంతియుండదు; కాని వారి అభిమతములు పూర్తిగా సిద్ధింపవు. ఏలన, వారి ఆసలకు, కోరికలకు అంతమే ఉండదు! ఆ రీతిగా ఈశ్వరునికొఱకై

పాటుపడితివేని, నీ కాయన తప్పక సాక్షాత్కరించును. మణి కాంచనములు వలదని నీవు గాజుముక్కలతో తుష్టినందు చున్నావు! మనకు మాటిమాటికి దెబ్బలు తగులుచుండును; కాని బుద్ధిరాదు. మహామాయ కల్పించు మాయ అట్టిది! ఈశ్వరానుభూతి కష్టమేగాని, మనోగతి కొకక్రొత్తమార్గము కల్పించి, దానిని పూర్ణముగా ఈశ్వరాభిముఖ మొనర్చిన చో, అది సులభమగును కాని జగన్మాత తన కరుణాకటాక్ష మెవనిపై ప్రసరింపజేయునో వాడే ఇటు లొనర్పగలుగును.

* * *

67. అభిమతార్థము కష్టించినగాని లభింపదనుట నిస్సందేహముగా నిజము. పసిబిడ్డలు మాత్రము అశ్రమ ముగా వారి కోరికలను తీర్చుకోగలుగుదురు. ఏలన తమ అక్కఱలన్నియు తల్లి గ్రహించు నని వా రెఱుగుదురు. తల్లి తప్ప వారి కింకేమియు తెలియదు. ఎప్పు డేదికావలసి యున్నను తల్లి దాని నిచ్చుచుండును, తాము దానిని గూర్చి ఆలోచింపనవసరము లేదు. పారమార్థిక జీవనమున సాధకుడు సర్వవిధములందును కేవలము పసిబిడ్డయే అయిపోవలెను. బిడ్డ ఆకలిమైనచో ఏడ్చును. వెంటనే తల్లి ఇతర కార్యము లన్నిటిని విడనాడి బిడ్డను ఒడిలోనికి తీసికొని పాలిచ్చును. చూచితివా, పసిబిడ్డకూడ తన అక్కఱను తెలుపుటకు ఏడువ వలెను! అట్లే భక్తుడును భగవన్నామముతో ఆయనను పిలువ వలెను, ఆయనతోడివిరహము అతనికి దుస్సహముగా తోప వలెను, తప్తహృదయముతో, అశ్రుపూరిత నేత్రములతో, ఈశ్వరప్రేమకై ప్రార్థింపవలెను. మతేదియిచ్చినను అది

వాని కక్కఱలేదు, దానిని చూడనన్న చూడడు. ఈశ్వరుడే అతనికి వలయును—ఆయన దివ్యశక్తు లతనికి కాబట్టవు, స్వర్గసుఖమేని, స్వర్గవైభవమేని, కాబట్టదు. సంపద, ధనము అతని నిప్పు డాకర్షింపవు, వంగదేశ భక్తాగ్రేసర - కవి రామ ప్రసాదు డిట్లు కీర్తించెను

అమ్మరో! తార! * క్షుద్రభాగ్యమ్ముతోడ
నేమిచేయుదు? నీ ద్రవ్య మిచ్చగించి
యెవ్వ రేడ్చిరి? నాకు నిం కే నిధాన
మిచ్చినను, దానిఁజూచువా రెవరు లేక
మూలఁబడియుండుఁ, గాని యాభీలభవహ
రంబులైనట్టి నీ పదాబ్జంబులిచ్చి
తేని, వానిని మామకహృదయపీఠి
నిల్పి యనిశంబు నర్చింతు నిరతభక్తి.†

* * *

68. మనస్సును వశపఱచుకొనుటయే ప్రధాన విషయము. అది చేయజాలకపోయితివేని, అన్నియు నిష్ఫలములై పోవును. ఈ (వంగ) లోకోక్తిని చూడుము

"ఈ మువ్వురికరుణయు — గురునిది, కృష్ణునిది (ఈశ్వరునిది), వైష్ణవునిది (భక్తునిది) — లభించినను, ఒకదాని కరుణ లోపించెనేని, జీవుడు దుమ్ముగా, బూడిదగా అగునేకాని మఱేమియు కాజాలడు."

---

* శక్తి రూపములలో నొకటి.

† పద్యరూప ఆంగ్లానువాదమున కిది తెనుగు.

ఇందు "ఒకదాని" అని పేర్కొనబడినది మనస్సు. మనస్సు నిగ్రహింపబడెనేని, లోకవిజయము సిద్ధించును. ఆ యొక్క పని— మనోనిగ్రహము—కొఱకే సర్వసాధనలు, అనుష్ఠానములు. శ్రీరామకృష్ణుడొక పాట పాడువాడు. అందు రెండు చరణము లీ యర్థము గలవి.

'నే నెఱిగిన మోన్ తోర్ (మంత్రమును) నీ కిచ్చితిని. ఈ మంత్రముచే నన్నును, ఆపదలోనుండు ఇతరులను నేను రక్షించుచుందును. ఇప్పుడు మోన్ తోర్.'*

* * *

69. సిద్ధపురుషుడైన గురువు గురుపారంపర్యముగా వచ్చుచుండిన మంత్రమునే — యోగులు, ఋషులు, స్మరించి సంసిద్ధినొందినదానినే—శిష్యులకుపదేశించును. తన ఊహలో జనించిన ఏదో యొక మంత్రము నుపదేశింపడు. మంత్రమునందు శ్రద్ధాభక్తులు విసర్జించుటగాని, అది స్వల్ప శక్తిగలదని తలచుటగాని అనుచితము. మంత్రమును సక్రమముగా, దీర్ఘకాలము, అభ్యసించినను మనస్సు ఏకాగ్రము, పరిశుద్ధము, కానియెడ ఆ లోపము మంత్రములోనిదని యెన్నరాదు. లోపము నీలోనిదే అని ఎఱుగవలెను.

---

* ఇచ్చట మోన్ తోర్ (మంత్రశబ్దమునకు బెంగాలీ వ్యావహారిక భాషారూపము) శబ్దములో శ్లేష కలదు. 'మోన్ తోర్' అను బెంగాలీ శబ్దమునకు "నీ మనస్సు" అనియు అర్థము. కావున "ఇప్పుడు మోన్ తోర్" అను వాక్యమున కర్థము "దీని నంగీకరించి, ఉపకారముచు పొందుటో, పొందకుండుటో, నీ మనస్సుపై ఆధారపడియున్నది."

నీలోగల ఇట్టి లోపములను సవరించుకొనకుంటివేని పెదవులతో మాత్రమే జపముచేయుటవలనను, ఆగురునివీడి మఱొక గురువునకు శిష్యుడవౌటవలనను, ఏమి ఉపయోగము కలుగగలదు? జప మెల్లప్పుడు మనోజిహ్వాలు రెంటితో కలిపియే చేయవలెను.

* * *

70. మంత్రము మహత్తరశక్తిమూలమనియు, అది ఇష్టమూర్తియొక్క సత్త్వసారమే అనియు ఎఱుగుము. సూక్ష్మతత్త్వమును చేరుటకు మొదట స్థూలతత్త్వమును పరిగ్రహించుటే మార్గము. ఆ సూక్ష్మతత్త్వద్వారమున సూక్ష్మాతీతతత్త్వమును — మనోవాక్కుల కతీతమగు వస్తువును — ప్రాపింప సాధ్యమగును.

* * *

71. జీవాత్మయొక్క యథార్థతత్త్వమగు పరమచైతన్యస్వరూపముగా అహంకారచైతన్యమును మాఱుపునొందించుటే ధ్యానములోగల రహస్యము. పరమాత్మను, (లేక) సగుణబ్రహ్మమును, జీవాత్మయొక్క హృదయాంతరాళగర్భమున నిలిపి, ప్రార్థనామూలముగను, యుక్తాయుక్తవివేచనమూలమునను, మంత్రజపమూలమునను, మనస్సును ఇంద్రియవిషయాసక్తినుండి విముక్తముచేయ మాటిమాటికి ప్రయత్నించుచుండుటయే ఈ మార్పును సాధించు మార్గము. ఇట్లు మానసము క్రమాధికముగా నిమగ్నమగుచుండును. ఆ విధానము పరిపక్వమై, పరిపూర్ణాభివృద్ధినొంది, నిరంతరతైలధారాసదృశమైనపుడుగాని, మనస్సు ఆదర్శ

మూర్తియొక్క తేజోనందస్వరూపభావముతో, అనగా సచ్చిదానందరూప అఖండపరబ్రహ్మముతో, సంపూర్ణ నిమగ్నత చెందదు. ఈ దశను "భావము" (పారమార్థిక పారవశ్యమహోత్తమదశ), "సమాధి" (దైవముతో నైక్యము నొందు అతీంద్రియబోధదశ) అందురు.

* * *

72. అనుదినము, సుస్థిరముగా, జపధ్యానము లనుష్ఠించుట అభ్యాసపఱచుకొన్నవానికి కాలక్రమమున అవిజరుపుట 'కుతి'గా (దుర్నివారవాంఛగా) ఏర్పడును. ధ్యానము అగాధమైనప్పుడు సాధకున కొకరీతి మత్తు కలిగి, అది అట్లే కొంత కాలముండును. ఉద్ధృతినొందినట్లు తోచును. కావున ధ్యానము ముగిసినవెంటనే లేచుటయు, లౌకికసంభాషణ యందు పాల్గొనుటయు, తగదు. అప్పుడు మాటలాడు నభిలాషయే ఉండదు. అట్లు చేయుటతనికి బాధాకరముగను, మనస్సంక్షోభనముగను ఉండును. ఆ దశ సాధ్యమైనంత సేపు నిలుపుకొనియుండ బ్రయత్నింపుము.

* * *

73. త్రాగుబోతులును, మత్తుపదార్థముల కలవడిన వారును, తమ పానము (త్రాగుడు), మత్తుపదార్థము, వేళకు లభింపనియెడల గాఢవ్యథపాలై, సర్వము తాఱుమాఱుగా నున్నట్లు తలంతురు. యథాప్రకారము జపధ్యానము లభ్యసింపజాలనిదినములలో సాధకులకుకూడ అట్లే తోచును. ఏ యభ్యాసమేని—మంచిదిగాని, చెడ్డదిగాని — ఏర్పఱచుకొన్నవారి కెల్లరకును ఇది సహజమే.

74. "లౌకికులమగు మాకు ముక్తిలభించు ఆశ యేమైనా కలదా?" ఏల లేదు? తప్పక కలదు, పూర్ణముగా కలదు. ఈశ్వరుడు సన్న్యాసులకొఱకుమాత్రమేనా ఉండునది? అందఱును ఆయనబిడ్డలే. లోకమును పూర్తిగావిడిచి యెవరు జీవింపగలరు? సన్న్యాసులమగు మాకుకూడ ప్రాపంచిక కార్యము లుండును. మేముకూడ పరహితమునుగూర్చి చింతింపవలెను, వారి కష్టములను బాధలను విని సానుభూతి చూపవలెను, మా మఠములోనుండునట్టియు, ప్రపంచ వ్యాప్తమగు మాసంస్థలోనుండునట్టియు,సన్న్యాసులయొక్క క్షేమమును విచారింపవలెను, శ్రీ గురుదేవుని ఉద్యమము యొక్క అభివృద్ధిని, వ్యాప్తిని — ఆయన భావముల యొక్కయు, ఆదర్శములయొక్కయు ప్రసరమును—గూర్చి ఆలోచించుచుండవలెను, ఇ వన్నియు అటు లుండగా, బహుప్రదేశపరివ్యాప్తములగు క్షామములవలనను, వెల్లువల వలనను, వ్యాపకవ్యాధుల (Epidemics) వలనను, పీడితులై, ఇండ్లుకోలుపోయి, అన్నార్తులై, దిక్కుమాలి యున్న మన సోదరమానవులయొక్క హృదయవికారములగు వ్యథావిప ద్వార్తలు విని ఘోరదుఃఖితులమై, వానిని ఉపశమింపజేయు మార్గములను, ఉపాయములను అన్వేషింపవలెను. కాని తన కొఱకై చింతించుటకును, పరులకొఱకై చింతించుటకును, అపారభేదముకలదు. మొదటిది మాయ, లేక అవిద్య (అజ్ఞానము) కు సంబంధించినది. రెండవది విద్య (జ్ఞానము) కు సంబంధించినది. ప్రపంచములో నుండుటలో ఎట్టిహానియు లేదు, కాని ప్రపంచములోనివాడవుగా (అనగా ప్రపంచ

మునే నీ సర్వస్వముగా, నీ జీవితపరమార్థముగా, భావించువాడవుగా) ఉండకుండునట్లు జాగ్రత్తపడుము. ప్రపంచములో నుండి, నీ ధర్మములను,కర్తవ్యములను అన్నిటిని, నిర్వర్తించుచుండుము. కాని త్యాగబుద్ధి, అకర్తృత్వబుద్ధి—"చేయువాడను నేనుకాను" అనుబుద్ధి — అసంగత్వము, నీలో నెల్లెడల నిలిచియుండునట్లు చూడుము.

* * *

75. ప్రపంచ మొక దీర్ఘస్వప్నమని ఎఱుగుము. అది నిలిచియుండునంతకాలము ప్రపంచము "వ్యావహారిక సత్య"మనువిశ్వాసముతో నీ ధర్మమును నిర్వహించుచుండుము. కాని అప్పుడుకూడ ఈశ్వరుడొక్కడే పారమార్థిక సత్యమనియు, ఆయనయనుభూతిని పడయుదనుక నిత్య సౌఖ్యము, శాంతి, ముక్తి, లభింపవనియు దృఢముగా విశ్వసించి ఆ విశ్వాసము నేమాత్రము సడలింపక, సుస్థిరముగానుంచుకొని యుండుము. దుర్లభమగు ఈ మనుష్య జన్మ మొందు అపూర్వభాగ్యముకల్గియు, సత్యజ్ఞానము నార్జించుకొనునవకాశము కల్గియు, ఆయన ననుభూత మొనర్చుకొన ప్రయత్నింపవేని, నీజీవితము, తదితర మంతయు, నిష్ప్రయోజనమగును.

* * *

76. నీ మనస్సు ప్రపంచముతోనిండి, ఇంద్రియార్థములయెడ ఆసక్తియు, తృష్ణయు నిలచియున్నంతకాలము, బాహ్యత్యాగము నిరుపయోగము. బైటికిమాత్రమే త్యాగ మొనర్చి, నీ వెచటికి పాఱిపోయినను—అరణ్యములకేని,

పర్వతకుహరములకేని — నీ వెనువెంటనే ప్రపంచముకూడ అచటికి వచ్చి, అనేకరూపములతో నిన్ను వంచించుచు, వశపఱచుకొనుయత్నములు చేయుచు, నీకు క్రొత్తబంధనములు కల్పించుచుండును. నీ యాశ్రమ మేదైనను — గృహస్థువైనను, సన్న్యాసివైనను — నీ దృష్టిని సదా ఆదర్శముపై నిలిపి, దానిని సుదృఢముగా పట్టుకొనియుండవేని, నీకు పతనముతప్పదు, నిన్నెవ్వరును రక్షింపజాలరు.

* * *

77. నిత్యజాగరూకుడవై యుండుము. ఒక క్షణకాలమైనను నీ మనస్సును నమ్మియుండకుము. నీవు సాధించిన పారమార్థికభూమిక యెంత యున్నతమైన దైనను, ఇంద్రియనిగ్రహ మొనర్చితివని పరిపూర్ణముగా విశ్వసింపవలదు— ఏలన, అప్పుడుకూడ పతనము కలుగునవకాశము కలదు. పాపము మాయారూపములనుదాల్చి — ధర్మరూపమును దాల్చియు, దయారూపమునుదాల్చియు, మిత్రరూపమును దాల్చియు — నిన్ను వంచించి తనవశము చేసికొనజూడవచ్చును. దీర్ఘకాలానంతరము నీవు—అంతవఱకావిషయ మెఱుగకయేయుండి—పతనమొందితి వని ఎఱుగవచ్చును. ఈ సత్యము నీ యెఱుకకు వచ్చునప్పటికి వెనుకకుమరలుట ప్రాయికముగా అసాధ్యమైయుండవచ్చును.

* * *

78. నాలు గాశ్రమములలో — పరిపక్వదశనందుటకు యత్నించు ప్రాథమిక దశలలో, ఆత్మాభివృద్ధిమార్గములలో—గృహస్థాశ్రమముకూడ నొకటియేగనుక, మానవ

సామాన్యము వివాహమాడి, గృహస్థులుగానుండుటే మిక్కిలి శ్రేయస్కరము. కాని బ్రహ్మచారిగాని (బ్రహ్మచర్యదీక్ష గైకొని ఉపదేశమందినవాడు) సన్న్యాసాశ్రమము విధ్యుక్తముగా అవలంబించినవాడుగాని, కామకాంచనవ్యామోహమునజిక్కనేని పాతక మొనర్చినవాడై, ఇహపరములకు చెడును. లోకపరిత్యాగ మొనర్చినవారును, వితంతువులును, యావజ్జీవబ్రహ్మచర్యదీక్షకు బద్ధులై, ఆదీక్ష కెప్పుడుగాని — తెలిసి — భిన్నముగా నడచుకొనగూడదు. అట్లు చేయజాలనివారు పెండ్లాడుటకు సందేహింపరాదు. ఇది శాస్త్రసమ్మతముగానుండుటేకాక, వారికిని, ఇతరులకును గూడా, శ్రేయస్కరము. బైబిలులో సెయింట్ పాల్ (Saint Paul) ఇట్లు చెప్పియున్నాడు "తపించిపోవుచుండుటకంటె వివాహమాడుటమంచిది".

* * *

79. ఎల్లరు — స్త్రీలు, పురుషులు — స్వతంత్రజీవనమునకువలయు ధనమార్జించుకొనుశక్తినిచ్చునట్టి ఏదో యొక విద్యాశాఖలో—సారస్వతరూపమైనదో, కళారూపమైనదో, పారిభాషికరూపమైనదో (Technical) ఏదోయొక దానిలో—కడతేఱియుండవలెను. ఇతరులపై ఆధారపడియుండుట దుఃస్థితి, అది జీవితమును దుర్భరమొనర్చును; అట్టి దుఃస్థితిలోనుండువారు సాధనలు, ధర్మకార్యములు, చేయుటయందెంత ఆసక్తిగొనియున్నను, పాపము! వారేమియు చేయజాలరుగదా!

* * *

80. గురుప్రసాదితమంత్రమును హృదయపూర్వక ముగా అభ్యసించుట, తదాదేశానుసారము దైనందినజీవితము నంతయు గడపు తీవ్రప్రయత్నము: ఇదియే గురువున కర్పింపవలసిన "గురుదక్షిణ", ఆయనప్రేమమును, ఆశీస్సులను ఆర్జించుకొని పారమార్థికసంసిద్ధినొందుటకుత్తమోత్తమ మార్గము.

* * *

81. పుత్త్రుడు తన్ను మించవలెనని తండ్రి యెట్లభిలషించునో, అట్లే శిష్యుడు తన్ను మించవలెనని గురువుకూడ అభిలషించును. తండ్రి తనపుత్త్రుని, గురువు తనశిష్యుని, తనకన్న అధికతరుడు కాగోరును.

* * *

82. ఈశ్వరుడే పరమగురువు—గురువునకు గురువు. ఆయనయే సర్వకార్యకర్త. మనుష్యగురువు ఆయునకు ఉపకరణమాత్రుడు—ఆయనశక్తిని శిష్యునికి అందజేయు ఉపకరణము.

* * *

83. "అధికారి" యగు గురువు తన సాధనలచే తాననుభూతమొనర్చుకొన్న గుహ్యాతిమరహస్యమును మంత్రోపదేశమూలమున శిష్యునకందజేయును. "జీవితోపయుక్తము" అనెడు "కొలకఱ్ఱ" (Foot rule)తో కొలిచి, ఆయన ప్రభావమునుగాని, విలువనుగాని నిర్ణయింపజూడవలదు. అట్లు చేయుట ఖూరగాయలవర్తకుడు వజ్రము వెల నిర్ణయించి, అది తొమ్మిదిసేర్ల వంకాయల విలువగలది, అంతకన్నఒక్కకాయ

కృపాసముద్రులుగనుక — అట్లు చేయగలరు, చేయుదురు. పాపులను, వ్యాధాపీడితులను రక్షించుటకొఱకే వారవతరించునది. ఎట్టి పాతకమైనను ఈశ్వరు నంటదు, కాని ఆయన మానవదేహముధరించెనుగాన, తాను శరణమిచ్చిన వారిపాపములు వ్యాధిరూపములై ఆయనపై పడి బాధించును. చేసినపాపము, తీవ్రపశ్చాత్తాపవేదన లనుభవించుట మూలముసను, పాపకార్యము లన్నియు పరిత్యజించుట మూలమునను మాత్రమే పరిహరించుకొనుట సాధ్యము. ఆత్మజ్ఞానాగ్నియొక్కటియే పాపస్వభావమును దగ్ధము చేయగలదు.

* * *

87. ఆస్తికధర్మము (Religion) శిక్షాపరిశ్రమము లవసరములేనిది, తన దనువా రెవరును లేక మార్గమధ్యమున పడియుండువస్తువంటిది. ఊరకే తీసికొనదగినది, అని జనులు తలతురు! ప్రతిమనుష్యుడును శాస్త్రజ్ఞానములేకయే, సాధన లేమియు చేయకయే,—తా నా విషయమున పరిపూర్ణనిపుణతనార్జించినవానివలె, సర్వజ్ఞునివలె, ఆస్తికధర్మమునుగూర్చి తన యభిప్రాయమునిచ్చుచు, సాధనమార్గము కూడ నిర్దేశించును. ఐహికజ్ఞాన మార్జించుకొనుటకు విద్వాంసుడగు ఉపాధ్యాయునియొద్ద ననేక సంవత్సరముల కాలము చదువవలెను. గాఢశిక్షాభ్యాసములు లేకయే పారమార్థికజ్ఞాన మలవడుననియు, ఆస్తికధర్మసూక్ష్మతమ సత్యము లాకళింపునకువచ్చుననియు, భావించుట కేవలము పరిహాసనీయము.

88. ఉపదేశమొందిన కొలది నాళ్ళకే అనేకులు "మనస్సు శాంతిల్లుట లేదేమి? మాకు యుక్తవిధముగా ధ్యానించుట సాధ్యమగుట లేదేమి? చిత్తశాంతి నెట్లో కల్పింపుడు" అని మొఱవెట్టుకొననారంభింతురు. ప్రశాంతచిత్తమునుగాని, అగాధధ్యాననిమగ్నతనుగాని సాధించుట అంత సులభమా? పూర్వజన్మములనుండి సంచితములై యున్న సంస్కారముల (అభ్యాసములు, మనోగతులు, ప్రతిష్ఠితభావములు) యొక్కయు, ఇంద్రియవిషయాసక్తి యొక్కయు, ప్రభావముచేత మనస్సునకు బాహ్యాగమనము స్వాభావికలక్షణము. అందుచేత అది సదా ఆ విషయముల నలవఱచుకొని భోగింపగోరుచుండును. మాటిమాటికి ప్రయత్నించుటయు, త్యాగ మవలంబించుటయు, తప్ప అశాంతచిత్తమును శాంతిల్ల జేయుటకు సులభమార్గ మేదియు లేదు. గురునిర్దిష్ట విధమున జపధ్యానములు ఓరిమితోను, ఎడతెగకయు, దినదినము, మాసమాసము—సంవత్సరసంవత్సరము కూడ—అనుష్ఠింపవలెను. ఆ అనుష్ఠానముతో కూడ ఐహికవిషయములయెడ అసంగత్వమునుకూడ అభివృద్ధినొందించుకొన బ్రయత్నింపవలెను. ఇంద్రియవిషయ వాంఛతీవ్రత సన్నగిల్లుకొలది, ఏ యిష్టమూర్తి యెడ ప్రేమయు భక్తియు అధికమగు[illegible]! అతడు నీ ప్రేమపదము లందఱకన్న అధికసన్నిహి[illegible]డనియు, అధికప్రియుడనియు, ఎఱుగుకొలది, నీ మనస్సు [illegible]తము[illegible] నిశ్చలమును అగుచుండును. అప్పుడు ధ్యా[illegible] శాంత్యానందముల నిచ్చును. శీఘ్రఫలసిద్ధికై [illegible]డక శ్రీరామకృష్ణు డుదహరించిన వంశపారంపర్య కృ[illegible]

వలె——పంటనష్టము ఏర్పటకలుగుచున్నను, కృషిని యథా ప్రకారము సాగించుచునేయుండు కృషీవలునివలె——సాధనలు అవిరామముగా సాగించుచుండవలెను.

* * *

89. దేవునిగుడికిని, సన్న్యాసిని దర్శించుటకును, ఏగునప్పుడు సమర్పణార్థ మేదేని కైకొనియే పోవలెను. చివర కొక కాని, రెండుకానులు పెట్టి ఫలములు, మధుర భక్ష్యములు —— కనీసము కొన్ని పుష్పములు —— తీసికొని పొమ్ము.

* * *

90. ఐహికజీవనమునం దనివార్యములై యుండువిషమ పరీక్షలు, సంకటములు, పీడనములు, ప్రాతికూల్యములు, అపార్థకలనములు, కలతలు, మున్నగు మనస్సంక్షోభ కారక విషయములచే దిగులుపడి, విలపించుచు, చింతించుచు, ఉండవలదు. అది నిరుపయోగము. అంతేకాక వానినిగూర్చి చింతించుటయు, ఇతరులతో చర్చించుటయు, అధికమగు కొలది, అవి పెరిగిపోవుచుండును —— పదింతలుగా పెరిగి పోవును, మనశ్శాంతి పూర్తిగానశించును, జీవితము దుర్భర మగును. సాధ్యమైనంతవఱకు, కష్టము లనుభవింపుము. మాటలు ఇంక నెక్కువమాటలను కలిగించును. కావున ఎవరైన నీకు అరుచికరములుగనో, అన్యాయ్యములుగనో, ఉండు మాటలు పలికిరేని, వాని ప్రసక్తియే పెట్టుకొనక, ఊరకుండుట మంచిది. మూగవారికి శత్రువు లుండరు. ''సహనుడు విజయము నొందును, అసహనుడు నశించును''

అని శ్రీ గురుదేవుడు పల్కినాడు. కమ్మగా మాటలాడుట, కమ్మగా వ్యవహరించుట, ఓర్పు, సేవ, ప్రేమ ఇవి కాలపరిపాకమున జీవితకష్టముల నన్నిటిని అణగద్రొక్కి విజయము నొందును. దయచూపుచుండుటచే అడవిమృగములు కూడ సాధువులై, వశమగును. ఆత్మపరీక్ష చేసికొని, నీలో కాన్పించు లోపములను సవరించుకొనుటకు గాఢనిశ్చయ మొనర్చు కొనుము. ప్రయత్నము ఎన్నిసార్లు విఫలమైనను, మానకుము, నీ కష్టము లన్నియు ఈశ్వరునకి నివేదించుకొనుము. నీ దోషములను, పొరపాట్లను పోగొట్టుమని కన్నీరు కార్చుచు హృదయపూర్వకముగా ఆయనను ప్రార్థింపుము. ఇతరులను సంస్కరింప జూచుట వ్యర్థము, వెట్టి. ఆత్మసంస్కరణమే మనకర్తవ్యము. ఎవరియెడగాని విముఖత్వము చూపకుము. మంచివానికి లోకమెల్ల మంచిదే. నీ విట్లు ఉండజాలవేని తప్పు నీదే. దాని ఫలము నీవే అనుభవింపవలెను.

* * *

91. వస్తువులయెడగాని, మానవులయెడగాని సంగము. లేక "నాది" అనుభావము, కలిగియుండుట ప్రాపంచిక బంధములకెల్ల మూలము. జ్ఞానియగువాడు ఏ మానవునిగాని అసాధారణముగా ప్రేమింపడు, ఇతరు లెవరును తన్ను అసాధారణముగా ప్రేమింపవలెననిగాని, తన కనురాగబద్ధులై యుండవలెననిగాని కోరడు. తాను ముక్తుడు గనుక, ఇతరులెవరును తనయెడ వ్యక్తిగతానురాగకారణమున బద్ధులైయుండవలెనని అతడు కోరడు. తన ఆత్మను – అనగా, భగవంతుని – అతడు సర్వమునందుచూచుచుండును

గనుక, అతని ప్రేమ విశ్వగతము–సర్వభూతములయెడ సమమై యుండును. ఆ ప్రేమయందు భౌతికము, ఇంద్రియసంబంధము, అగు స్పర్శయేఉండదు. కామాంధతగాని భౌతికసౌందర్య సమ్మోహముగాని అందు పరమాణురూపమునకూడ కానరాదు. యథార్థప్రేమపరుడు జ్ఞానియే. అతడే ఈశ్వరుని యథార్థముగా ప్రేమించువాడు.

* * *

92. త్యాగము, ఈశ్వరప్రేమ, పారిశుద్ధ్యము: ఇవియే ఆయనను ప్రాపించుమార్గములు. ఇవి దేహములోని అంగములవలె పరస్పరసంబంధముగలవి ఇం దేదియున్నను, తక్కిన రెండునుకూడ ఉండును. ప్రేమపారిశుద్ధ్యస్వరూపుడగు ఈశ్వరుడు లౌకికవస్తువైముఖ్యము, సర్వభూతప్రేమ, సర్వభూతస్వకీయతాభావము, వాఙ్మనఃకాయబాహ్యాంతః పారిశుద్ధ్యము, గలవారికిగాని లభ్యుడుకాడు. అవిరామ ప్రవాహరూపమున నిర్మలభావములను సర్వదా మనస్సులో నిలుపుకొనుటకు పూనికతో పరిశ్రమించువానినుండి అపరిశుద్ధములగు తలంపులును, మనోగతులును, పాఱిపోవును. అతని శీలమే మాఱిపోయి, చెడుతలంపులు, చెడుపనులు, ఈర్ష్యాసూయలు, అతనియం దుండుటయే అసాధ్యమగును. అట్టివానినుండి యొక శక్తి ప్రసరించి ఉన్మార్గవర్తనులను సన్మార్గవర్తనులుగా మార్చును. అతని స్పర్శచే ఘోరపాతకియు ఆస్తిక ధర్మపరాయణుడు, సత్యవంతుడును అగును, నాస్తికుడు ఈశ్వరభక్తుడగును, ప్రాపంచిక క్లేశపరితప్తహృదయులు నిత్యశాంతినందుదురు.

93. పాపము, రక్తగతమగు చెల్దిరోగపు (Siphilis) విషము, దాచియుంచుటకు శక్యముకానివి, అట్లే ప్రేమ పారిశుద్ధ్యములనుకూడ దాచియుంచుట అసాధ్యము. అగ్నిని గుడ్డతో కప్పియుంచుట సాధ్యమగునా? "ఇది నాది" అను వస్తువేదియు లేనివాడు, మిత్రులను శత్రులను సమభావముతో చూచువాడు, లోకముయొక్క దృష్టినుండి ఎంత తప్పించుకొనుచున్నను, అతని జ్ఞాన తేజస్సుచే లోకమంతయు దీప్తిమంతమై, అతని దివ్యప్రేమమహోల్బణము (Tidal wave) లోకమంతయు ఆవరించును. అట్టి బ్రహ్మజ్ఞుని శరణు చొచ్చి అతని యనుగ్రహము నొందువాడు పరమధన్యుడు.

* * *

94. సాధనలకు యౌవనము శ్రేష్ఠతమతరుణము. ఆ కాలమున గాఢముగా పరిశ్రమించి వలయునంతటి పారమార్థికశక్తిని సమార్జించియుంచుకొను సాధకుడు పతనభీతి విస్తారము లేక, శాంతిసుఖములతో తనజీవిత శేషమును గడుపుకొనవచ్చును. ఎన్నికష్టములు, ఎన్నివిపత్తులు, ఎదుర్కొన్నను, అతడు నిశ్చలుడై యుండును. యౌవనమున శీలనిర్మాణము చేసికొననిచో, పిమ్మట అది అసాధ్యమగును. నిర్వ్యాపారుడవుగాను, నిరర్థకకార్యాచరణుడవుగాను, ఒక్కక్షణమేని వ్యర్థపుచ్చకుము. "నా ఆరోగ్యము చక్కగా లేదు!", "నాకు తీతిక లేదు!" ఇట్టివి సాకులు! అవి అర్థరహితములు. ఆహారవిహారములు, నిద్ర మున్నగుకార్యము లన్నియు నియమితమార్గముల నిర్వర్తించినచో, మనశ్శరీరములు బలిష్ఠములై, ఉల్లాసవంతములై, అధికతరకార్యనిర్వహణ

సమర్థములై యుండును. కార్యములగుణముకూడ శ్రేష్ఠతర ముగానుండును. అప్పుడు సాధనలకును ఇతర కార్యములకును కావలసినంత తీటిక యుండును.

*  *  *

95. ఎప్పు డేది దొరకిన అప్పు డది—మంచి చెడ్డలు విచారింపక — తినుచు, ఉచ్ఛృంఖలముగా జీవించుచు, కామాదిదుర్గుణములను స్వేచ్ఛావిహారము నిచ్చుచుండువానికి మానసోల్లాసముగాని, శరీర దార్ఢ్యముగాని ఉండదు. అనాలోచితనిరంకుశజీవనమువలన మనశ్శరీరములు దుర్భరపీడా వశములై చివరకు శరీరము అశక్తమై పనియేచేయజాలని స్థితికి వచ్చును. దూబలదిండియై సర్వవిధాహారములను భుజించువానిశక్తిలో సగపాలు ఆ ఆహారము నఱిగించుకొనుట లోనే వ్యయమగును. ఎనిమిదిపదిగంటల నిద్రమైనను ఆ వ్యయమును తీర్పజాలదు. కొంచెముశక్తి ఇంకను మిగిలిన యెడ, అది నిరర్థకవ్యాపారములందును, నిరర్థకప్రసంగము లందును వ్యర్థపఱుపబడును. ఇక జపధ్యానములకు కాల మెక్కడిది? వానియందు ఆసక్తియు వుండదు. అట్టివారు సాధనలకై కూరుచున్నతోడనే ఆవులించుచు, కునికిపడ సాగుదురు. ఇట్టిస్థితిలో ఉత్తమకార్య మేమిసాగును? సాధ నలు, సత్కార్యములు చేయు టటుండ, ఇట్టివాడు లౌకిక జీవనము సాగించుకొనుటలోగూడ అసమర్థుడైయుండును. మానవజీవితమువంటి అసామాన్యభాగ్యము నిట్లు వ్యర్థపుచ్చు టెంత శోచనీయము! మానవజీవితమున — దివ్యత్వమును ప్రాపింప నలవియగు ఈ మానవజీవితమున—నీతిధర్మములు

కూడ సాధింపజాలనివాని జీవితమునకును, పశుజీవితమునకును భేద మేమికలదు?

* * *

96. ప్రారంభదశలో నుండు సాధకుడు నిత్యజాగరూకుడై, ఏమఱుపాటు లేక, యుండవలెను. ఏమాత్ర మజాగ్రత్తపడినను, అపరిపక్వముగానుండు అతని బుద్ధి ఎవరియందో, ఏ వస్తువునందో—ఎఱుక లేకయే—సమాసక్తమై అతనికి బంధనము కల్పింపవచ్చును. సాధన లారంభించిన స్వల్పకాలమునకు మాత్రమే ఈ "ప్రారంభదశ" యను మాట అన్వయించు ననుకొనుట పొరపాటు. పది పండ్రెండేండ్ల జప ధ్యానాభ్యాసానంతరముకూడ సాధకునకు ఉన్నతతర పారమార్థికత పట్టువడియుండక పోవచ్చును. ప్రారంభదశ అనేక సంవత్సరములు—యావజ్జీవితముకూడ—నిలిచి యుండవచ్చును. ఏదోయొక జ్ఞానసిద్ధి ప్రాప్తించువఱకు ప్రారంభదశయే. ఈ దశ సాగుకాలము సాధకుల ఆతురతా పరిశ్రమలయొక్క తరతమత్వముల కనురూపమైయుండును. సత్యబోధమే నిజమగు ఆస్తిక ధర్మపరతకు, లేక పారమార్థికతకు, ప్రారంభము. తత్పూర్వమనుష్ఠించిన ఆచారకర్మములు, సంస్కారములు, తపస్సులు, శిక్షణలు ఆత్మసామ్రాజ్యప్రవేశమున కాయితపఱచు సాహాయ్యక క్రియామాత్రములే.

* * *

97. సాధనలు, జపధ్యానములు, అభ్యసింప మొదలిడినవారు, ఇష్టమూర్తిపై మనస్సు నేకాగ్రము చేయ

యత్నించుకొలది, వారిమనస్సు క్రమాధికతీవ్రతతో తిరుగు బాటుచూపి నిరర్థకవిషయములమీదికి పాఱిపోవ నారంభించును. "మునుపు నా కిట్టి కష్టమేల లేకుండెడిది? నా వ్యాపారములను చాలవఱకు సుస్థిరబుద్ధితోనే నేను విచారించుకొనగలిగియుంటిని, ఇప్పు డట్లేల చేయజాలకున్నాను?" అని వా రచ్చెరువొందుదురు. అందుకు కారణ మిది: బాహ్యవ్యాపారములందే మనస్సు మునుపు వినియోగింపబడుచుండెను, ఇంద్రియవిషయాసక్తి మనస్సునకు స్వాభావికమే, కావున వైషమ్యమేమియు లేకుండెను. కాని దానిని — సత్యాసత్యవివేచనముచే — నిగ్రహించి, అవాస్తవ బాహ్యవస్తువులనుండిమరల్చి, అంతర్ముఖమొనర్చుయత్నము చేయుటతోడనే, అది తిరుగబడును. నదికి అడ్డకట్టనిర్మించు ప్రయత్నము చేయుటతోడనే దానిశక్తి శతగుణాధికమగును. ఆ మహత్తరశక్తి—అట్లుద్భూతమైనది—ఏదేని లోకోపకారకమగు వాంఛితార్థముకొఱకు వినియుక్తమయ్యేనేని, సహస్రగుణాధికఫలము లభించును.

* * *

78. శ్రద్ధాపరిశ్రమములవలన ఏ విషయమందైనను విజయము లభించును. లభింపనిచో, మరలమరల ప్రయత్నించుచుండుము. శ్రద్ధాపూర్వకప్రయత్నానంతరముకూడ అపజయమే కలిగెనేని, నీ ప్రయత్నము చాలలేదని తెలిసికొనుము. ప్రయత్నము గాఢతరమొనర్చుచు, ఎన్నటికి విడువక, పట్టుదలచూపితివేని,సర్వములొంగి సుసాధ్యమగును.

క్రమక్రమముగా ఇది అభ్యాసరూపమునంది, నీ ప్రకృతిలో చేరిపోవును.

* * *

99. ఈశ్వరుడు మన కెట్టిలోపమును కలిగింపలేదు; లోపము మన మనస్సునందలిదే. సుఖదుఃఖములు మనస్సులోనివే కాని వెలుపలివి కావు. "మనస్సంకల్ప మెట్టిదో సిద్ధియు అట్టిదే". దేని నన్వేషింతుమో, అదియే మనకు లభించును.

* * *

100. స్వతంత్రత పరమసుఖము. పరాధీనత పరమదుఃఖము. కాని ఈశ్వరాధీనత యథార్థస్వతంత్రతయే. ఈశ్వరభృత్యుడు సృష్టికి ప్రభువు. అరిషడ్వర్గమును—కామ క్రోధలోభమోహమదమాత్సర్యములను—త్యజించినవాడు గాని ఈశ్వరభృత్యుడు కాజాలడు.

* * *

101. మానవుని బంధమోక్షములు అతనిచేతులలోనే ఉండును. కాని, ఎఱిగియుండియే, హెచ్చరికలను కూడ పాటింపక, మనము—బుద్ధిలోపముచేతనో, మాయాసమ్మోహితబుద్ధిచేతనో—బంధములోచిక్కుకొని కడగండ్లు పడుదుము. లోకబద్ధుడగుజీవిస్థితి రెండుచేతులతో నొక స్తంభమును కౌగలించుకొని, ఒకటిగాచేర్చియుండు అఱచేతులలోని పేలాలు తినుటకు వ్యర్థప్రయత్నములుచేయువానిస్థితిని పోలినది. అత డా పేలాలు తినజాలడు, అవి గాలి కెగిరిపోవును గనుక అఱచేతులు విడువజాలడు !

102. "గురువును సామాన్యమనుష్యమాత్రునిగను, ఇష్టమూర్తియొక్క పావనమంత్రమును వట్టిమాటలుగను, దేవదేవీవిగ్రహములను రాయిగను, మట్టిగను, ఎన్నువాడు నరకమునకుపోవును" అని తంత్రశాస్త్రము పలుకుచున్నది. దీనియర్థ మిది. శ్రద్ధాభక్తులు లోపించియుండుటచే — శాస్త్రాదేశవిరుద్ధముగా—ఇట్టి విపరీత, చార్వాకభావములు గలవాడు తన పారమార్థికపురోగమనమును నిరోధించుకొనుటయేకాక, వినాశమునుకూడ ఆశ్రయించుచున్నాడు.

* * *

103. ఈశ్వరుని సదా స్మృతిపథమున నుంచుకొని చింతించుచు, కార్యమగ్నుడై పూర్ణవ్యాపృతుడైయున్నప్పుడు కూడ ఆయనదివ్యనామమును జపించుచు, తన కాయనయే ఏకైకాధారము, ఏకైకబలము అని ఎఱిగియుండువాడు, ఆపదలలో, దుఃఖములలో, నున్నప్పుడు ఆయనసాన్నిధ్యానుభూతిని పొందుచునేయుండును. అవసానకాలమునగూడ ఈశ్వరచింత మరణవేదనలనుసైతము మఱవజేయును, ఐహికవిషయములందు, ద్రవ్యమునందు, మనుష్యులందు, గలసక్తతను పాఱదోలును, మనస్సు ఆయనయందే నిలిచి ఆయనసాన్నిధ్యసుఖము ననుభవించుచుండును. ఈ లోకమున నిక జననమరణము లనుభవింపనవసరము లేనివానికిమాత్రమే ఇట్టి మహోన్నతదశ ప్రాప్తించును. ఎల్లప్పు డాయనను స్మృతిపథమున నుంచుకొనుటచేతను, ఆయనసాన్నిధ్య మనుభవింప యత్నించుచుండుటచేతను, వారి కివి స్వాభావికములై పోవును.

104. మంత్రము, ఆ నామముగల పురుషుడు, ఒక్కటే అనువిశ్వాసమును స్థిరపఱచుకొనుకొలది, నీ హృదయములో ఆయనయునికి అధికాధికముగా అనుభూత మగుచుండును.

* * *

105. ఈ ప్రపంచ మెట్టిదో టనగా, ఇం దెవ్వరును తనకు స్వకీయులుకారు, తానుకూడ తనకు స్వకీయుడుకాడు! అంత క్షణభంగుర మీ ప్రాపంచికజీవితము!

* * *

106. తనకు తాను మిత్రుడై యుండువాడు లోకమునకును మిత్రుడు, లోకమంతయు అతనికి మిత్రము. "ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః" (ఈ ఆత్మకు ఆత్మయే బంధువు, ఆత్మయే శత్రువు) అని శ్రీకృష్ణుడు గీతలో (VI-5) ప్రవచించియున్నాడు. అనగా, పరిశుద్ధచిత్తము ముక్తికారణము, అపరిశుద్ధచిత్తము బంధకారణము.

* * *

107. నిత్యపరిణామశీలమగు ఈ అశాశ్వతప్రపంచమందు సంయోగము వియోగముతోను, సంపద ఆపదతోను, సుఖము దుఃఖముతోను, అదృష్టము దురదృష్టముతోను, భోగము రోగముతోను, కలిమి కలహముతోను, కలసియే యుండును. ఇందు ప్రతిదానిని రెండవది నీడవలె వెంబడించి పోవుచుండును. ఇది ఎఱిగియు, దీని ననుభవించుచునే యుండియు, మానవులు మాయాసుఖాకృష్టులై ఈ ప్రపంచములో ఏల చిక్కుకొనుచున్నారు? ఇంద్రియభోగము లిచ్చు సద్యఃసుఖమే మనుష్యుని చేటునకు కారణము. నామకార్థసుఖ

షణుమాత్రమేనియు పదిలక్షలసార్లనుభవించిన వెతలను, బాధలను మఱపించును!

* * *

108. తాను చేయుపనుల అంతిమఫల మెట్టిదిగా నుండునో అని ఎల్లప్పుడు విచారించువాడే కష్టములలో చిక్కువడక తప్పించుకొనగల్గును. ఎన్నిమార్లనుభవించినను గుణపాఠ మేమియు నేర్చుకొనకుండువాని కష్టము లెవరు తీర్పగలరు? నిద్ర నభినయించుచుండువాని నెవరు మేలుకొల్ప గలరు? ఈ లోకమునకు మరలవచ్చుటను, పునర్జన్మములందు చుండుటచే కలుగు అనంతక్లేశరాశి ననుభవించుటను, తప్పించుకొనుమార్గము ననువర్తించినప్పుడుగాని మానవజన్మ సాఫల్యము సిద్ధింపదు.

* * *

109. నిర్వ్యాపారముగా కూర్చుండి, విధియో, అదృష్టమో, తనకు ఏ లాభమునో సిద్ధింపజేయు నని వేచి యుండుటచే కార్య మేదియు నిర్వహింపబడదు, ఏదియు విజయవంతముగా సాధింపబడదు. మఱియు ఇట్టి మనోవైఖరి నవలంబించుటవలన, మానవుడు పౌరుషహీనుడుగను, తామసుడుగను ఏర్పడి కేవలము పతితుడై పోవును. మనుష్యులు పొరపాట్లు చేయునది, అపజయమునందునది, తమ దోషముల వలననే, కాని నింద నంతయు దుర్విధిమీదను, అదృష్టహీనత మీదను, గ్రహచారముమీదను మోపుదురు. మనుష్యులు తప్పటడుగు వేయుటకును, జాఱిపడుటకును, కారణము తమ అజాగ్రత్తయే, కాని నేరము నంతయు నేలమీద మోపుదురు!

కార్యసిద్ధి ప్రాయికముగా స్వయంకృషిమీదనే ఆధారపడి యుండును. జీవితపరమార్థసాధనను నిరోధించునది, విధి యనున దొకటి, కలదని తోచినచో, ఎల్లరయందును నిద్రిత రూపముననుండు స్వాభావికశక్తిని మేలుకొల్పి, తత్సాహాయ్య ముతో ఆ విధిని జయింపవలెను. అట్లుచేసినగాని నీకు పురుషనామము చెల్లదు. అట్లు చేసితివేని, విధికూడ సుముఖ మగుచుండుట నీ కెఱుకపడును. విధియే సర్వశక్తిమంతమవుట నిజమైనచో, మంచిచెడ్డలు, ధర్మాధర్మములు, ఆత్మబలము, అనునవే వుండవు. మనుష్యులు, చెట్టుదుంగలు రాతిబండలు, కారు. "విధియే నాచేత సర్వకార్యములు చేయించు చున్నది, నా చర్యలకు నేను బాధ్యుడనుకాను; నేను అవశుడనై దానిచేత నడుపబడుచున్నాను" అనునదియే మానసవైఖరియైనచో మానవు డెవ్వడును ఉన్నతినొంద జాలడు. ముక్తిని సాధించు ఆశపెట్టుకోజాలడు. తాను బలహీనుడనియు, అగోచరశక్తులదయమీదనే ఆధారపడి యున్నా డనియు, తలచుట కేవలము హైన్యలక్షణమని ఎఱుగుము. అది వానిని రొంపిలో మఱిమఱిలోతునకు త్రోయుచుండును.

* * *

110. తన ఇచ్ఛను ఈశ్వరేచ్ఛలో మగ్నముచేయ నేర్చినవారికే "నేను అవశుడనై నడుపబడి ఇదంతయు చేయుచున్నాను, నేను యంత్రమాత్రుడను, యంత్రచోదకు డాయన" అని చెప్పు నధికారముకలదు. ఈశ్వరునితప్ప మఱేమియు ఎఱుగని అత్యున్నతశ్రేణిభక్తవరేణ్యుడే అట్లు

పలుకదగినవాడు. అట్టివాడు ప్రమాదకారణముననైనను తప్పటడుగు ఎన్నడును వేయడు, దుష్కార్యమే చేయజాలడు. అతని హృదయము నిర్నిరోధబలముతోను, దివ్యబోధముతోను, నిండియుండును, ఖేదనైరాశ్యము లతని నెన్నడు నావేశింపవు; సుఖదుఃఖములం దతడు నిశ్చలుడై యుండును. "ప్రభూ, నాహం, నాహం, త్వమేవ, త్వమేవ" (నేను కాను, నేను కాను; నీవే, నీవే) అను భావమే అతనియం దెప్పుడును నిలిచియుండును. లాభనష్టములు, జయాపజయములు, మానావమానములు ఇవన్నియు అతని కొకటికనే తోచుచుండును.

* * *

111. ఏదేని పని చేయవలసియున్నప్పుడు, కార్యోత్సాహపూర్ణుడవై, హృదయపూర్వకముగా, ఏ మాత్రము శక్తివంచనలేక, దానిని చేయబూనుకొమ్ము. విఘ్నములు, నిరోధములు తలచూపెనేని, ఎంత అనుల్లంఘ్యములుగా చూపట్టినను, వాని నణుమాత్రమేనియు లెక్కసేయకుము. అప్పుడావిఘ్ననిరోధములే నీకు పెక్కువిధముల ఉపకారకములగుట నీకే కాన్పించును. తన యిచ్ఛానుసారమగు అనుకూల వాతావరణ మెల్లప్పుడును లభించుచుండుట సాధ్యమా? తన కర్తవ్యముల నన్నిటిని పూర్తిగానిర్వర్తించి, కుటుంబ వ్యవహారముల నెల్ల తృప్తికరముగా పరిష్కరించి, ఆ పిదప నిర్విచారబుద్ధితో ఈశ్వరారాధన మారంభింతునని తలచువాడు—స్నానమాడుటకై సముద్రమునకేగి, అచట భీకర కల్లోలములకు వెఱచి. అవి కొంచెముతగ్గిపోయి, సముద్రము

ప్రశాంతముగా నున్నప్పుడు నీటిలో దిగుదు నని తలచు దుర్మతివంటివాడు. తన జీవితమంతయు, అవసానకాలము వఱకు, సముద్రతీరమున కూరుచున్నను, అట్లు ఎన్నడును జరుగదు. సముద్రమునందు సదా అలలుండును. ధైర్యముతో సముద్రములో దుమికి, అలలతో పోరాడి, స్నానము పూర్తి చేసికొనవలెను. అట్లే ఈ జగత్సముద్రములోని అలలతో ఎల్లప్పుడును పోరాడుచునే ఈశ్వరు నావాహనచేయుచు, సాధన లాచరించుచు, ఆయన నారాధింపవలెను. కాని నైరాశ్యమొంది, మోకాళ్ళకఱచుకొని కూర్చుండి, యుక్త ముహూర్తము, అనుకూలస్థితిగతులు, వచ్చువఱకు వేచి యుంటివేని, నీ సత్యానుభూతి వాంఛ యెన్నటికిని నెఱవేఱదు.

* * *

112. తమ ప్రాపంచిక బాధ్యతలు తప్పించుకొనుటకో, ఉద్యోగార్థ ప్రయత్నములు నెఱవేఱక పోయినందుననో; చిరతర దారిద్ర్యము, అభావము (లేమి), సర్వవిధకష్టములు, దుఃఖములు పీడించుచుండుటచేతనో; ఉద్యమము లన్నిటియందును వైఫల్యమే కలుగుచుండుటచేతనో, అనేకులు రామకృష్ణసంప్రదాయసన్న్యాసులగుటకెంతో ఆసక్తులమైయున్నామని చెప్పుదురు. ఈ కాలమున సన్న్యసించుట ఒక విధమైన ఫ్యాషన్ (Fashion) గా ఏర్పడినది యథార్థవైరాగ్యము (ప్రాపంచికవాంఛలయెడ, ఇంద్రియ భోగముల యెడ, వైముఖ్యము) కలిగి, యథార్థసన్న్యాసి (త్యాగశీలి) యగుట సులభమా? ఐహికజీవితములోనున్న కాలమందే సాధన

లభ్యసించి ఇంద్రియార్థవిరక్తి, ఉదాసీనత, అస్వార్థపరత కొంచెముగానైన పట్టువఱుచుకొన్నగాని సన్న్యాసజీవన మవలంబించుట కర్హతలభింపదు. లేనిచో, ఆ నూతన్నోజ్జ్వలితప్రేమ తాటియాకులమంటవలె అప్పుడే చల్లారిపోవును. సోమరితనమున దినములు గడచిపోవును; స్వసుఖము, విశ్రాంతి, పేరు, ప్రతిష్ఠల వైపునకు మనస్సు మ్రొగ్గ నారంభించును. అప్పు డతడు ఒక గంటసేపైనా కూర్చుండి జపధ్యానములు—వ్యర్థకార్యములవలె, బలాత్కారకృత్యములవలె, భావించుచు—ముగించుకొనును. "నేడు నాకు జబ్బుగానున్నది", ఇట్టి సాకేదోయొకటి ఉద్భవించుచుండును. ప్రాపంచికవ్యాకులములనుండి, అంతరాయములనుండి, తప్పించుకొని, సన్న్యాసజీవనము సుఖసంతుష్టులతో జరుపుకొనుచు అనేకు లిట్లు తలతురు: "నా యభీష్ట మిప్పుడు సిద్ధించినది, ఇక వేగిరపడ నక్కఱ లేదు. నాకు తీఱికదొరకినప్పుడు, అనుకూలముగానున్నప్పుడు, ఈశ్వరారాధన మొనర్చినచాలును". ప్రథమముననున్న భావోద్వేగము, ఉత్సాహతీవ్రత, అదృశ్యమైనవి, క్రమాధికముగా మనస్సు అధోగతి పట్టుచున్నది.

* * *

113. వెలుపలివారు బేరూరుమఠమును చూచి "ఈ సన్న్యాసు లెంతహాయిగా జీవించుచున్నారు! ఎంత మనోజ్ఞప్రదేశ—గంగాతీర — నివాసము! ఎంతచక్కని కట్టడములు, దేవాలయములు! ద్రవ్యలోప మేమాత్రము

లేదు! చింతావ్యాకులములు లేవు! నిత్యోత్సవములు, సుఖ భోజనములు, ఈ సాధుజీవనమున! కొన్ని నియమితవేళ లందు గురుదేవునికార్య మొకింతచేయుదురు, ఒకించుక శాస్త్రపరనము, తమకు తోచినరీతి నొకించుక జపధ్యానము, నభ్యసింతురు, తక్కినకాల మంతయు ఇష్టానుసారము గడపుదురు! ఎంత స్వేచ్ఛాసుఖజీవనము!'' అని తలతురు. ఈ సంప్రదాయసాధువులు రేయుంబవల్లెంత పనిచేయవలెనో, ఎట్టి గాఢవిధినియమముల ననుసరింపవలెనో, ఎన్నివిధముల కఠినసేవ లెల్లప్పుడు చేయుచుండవలెనో; తమ ఆరోగ్యమును లెక్కగొనక, ప్రాణములనుసైతము తుచ్ఛములుగా నెంచి, హఠాత్తుగా నేర్పడిన మహోద్యమములలో ప్రవేశించి, పరిశ్రమించుటకు వా రెల్లప్పుడు నెట్లు సంసిద్ధులైయుండ వలెనో—ఈరంధ్రాన్వేషకు లేమి యెఱుగుదురు! ఆపదలలో, దురవస్థలలో, నుండువారి కష్టములుతీర్చి, శాంతిసౌఖ్యములు కల్పించుటకై ఈ సాధువు లెన్నో అపాయకార్యములలో దిగి, మరణమునుకూడ నానందముతో నెదుర్కొనవలసి యుండు ననియు, తమ గాఢసాధనానుష్ఠానజీవితములను, మోక్షమునుకూడ త్రోసిపుచ్చి, మానవసేవకు—మానవు లను సజీవదైవములుగా చూచుచు—వీరు తమ జీవితముల నంకితమొనర్చిగనియు, ఈ దురాక్షేపకులకు తెలియనే తెలి యదు. సంప్రదాయనిర్దిష్టకార్యము నాచరింపకుండువారు, ఏ వ్యాజములో కల్పించి ఆ కార్యమునుండి తప్పించుకొన జూచువారు, వెళ్ళిపోయి స్వేచ్ఛాజీవన మవలంబించువారు, ఈ ఉన్మార్గవర్తనులు, స్వైరవిహారులు, పతనమునొందుదురు

అభివృద్ధి మార్గము వారికి నిరుద్ధమైయుండుటచే వారు క్రమేణ ఆదర్శమునుండి కూలిపోవుదురు.

* * *

114. శ్రద్ధాసక్తిసంపన్నుడగు గృహస్థభక్తుడు సాధన లంతగా అనుష్ఠింపజాలకున్నను, ఆదర్శమునకుతప్పి పతనము నొందిన సన్న్యాసికన్న వేయిరెట్లు శ్రేష్ఠుడు. ఆ గృహస్థ భక్తుడు పారమార్థికమార్గమున పురోగమించుటకు తన శక్త్యనుసారము పూర్ణప్రయత్నము చేయుచు, దుర్భరమగు తన బద్ధదశనుండి విముక్తి నొందింపుమని పరితాపపూరిత హృదయముతో ఈశ్వరుని ప్రార్థించుచుండును. ఐహిక జీవనమున తన్ను నిరంతర మెదుర్కొనుచున్న బహువిధ కర్తవ్యకార్యములతో, ఆటంకములతో, విఘ్నములతో, పోరాడుకొలది ఆతనిహృదయమున పరిత్యాగవాంఛ తీవ్రతర మగుచుండును. అతని హృదయము ఈశ్వర సాక్షాత్కార క్షుధార్తిపీడితమై, బంధములనుండి విడివడి, లోకమును పరిత్యజించి, ఆయనను ప్రత్యక్షపఱచుకొనవలెనని క్రమేణ తీవ్రాతితీవ్రతతో వేగిరపడుచుండును. ఈ మనోరథ మతని లోని ఆత్మశక్తిని మేలుకొలుపును. భగవంతు డతనికి తోడ్పడును. ఆయన, అంతర్యామియగుటచే భక్తునియవస్థ నెఱిగి, అతనిముక్తిని నిరోధించువాని నెల్ల క్రమక్రమముగా తొలగించును. నిజమేమనగా త్యాగవాంఛ హృదయము నుండి ఉత్పన్నమైనగాని ఏమియు—ప్రేమగాని, ముక్తి గాని, జ్ఞానముగాని—లభింపదు.

* * *

115. అనేకు లిట్లు తలతురు: "కర్మమార్గమునో, మానవసేవామార్గమునో, పట్టుట నా కెట్లుపకరించును? అంతకన్నను అహోరాత్రములు యోగధ్యానానుష్ఠానమున గడపి, ఈశ్వరసాక్షాత్కారమును మొదట సాధింతును గాక!" కాని, అది సాధ్యమా? కొలది మాసములు ప్రయత్నించిచూడుము, అది అనుష్ఠానసాధ్యము కాదని నీకే తెలియవచ్చును. పరోపకారార్థము పాటుపడినగాని చిత్తశుద్ధి ఎట్లు లభించును? పరిశుద్ధ మగుటకుపూర్వమే చిత్తము అచంచలము, శాంతము అగునా? చిత్తము అచంచలముగా నుండనిచో, ధ్యానించుటయు ఆదర్శముపై బుద్ధినిలుపుటయు సులభమా? కర్మమూలముననే తన్ను తాను సరిగాకనుగొనుటయు, తన మనోవికాసపరిమాణ మెఱుగుటయు సాధ్యమగును, తన శక్తిసామర్థ్యములలోని లోపము లప్పుడుగాని తనకు వ్యక్తముకావు. తన మనస్సునం దెన్ని దోష దౌర్బల్యము లున్నది, అవి యేవేవియైనది; ప్రాపంచిక వస్తువులపై తనకుగల వాంఛాసంగము లెంతబలీయమైనది; స్వార్థపరత, అహంభావము, క్షమాసహనములు ఎంత మాత్రమున్నది, అవి క్రమాభివృద్ధినొందుచున్నది, క్రమక్షీణతనొందుచున్నది—కర్మమూలముననే తనకు గోచరమగును. ఈ లోపములను తీర్చు అమోఘప్రతిక్రియలు కర్మాచరణ, సేవామార్గములే. సత్యాసత్యవివేచనమును, ఆంతరంగికపరిశోధనమును, ఆత్మవిమర్శనమును, అభ్యసించినచో, మనస్సు క్రమేణ శుద్ధినొంది, వాంఛారహితమై, అహంభావమునశించి హృదయము భగవత్ప్రేమపూరిత

మగును. అప్పుడు కర్మము కర్మముగనే తోపదు; బంధకారి యగుటకుమా అది విమోచనకారి యగును. అనగా కర్మాచరణము ఆరాధన మగును, కర్మాచరణమునకును, ఈశ్వరారాధనమునకును, భగవద్భావముతో మానవుని సేవించుటకును, భగవద్భక్తికిని భేదమే తోపదు. అదియే నిజమగుభక్తి (ఈశ్వరప్రేమ). కర్మయోగమార్గము ననుసరించి నిష్కామముగా కర్మము లాచరించుటయే దానిని సాధించుటకు సులభమార్గము.

* * *

116. ఈశ్వరునందు పరమప్రేమ మార్జించుకొనుట జ్ఞానమును కూడ ఆర్జించుకొన్నవానికిగాని — అనగా తన ఇష్టదైవము (ఈశ్వరుడు) సర్వభూతములందును, ప్రతి మానవునందును కలడనియు, చేతనాచేతనప్రపంచములకు ఆయనయందుతప్ప వేఱగు ఉనికి లేదనియు, ఎఱిగి యున్న వానికిగాని—శక్యముకాదు. పరమాత్మయును, చేతనాచేతన ప్రపంచములును, తనలోని ఆత్మయును, అభిన్నములు— ఒక్కటే—అను విశ్వాసమే పరమప్రేమము, పరమజ్ఞానము. కాని ఈ రెండు పథములును, వాని సాధన మార్గములును, సాధకుల మనోవృత్తులనుబట్టి, "అధికారములను"బట్టి భేదించుచుండును. జ్ఞానమార్గమునే అనుసరింపగల అధికారముగలవారు ఈ లోకమున మిక్కిలి అరుదు; ఆ మార్గమత్యంతదుర్గమము. కావున భక్తితోకూడిన జ్ఞానము సాధింపబూనుట అనుకూలము.

* * *

117. జ్ఞానమార్గమున ప్రప్రథమమునుండి ప్రతివస్తువు యొక్క ఉనికిని నిరాకరించుచుండవలెను—"ఇది కాదు, ఇది కాదు, నే నిది కాను, అది కాను. నాకు కనిపించునది, వినిపించునది, తెలియవచ్చునది. అవేవియు నేను కాను. నే నీ దేహమును కాను, మనస్సును కాను, ఇంద్రియములను కూడ కాను. వ్యాధిని, దుఃఖమును, సుఖమును, ఆర్తిని, వేడిమిని, చలిమిరిని, అనుభవించునది నేను కాను. అభివ్యక్త జగత్తునకు ఉనికియే లేదు—అనగా కాలవిభాగత్రయ మగు భూతభవిష్యద్వర్తమానములందు లేదు. కావున అది కేవలమిథ్య. నేనుఅఖండ సచ్చిదానందస్వరూపమను, పర బ్రహ్మమను, పరమాత్మను, ఏకమను, అద్వితీయమను". శరీరాహంభావాదిఉపాధులకు లోనైనవారిట్టి నిష్ఠురశిక్షణము ననుష్ఠించు టెన్నడేని సాధ్యమా? ముల్లు గ్రుచ్చుకొని దేహమును పొడుచుచున్నది, నిప్పు అంటుకొని దేహమును కాల్చుచున్నది, కాని బాధ లేదు! ఇది సాధనలన్నిటియొక్క పరమావధి—సంసిద్ధి—, మనోవికారాతీతమగు అతీంద్రియ ప్రజ్ఞానమహితస్థితి,—ఇంద్రియవిషయానురాగస్పర్శయే లేని సమగ్రత్యాగియొక్క అగ్రతమస్థితి,—నిర్వికల్పసమాధియం దనుభూతమగు స్థితి. ఆ స్థితియందు శరీరము ఇరువదియొక్క దినములకన్న అధికముగా నిలువదని శ్రీ గురుదేవుడు చెప్పువాడు.

* * *

118. భక్తియోగమార్గ మెల్లరును సులభముగా అనుసరింపతగినది. ఏలన, అందు ఇంద్రియమారణ మక్కఱ

లేదు; నైసర్గికవాంఛలను, మానసాభ్యర్థనములను పెకలించి వైవ బనిలేదు; వాని కొక శ్రోత్తమార్గమును కల్పించిన చాలును. తన మనోవృత్తులను, అభ్యర్థనములను, కార్యోత్సాహములను, నూత్నమార్గమున ప్రవర్తింపజేయవలెను. ఇది సుగమరీతిని చేయవచ్చును. మనస్సును ఇంద్రియవిషయములనుండి మృదులవిధమున మరలించి, భగవంతుని దెసకు త్రిప్పవలెను. అనంతవ్యథాబంధనకారణము లగు కామక్రోధలోభమోహములు కేవల దుష్కృతస్వరూపమైనవని హేతువివేకములమూలమున కనుగొని; ఈ దుర్గుణములను అణచివైచినగాని, కలకాలము జననమరణపరంపరలో చిక్కియుండవలయుననియు, అనంతకాలమునగూడ ఆ దుఃస్థితి పూర్తిగా అంతమొందదనియు గ్రహించి, కోరికలను విడనాడుటయే ఇది సాధించు మార్గము. ఈ మార్గము అవలంబించుటచే దురభిలాషలు; మనోదుష్ప్రవృత్తులు క్రమక్రమముగా బలహీనములగును; మఱియు, దుర్దమమగువాని అధోముఖాకర్షణస్వభావమును ఔదాత్త్యకల్పనమహత్త్వముగల సాధనలచేత ఉద్గమాభిముఖమగునట్లుచేసి,అవ్యయానందభావముతో జీవితమునుముంచివేయునంతటిఅపార శ్రేయశ్శక్తులుగా వానిని మార్పవచ్చును. నీవు సుఖానుభూతిని కామింతువేని, ప్రేమైకస్వరూపు డగు నీశ్వరుని దివ్యసాన్నిధ్యపారవశ్యమునకై పిపాసగొనుము! లోభివై యుండుట తప్ప దేని,అనశ్వరపరమనిక్షేపమగు నీశ్వరు నార్జించుకొన గోరుము! సౌందర్యసమ్మోహితుడ వగుట తప్ప దేని, నిత్యసౌందర్యరాశిని మోహింపుము! క్రోధపూరితుడవుకావలసి యున్నచో, నీకు

సాక్షాత్కరింపనందు కాయనపై క్రోధమూనుము! జీవితము లోని తుచ్ఛవిషయములకు నిన్నంటగట్టియుండు మద మాత్సర్యవిషయమునగూడ ఇట్లే ప్రవర్తింపుము.

* * *

119. సాధకుడు ప్రథమదశలో కర్మయోగమును, సాధనలను, అనుష్ఠింపవలెను. రెండును అవసరమే. రెంటిని పొందికగా కలిపి ఆచరింపవలెను. రెంటిగమ్యము ఈశ్వరాను భూతియే యను స్థిరవిశ్వాసము కలిగియుండుము. కర్మాను ష్ఠానకాలమున, మనోనేత్రము నెదుట ఈ యాదర్శము నెల్లప్పుడు నిలుపుకొనియుండనిచో, మనస్సు సర్వవిధాకర్షణ ములచే విక్షేపమందుచుండును, సర్వవిధాకులములచే చంచ లించుచుండును. కార్యదుర్గమారణ్యమున సాధకుడు చిక్కు కొని మైమఱపుచెందును. సమబుద్ధిత్వ మెప్పుడును పాటించు చుండవలెను. జీవితాదర్శము లన్నిటికి ఈ నియమము వర్తిం చును. అందుచే సాధకుడు నిత్యజాగరూకుడై, అప్రమత్తుడై, సత్యాసత్యవివేకసుప్రతిష్ఠితుడై, ప్రార్థనాభ్యాసము నభివృద్ధి నొందించుకొనుచుండవలెను. ఇట్లొనర్చినచో కర్మమునకును సాధనలకును భేదము లేకుండుస్థితి ఈశ్వరకృపచే నొకప్పుడు సిద్ధించును. చేయబడిన కర్మమంతయు సాధనగనే మాఱును. కాని కార్యతత్పరుడప్పుడప్పుడు పుణ్యక్షేత్రములను దర్శించు చుండవలెను, వివిక్తస్థలమున గాఢతపస్సాధనలు కొంత కాలము — ఒక సంవత్సరప్రాంతకాలము — అనుష్ఠింప వలెను. అప్పుడతనిబుద్ధి కేవల మీశ్వరాయత్తమై, త్యాగ పూరితమై యుండవలెను. ఇందుచే మనశ్శరీరములు సేదదేఱి,

బలయుక్తములై, ఉల్లాసవంతములై, ఆత్మవిశ్వాసమును, ఈశ్వరవిశ్వాసమును చేకూర్చుకొని, శక్తిని, సర్వతోముఖ శీలమును కలిగియుండును.

*       *       *

120. మంత్రదీక్షనొందినవారెల్లరును ఇష్టమూర్తిని పూజింపవచ్చును. మంత్రదీక్షచే శరీరము శుద్ధినొందును. గాఢభక్తితో, పరిపూర్ణశ్రద్ధతో, ఆయనను స్వకీయునిగా చూచుచు, పూజింపుము. నీ హృదయవాంఛదీర, పూవులు, చందనము,పుష్పహారములు, మధురభక్ష్యములుఅర్పింపుము. మనస్సు పూజామగ్న మయ్యెనేని, అది సులభముగా నిశ్చలమగును, ధ్యానము అగాధమగును, ఆహ్లాదము కలుగును. ప్రేమప్రేరితపూజలో విధినిషేధములతో, మంత్రములతో, సూత్రములతో, యంత్రములతో, మోకరింపులతో, అంగన్యాసకరన్యాసములతో, అక్కఱయుండదు. శ్రద్ధాభక్తి ప్రేమ లున్న చాలును. పూజాకాలమున నీ వర్పించు ఫల, పుష్ప, భక్ష్యాదులను—అవి యెంత కొంచెపాటివైనను— నీ యిష్టమూర్తి ప్రత్యక్షముగా ప్రేమతో స్వీకరించుచున్నాడని భావింపుము. భక్తిప్రేమలతో అర్పింపబడిన నైవేద్యమాయనకు మిక్కిలి రుచికరము, మిక్కిలి ప్రియము. దుర్యోధనచక్రవర్తి యాహ్వానమును నిరాకరించి భక్తుడగు విదురుని సామాన్యాహారము నాయన అత్యంతాభిరుచితో భుజించెను. నీ వేది భుజించినను, దానిని ఆయనకు మానసికముగా అర్పించినపిదప భుజింపుము; అది ఆయన ప్రసాదమని కృపాప్రదత్తమని యెఱుగుము. ఆ ఆహారమునగల

పారమార్థికదోషము లన్నియు అందుచేత పరిహరింపబడు నని ఎఱుగుము.

* * *

121. సేవ, స్వాధ్యాయము (శాస్త్రపఠనము), సాధన, సత్యము, సంయమము (నిగ్రహము) — ఈయైదు "స" కారములు సంసిద్ధి కత్యుత్కృష్టసాధనములు. వాని నెప్పుడును పూనికతో, నీ యత్యంతశక్తితో అభ్యసింపుము.

* * *

122. పూజ, స్వాధ్యాయము, సేవ, జపము, ధ్యానము మున్నగు నిత్యకర్మములు సుస్థిరముగా, ప్రతి దినము, అభ్యసించుటచేత ఈ జన్మముయొక్కయు, పూర్వ జన్మములయొక్కయు, దుష్టసంస్కారములు నశించి, సత్సంస్కారములుఏర్పడి, శక్తిమంతములగును. తత్ఫలముగా సాధన లాచరించుట క్రమేణ సులభమై, చిత్తము పరిశుద్ధము, నిశ్చలమునై, భగవద్భావమగ్నమై, చివరకు సత్యజ్ఞానము నొందును.

* * *

123. పూర్వజన్మములం దేర్పడిన ఉత్తమసంస్కారములయొక్కయో, పుణ్యకార్యములయొక్కయో, ప్రేరణ ముండినగాని మానవునకు ఆస్తికధర్మమునందుగాని, దేవుని యందుగాని, నమ్మిక మేర్పడదు; బుద్ధి యందుకభిముఖమై యుండదు. మహోత్తమపుణ్యకార్య మేదో చేసినందుచే అట్టి నమ్మకము, అట్టి అభిముఖత, ఉన్నను, అనేకవిఘ్నములు,

అనేకకష్టములు పొడచూపి, ఆస్తికధర్మపథశీఘ్రపురోగమనము మిక్కిలి దుర్ఘటమగునట్లు చేయును. కాని అంతమాత్రముననే నిరాశనొంది విరమింపరాదు. వానిని జయించు నిచ్ఛ ప్రబలమగుకొలది, అవి నీ స్రోవనుండి తొలగిపోవుచుపోవును. అంతేకాదు. ఆ విఘ్నములే తమ వైరమునువీడి సహకరించి, సాహాయ్యకములగుటయు కలదు. అడ్డంకులను, నిరోధములను ఎదుర్కొనుటకు నీవు వెఱచుకొలది అవి నిన్ను బెదరించుటకును, మొండిచేయుటకును అధికాధికముగా ప్రయత్నించును.

* * *

124. పూర్వజన్మార్జితసత్సంస్కారము లుండినగాని, మానవుడు శాస్త్రములను, గురూపదేశములను సరిగా గ్రహింపజాలడు. అతడు మహోన్నతపాండిత్యమును, బుద్ధిని, ఇతరశక్తులను, ఆర్జించుకొనియుండవచ్చును, సంఘమందు ఉన్నతపదవి, పేరు, ప్రతిష్ఠ, గౌరవము కలిగియుండవచ్చును, వర్తకవ్యవహారజ్ఞానమునందసమానుడై యుండవచ్చును; పెక్కులక్షల ద్రవ్యముకలవాడై యుండవచ్చును, కాని ఆత్మసంబంధములగు సూక్ష్మసత్యములవిషయమున శిశువువలె కేవల మజ్ఞుడై యుండవచ్చును, ఆస్తికధర్మవిషయక ప్రాథమికసత్యములనుకూడ సులభముగా గ్రహించుశక్తి లేకయుండవచ్చును. కాని సత్యనిష్ఠుడై, భక్తిశ్రద్ధలు, నిష్కాపట్యము కలిగి, ప్రేమపూరితుడై, దీనులయెడ, ఆర్తులయెడ, సానుభూతిచూపువాడై యున్నచో, ఈశ్వరకృపవలన సాధుసంగము, 'అధికారి'యగుగురువు, వారి యనుగ్రహము,

లభింపవచ్చును. తత్ఫలముగా అతడు ఆస్తికధర్మసూక్ష్మసత్యములను గ్రహించునర్హత నార్జించుకొనవచ్చును.

* * *

125. ఉత్తమరూపపూర్వసంస్కారము లంతగా లేకున్నను, మనఃపూర్వక నిరంతర పరిశ్రమచేతను, అభ్యాసము చేతను, వానిని కలిగించుకొనవచ్చును. అభ్యాసమునందు అపారశక్తి కలదు. భక్తిశ్రద్ధలతో చిరకాలము నిర్విరామముగా సాగించినయెడల అభ్యాసము సుస్థిరమై, నిలకడగా నుండును. నీవు అభ్యసించున దంతయు కాలక్రమమున నీకు స్వాభావిక మగును. అప్పుడు అభీష్టకార్యమును సాధించుటకు పరిశ్రమింప నక్కఱయుండదు — అది అప్రయత్నముగా, తనంతటతానే, నెఱవేఱును. ఈశ్వరస్మరణము, ప్రార్థనము, జపధ్యానములు, అనిశ మభ్యసించుచుంటివేని, అవి నీ వితర కార్యవ్యగ్రుడవై యున్నపుడుకూడ, సంకల్ప, ప్రయత్నము లేమియు — నీ యెఱుకతో — చేయకున్నను, హృదయము నుండి బయలువెడలివచ్చుచుండును. దిక్సూచీయంత్రపుసూది వలె మన స్సాదిక్కునకే తిరిగి నిలిచియుండును. కావున ప్రాపంచికవిషయాసక్తి అదృశ్యమై, అపాయములు, ఆపదలు అట్టివానిచిత్తమును సంక్షోభపఱుపజాలవు. మరణకాలమున గూడ చిత్తము ప్రశాంతమై ఈశ్వరునందు నిమగ్నమై యుండును. పరమానందస్థితిలో చేరియుండును గనుక అట్టి వాడు మరలమరల జననమరణము లందుచుండ నక్కఱ లేదు.

* * *

126. తీవ్రశ్రద్ధావివేకవైరాగ్యప్రేమలతో సాధన లొనర్చి ఈశ్వరుని నీ హృదయమందు సుప్రతిష్ఠితు నొనర్చు కొంటివేని, నీ వాయన సాక్షాత్కరించి, నీ లోపలను, వెలుపలను, సర్వవస్తువులందును కానిపించుచుండును. అట్టి వాని కీ జగత్తులో నింకేమియు సాధింపవలసినదిగాని, వాంఛింపవలసినదిగాని మిగిలియుండదు, వాని జీవిత మానందపూరితమైయుండును. ఇదియే యథార్థమగు మానవజీవితపరమార్థము. తక్కినదంతయు అవాస్తవికవస్తువులవెంట పరువులిడుటయే.

* * *

127. నీ పరిపూర్ణశక్తితో జపతపములు హృదయపూర్వకముగా నభ్యసింపుము. కాని ఈశ్వరసాక్షాత్కృతి ఆయనయనుగ్రహమూలమునమాత్రమే* లభింపగలదు, జపతపఃఫలముగా లభింపనేరదు అను సత్యమును నీ మనస్సునందు సుస్థిరముగా నుంచుకొనియుండుము. సాధనాభ్యాసమంతయు రెక్కలను బడలించుటకుమాత్రమే ఉద్దేశింపబడినదని చెప్పనగును. రెక్కలు బడలుటతోడనే పక్షి విశ్రమింప జూచును. సముద్రములో చాలదూరము ఎగిరిపోయినపిదప ఓడ స్తంభ మొకటితప్ప తాను విశ్రమించుటకు వేఱుతావేమియు లేదని కనుగొని అచ్చట అది విశ్రమించును. కాని

* హరిమహారాజ్ (తురీయానందస్వామి) ఆయన "లేఖల"లో ఇట్టిభావములను మాటిమాటికి మిక్కిలి మనోహరముగా ఉద్ఘాటించియున్నాడు. వానిసారాంశము ఈ ఖండిక (Paragraph) లోను, పిమ్మట మూడుఖండికలలోను తెలుపబడియున్నది.

ఈశ్వరు డొక్కడే తనకుగల ఆశ్రయ మను భావము అచంచలవిశ్వాసమై, హృదయమున దృఢముగా నాటుకొన్న పిదపగాని, ఎవ్వరును ఆయనయందే పూర్తిగా శరణమంది, తమ సర్వస్వ మాయనే యని తెలిసికొనజాలరు.

* * *

128. ఈశ్వరుడు అంగడిబేరగానివంటివాడని యథార్థ భక్తు డెన్నడును తలపడు. భక్తిముక్తులకై ఆయనతో బేరమాడుభావమే అతనిచిత్తమున ప్రవేశింపదు. ఈశ్వరుడు అపారదయాసముద్రు డనియు, తన ధర్మశీలమువలనను, స్వభావమువలనను, తానే తప్పక తన యనుగ్రహమును ప్రసాదించుననియు అత డెఱుగును. కాని సాధకుడు పరిపూర్ణశక్తితో సాధన లభ్యసించినగాని, ఈశ్వరానుగ్రహము లేనిది ఆ సాధనలన్నియు నిష్ప్రయోజన మను అనివార్య విశ్వాస మతనిలో ఏర్పడదు. కావున నొకభక్తు డొక గేయమున నిట్లు వ్రాసెను. "నీ నైజమును బట్టియే నన్ను రక్షింప సంకల్పించితి వేని, నీ కృపాకటాక్షమును నాపై ప్రసరింప జేయుము? జపానుష్ఠానమూలమున నిన్ను ప్రాపించుమాటలన్నియు పిశాచ 'సాంగ' తుల్యములు." 'సాంగ' మనగా వివాహము. పిశాచములకు వివాహ మెట్లుండగలదు? అది అర్థరహితప్రసంగము. సాధనలబలముచేతనే ఆయన సాక్షాత్కృతి నెవ్వరును ఇప్పటికి పొందలేదు; ఇకమీదటను పొందబోరు. సాధనలచేత ఆయనను ప్రాపించు ఆశ ఈతవలన సముద్రమునుదాటు ఆశవంటిది.

* * *

129. సాధనలు త్యజించి, ఆయన కృపావృష్టి స్వతః తనపై కురిసినప్పుడు ఆయన ప్రాప్తించు నని నిర్వ్యాపారముగా వేచియుండు మనియేనా దీనియర్థము? పిపాసాపీడితుడు, ఆయనకై తపించుచుండువాడు, చేతులుముడుచుకొని తాలిమితో కూర్చుండి, కలకాలము వేచియుండగలడా? తీవ్ర భక్తిగల యొక సాధకుడు ఆవేశపూరితభావతో పలికినట్లు అతనిదశ నిజమున కిట్టిది: "నామనస్సు గ్రహించినది, కాని హృదయము గ్రహింపనొల్లదు; మఱుగుజ్జు చంద్రుని అందుకొన జూచుట వంటిదిది!" సాధకునకు "అసాధ్యము" అను మాటయే లేదు. ఈశ్వరుడు అసాధ్యమునుకూడ సాధ్యము చేయు ననియు, సంకల్పించెనేని, ఒంటెను సూదిబెజ్జములో దూఱిపోజేయగలడనియు అత డెఱుగును.

* * *

130. యథార్థభక్తుని — యథార్థసాధకుని — మనస్తత్త్వము అతనిభావమును తెల్పు ఈ పల్కులవలన తేటపడును: "జపధ్యానానుష్ఠానములు నా కానందప్రదములు; వాని ననుష్ఠింపకుండుట నాకు శక్యముకాదు; నా హృదయోపశమనమున కితరమార్గము లేదు గనుక నేను వాని ననుష్ఠింతును. జపధ్యానములు నాకు ప్రాణప్రాయములు; అవి లేనిది నేను జీవింపజాలను; కావున నేను వాని ననుష్ఠింతును. ఈశ్వరుడు నా ప్రాణమునకు ప్రాణము—నా ఆత్మకు ఆత్మ. ఏదోయొకవిధమున ఆయనసాక్షాత్కృతిని పొందవలెను. ఆయన లభింపనిచో, నేను పిచ్చిపట్టి మరణింతును. అప్పు డీ జీవితమే వ్యర్థమైపోవును!" అట్టి తీవ్రపరితాపము,

అట్టి ప్రేమోన్మాదము, అట్టి సడలని పట్టుదల, యున్నచో, భక్తుని కాయన యనుగ్రహమును ప్రసాదించితీఱును — ఆయన ప్రేమస్వరూపుడు గదా! త్రికరణశుద్ధిగా, హృదయ పూర్వకముగా, ఆయన నావాహనచేసినచో, ఆయనకై సర్వసంగపరిత్యాగ మొనర్చి ఆయననే ఆశ్రయించినచో, ఆయన అవశ్యము సాక్షాత్కరించును.

* * *

131. కాని ఆ తీవ్రపరితాపము, ఏకైకశరణ్యు డతడే యను ఆ మానసికబోధము, సులభముగా లభించునా? అసంఖ్యాకపూర్వజన్మములందు పరమార్థసంసిద్ధికై అతిగాఢ సాధన లభ్యసించినవాని చివరిజన్మమునందు అది లభించును. శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యాగ్రేసరుడగు నాగమహాశయుని జీవితమునసంతయు ఈ అపూర్వలక్షణము అక్షీణ తేజో వైభవముతో ప్రకాశించుచుండెను. ఎల్లప్పుడును అతని మూర్తినంతయు ఎట్టి అద్భుతభగవదున్మాదపూరితస్థితి ఆవే శించియుండెను! శరీరస్మృతియే లేని ఏమిసంపూర్ణాత్మ నిమగ్నత! ఈశ్వరదృష్టిలో తానే అధమాధముడని పరిగ ణించుకొనియుండు ఎట్టి యద్భుతవినమ్రత! ఈశ్వరదర్శన ముకై ఎంత తీవ్రవాంఛ ఆయన ఆత్మలో ప్రజ్వలించుచు ఆయన భౌతికమూర్తిని దహించివైచుచుండెను! ఆయనదర్శన భాగ్యము నొందనివా రాయనఅత్యపూర్వమూర్తిమత్త్వ మెట్టిదని ఊహించుకొనజాలరు. ఆశ్చర్యకరమగుజీవితము! ఆశ్చర్యకరమగు అనుసరణీయమార్గము!

* * *

132. చిత్తము ప్రశాంతము, పరిశుద్ధము, అకలంకము, అయినగాని ఈశ్వరదర్శనము లభ్యముకాజాలదు. చెఱువులోని నీరు నిశ్చలముగా పారదర్శకముగా (Transparent) నిలిచియున్నగాని అందు ప్రతిబింబమే యేర్పడదు, లేక అస్పష్టముగా ఏర్పడును. అద్దము మురికి గ్రమ్మియున్నచో అందు బింబము ప్రతిఫలింపదు, లేక బింబము చెదరినట్లు కాన్పించును. ఇందుచేత అవిరామాభ్యాసము, త్యాగవైరాగ్యములు తప్ప మనఃపారిశుద్ధ్యసిద్ధికి ఇతరశిక్షణము, ఇతరమార్గము, లేదు. కష్టముగా, అసాధ్యముగా, తోచినదికూడ నిరంతరాభ్యాసమువలన సులభమగును. నిత్యానుష్ఠితమైనది కాలక్రమమున సాధకుని స్వభావములోనే చేరిపోవును. దీనితోకూడ త్యాగబుద్ధిని కూడ అభ్యసింపవలెను. "సర్వము అనిత్యము, అవాస్తవికము, ఈశ్వరుఁడొక్కఁడే నిత్యము, వాస్తవము" అని గ్రహించి తన హృదయమును, ఆత్మను ఆయనకు సమర్పింపగలిగినట్టివానిచిత్తమున విశుద్ధప్రేమ ముదయించును. అది ఉదయించెనేని, అన్వేషించుటకును, వశపఱచుకొనుటకును, ఇంకేమి మిగిలియుండును ? "ఈశ్వరుడు అనిర్వాచ్య ప్రేమస్వరూపుడు". వాఙ్మనోతీతమగు ఆ ప్రేమ అగాధతనంది హృదయమున నిలిచియుండెనేని, అది ప్రేమయొక్క మూర్తిరూపమగు ప్రియుని రూపమొంది యభివ్యక్తమగును.

* * *

133. నీ వచ్చుబడి ఎంత కొంచెముగానున్నను, దానిలో ఏ కొంచెమో ప్రతినెల మిగిలించుకొనుచుండుము,

గృహస్థుడు మిగిలించుకొనుచుండుట మిక్కిలి ఆవశ్యకమని శ్రీ గురుదేవుడు చెప్పువాడు. ఆరోగ్యము, ఉద్యోగము, వ్యాపారము, సంపద, స్వజనము—సర్వము అనిత్యము గనుక, భవిష్యత్కాలమున నిది మిక్కిలి ఉపయోగకరమై యుండును. దుస్సహవాసబలముచేతను, దుర్మనోగతుల చేతను, దురభ్యాసములచేతను, మానవుడు ఇంద్రియసుఖ సమ్మోహితుడై, నవయౌవనమందు లేక, నడివయస్సునందు, ముందాలోచింపక, సంపాదితధనము సర్వమును, అంతకధికముగను, వ్యయమొనర్చినయెడల, అతనికి అనంత వ్యథార్తులుతప్పవు. ఆధివ్యాధులు, విపదపాయములు, విచారవ్యాకులములు జగత్తునందు సదా నెలకొనియుండును. వార్థకమున మనుష్యుడు వ్యాధికి, దౌర్బల్యమునకు ఎరయై, పనిచేయుశక్తిని వేవేగముగా కోల్పోవుచుండును. మిగుల్చుకొనినద్రవ్యము ఉండెనేని, కష్టములకు లొంగిపోక, ఏడ్పులు, ఆర్పులు లేక, అతడు తన జీవిత శేషమును స్వతంత్రముగను, చిత్తశాంతితోను, భగవచ్చింతనయందును, ఆత్మవిచారమందును గడపగలుగును.

* * *

134. సాధకు డొకడు ఈ భావముగల గేయము నొకటి వ్రాసెను. "అమ్మా, నన్ను నీ వేదశయందుంచినను — నిన్ను నేను మఱవకున్నచో — అది నాకు భాగ్యమే" ఈశ్వరుడు సర్వశ్రేయస్స్వరూపుడు, ఎల్లరకును అంతర్యామి. ఒకని కేది మంచిదో, ఇంకొకని కేది మంచిదో, ఆయన యెఱుగును. సర్వలోకహితము నాయన

చూడవలెనుగనుక, నీకును, ఇతరులకును, ప్రతివానికిని, శ్రేయస్కరముగానుండునట్లు కార్యములను ఆయన నడుపుచుండును. ఇతరులెల్లరకు హానికరమగుపనిని ఆయన ఏ యొక్కని మేలుకొఱకై చేయనేచేయ డని ప్రతివాడును ఎఱిగి యుండవలెను. "నేను", "నాది" అను భావమునే ఎల్లప్పుడు మదినుంచుకొని, ఆ సంకుచితవలయమందే — ఆ హద్దులుదాటక — నిలిచి, మనకును మనస్వకీయులకును సుఖముకలుగవలెనని వాంఛించుచు—దానివలన ఇతరులకు కీడుకలుగునేమోయని ఏ మాత్రము ఆలోచింపకయే—ఆ వాంఛ నెట్లైనను — ఎంతకష్టించియైనను — తీర్చుకొనజూతుము. ఈ లోకమున అమిశ్రితసుఖము — దుఃఖలేశమేనియు లేనిసుఖము — ఉండనేఉండదు. సుఖదుఃఖములు అత్యధిక సంకీర్ణరూపమున నుండుటవలన, వీనిలో ఏది కోరినను, రెండవది తనంతటతానే వచ్చును. కావున మన కేది కావలెనో అదే లభింపవలెనని కోరుటవలన కలవరపాటు నొందుదుమేగాని, కార్యసిద్ధినొందజాలము. ఈశ్వరుడు సర్వజ్ఞుడు గనుక మనకు నిజముగా శ్రేయస్కర మేదియో దానిని మనకన్న వేయిరెట్లుచక్కగా ఆయన ఎఱుగును. ఈశ్వరు డేమి ప్రసాదించునో దానితోడనే సంతుష్టినంది, ఆయననే ఆశ్రయించి, ఆయనయందు పరిపూర్ణవిశ్వాసముంచి, లోకముననుండువాని సమచిత్తతను సుఖదుఃఖములు కలగింపనేరవు.

* * *

135. "ఐహికపదార్థసక్తచిత్తు డరణ్యమున కేగినను,

బహువిధప్రత్యూహములు — సూచనమాత్రముగానేని ముందుగా తెలియరాక—ఆకస్మికముగా అతనికి సంఘటిల్లుచుండును. కాని సత్కార్యాచరణుడై పంచేంద్రియ నిగ్రహమొనర్చినవాని గృహ జీవితమే తపస్యయగును. ముక్తసంగునిగృహమే తపోవనము'' అని హితోపదేశము* తెలుపుచున్నది. మనోనిగ్రహముసాధింపక నీ వెచ్చటికేగినను, ఏమిచేసినను, నీకు కడగండ్లు కలిగియేతీరును. తప్పించుకొనుట అసాధ్యము. అంతేకాక, క్రొత్తవిధములైనవి, ఎన్నడునుతలపనివి, అగుబంధములలో చిక్కుకొందువు. కాని సాధనలుచేసి మనస్సునువశపఱచుకొనగలిగినవానికి, లోకములో వసించుచుండియు నిస్సంగుడైయుండువానికి, గృహమైనను, అరణ్యమైనను సమానమే. ఎక్కడనున్నను, ఏమిచేసినను అతడు నిత్యముక్తుడు, ఆనందపరిపూర్ణుడు.

* * *

136. సామాన్యమానవుడు ఒకక్షణముసేపైన మాటలాడకయుండజాలడు. మాటలాడుట కెవ్వరును లేనిచో, అతడు తప్పక మనస్సులో మాటాడుకొనుచుండును. ''ఆలోచించుట'' అనగా అదిగాక మఱేమి? తనతో తానే మాటాడుకొనుటయే. అగుచో, నిరర్థకముగా వ్యర్థసంభాషణప్రసక్తుడైయుండుటకన్న భగవన్నామము స్మరించుచు, ఆయనను గూర్చి సాధ్యమైనంతసేపు తలచుచుండుట ఎంతో శ్రేష్ఠ

---

* ఇది యొక ప్రాథమిక సంస్కృతగ్రంథము. మిక్కిలి ఉపయోగకరములు, నీతిబోధకములు, అగు చిన్నకథలుకలది.

తరముకాదా? కార్యార్థముగాని, వర్తకవ్యవహారములందు గాని, అనేకవిధప్రసంగములు చేయుట ఆవశ్యకమే. కాని నీవు ఒంటరిపాటున నున్నప్పుడును, ముఖ్యకార్య మేదియు లేనప్పుడును, నిరుపయోగములగు ఇతరభావములందుమగ్నుడవైయుండుటకన్న ఈశ్వరస్మరణము, ఆయననామోచ్చారణము, అభ్యసించుట శ్రేయస్కరమనుటనిస్సంశయము. వేఱుతలంపులను నివారించుకొనుటకు సదా జపమనుష్ఠించుచుండుట అవసరము. జప మనగా భగవన్నామము అవిరామముగా, నిరంతరాయముగా, ఆవర్తించుటేగదా.

* * *

137. జపానుష్ఠానకాలమున, నామము, తత్సూచితవస్తువు అభిన్నములని భావించుచు, బుద్ధిని ఆయనమీదనే నిలుపవలెను. పేరు, పేర్కొనబడినవాడు, ఒక్కటే. అనగా, నీ వొక పేరు ఉచ్చరించుటతోడనే ఆ పేరెవరిదో వారినే భావించుచున్నావని గ్రహింతురు. ఎవరినైన నీవు పేరబిలిచితివేని, అతనిబింబ మందుతోడనే నీ మనస్సులో కానిపించును, అతడునుపలుకును, లేక సమీపించును. జపముకూడ—సరిగా అనుష్ఠింపబడెనేని. చిత్త మాయనమీదనే నిలుపబడెనేని—సరిగా అదియే. కాని నీ యావాహన మాయనకందునని, ఆయన దాని నాదరించునని, విశ్వాస ముండవలెను. ప్రార్థనవిషయముకూడ—అదిహృదయపూర్వకమును, గాఢమును అయినచో — ఇట్టిదే. జపానుష్ఠానము నిరంతరతనొందినప్పుడు, ఈ సునిశ్చయభావము, ఈ సన్నిధానభావము, సుప్రతిష్ఠితమై చిత్త మాయనయందు మగ్నమై ఆయన

సాన్నిధ్యము విస్పష్టముగాగోచరించును. కావుననే శాస్త్రములను "జపాత్ సిద్ధిః" (జపమువలన సిద్ధికలుగును) అని పలుకుచున్నవి.

* * *

138. మానవశరీరములో ఏడు పద్మములు (నాడీకేంద్రములు)కలవని యోగులు చెప్పుదురు. అట్టడుగున గుదస్థానమున నాలుగుదళములుగల మూలాధారపద్మము, ఉపస్థామూలమున ఆఱుదళములుకల స్వాధిష్ఠానము, నాభీప్రదేశమునకువెనుక పదిదళములుగల మణిపూరము, హృదయస్థానమున పండ్రెండుదళములుగల అనాహతము, కంఠస్థానమునకువెనుక పదునాఱుదళములుగల విశుద్ధము, భ్రూమధ్యప్రదేశమున రెండుదళములుగల ఆజ్ఞము, శీర్షాగ్రమున వేయిదళములుగల సహస్రారపద్మము, కలవు. ఇవిగాక వెన్నెముకకు, ఎడమ, కుడి, ప్రక్కల ఇడాపింగళానాడులును మధ్య సుషుమ్నానాడియు కలవు. అవి వెన్నెముకయొక్క ఊర్ధ్వాగ్రమువఱకు వ్యాపించి యుండును. సుషుమ్నానాడి ఆఱుపద్మములలో క్రమముగా నొక్కొక్కదాని నట్టనడిమి నుండి ఎగబ్రాకి బ్రహ్మమునకు నిలయమగు సహస్రారములో నంతమొందును. కాని కులకుండలిని (చుట్టచుట్టుకొనియుండు సర్పాకృతిగలశక్తి) మేలుకొనువఱకు సుషుమ్నాద్వారము (మూలాధారమునొద్దిఅడుగుద్వారము)మూసికొనియుండును. కులకుండలిని ఆత్మజ్ఞానశక్తి. బ్రహ్మముయొక్కయు, "చిత్తు" (Intelligence) యొక్కయు సత్త్వసారము (Essence), మానవు లందఱియందును ఈ శక్తి మూలాధారపద్మమునందు

నిద్రితసర్పమునుబోలి—నిర్వ్యాపారముగా, కదలక మెదలక — చుట్టచుట్టుకొని అజ్ఞాతముగా పడియుండును. యోగాభ్యాసము, ధ్యానము, సాధనలు మున్నగువానివలన ఇది మేల్కొనును. మూలాధారములోని ఆ శక్తి మేలుకాంచి మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ అజ్ఞాచక్రముల నొక్కొక్కటిగా భేదించుకొని సుషుమ్నాద్వారమున పైకెగసి సహస్రారమందు పరమశివుని (లేక పరమాత్ముని)తో కూడినప్పుడు ఆ యిరువురి సంగముచేత అతీంద్రియమాధుర్యామృతము ప్రవహించును. దానిని త్రావి సాధకుడు సమాధినొందును. ఆ స్థితియందతడు పరమాత్మజ్ఞానప్రబోధితుడై సంసిద్ధినందును, మఱియు వివిధములగు అద్భుతపారమార్థికానుభూతులు—సర్వవ్యాప్తమగు స్వయంప్రకాశతేజస్సు, ఇష్టదైవముయొక్క తేజోమైభవస్వరూపము, ఇత్యాదులు—కలుగును. ఒక్కొకసారి సాధకుడు పూర్వజన్మములందనుష్ఠించిన సాధనలబలముచేతను, సత్కర్మఫలముగను—ఈ కుండలినీశక్తి అప్రయత్నముగనో, స్వల్పప్రయత్నముననో, గురువుయొక్కయు పరమేశ్వరుని యొక్కయు కృపవలన మేలుకాంచును. ఆ నిర్వికల్పసమాధిస్థితిలో—సాధకుడు పరమాత్మ (లేక, బ్రహ్మము)లో నిమగ్నుడై ఐక్యమంది యుండుస్థితిలో—శరీరము ఇరువదియొక్కనాళ్ళ కధికముగా నిలుచుటరుదని శ్రీ గురుదేవుడు చెప్పువాడు. షట్చక్రభేదము (ఆఱుచక్రములను—నిగూఢనాడీకేంద్రములను—భేదించుట) అనబడునది, సమాహృతరూపమున (in short) నిదియే.

139. కాని జగద్గురువులు, ఆచార్యకోట్లు (మహోన్నతజ్ఞానసిద్ధులగు పారమార్థికబోధకులు), ఈశ్వరకోట్లు (దైవాధికృతపురుషులు) — లోకహితార్థమో, ఏదో దైవసంకల్పనిర్వహణార్థమో, జన్మించినవారును, జాగ్రదవస్థకువచ్చిన కుండలినీశక్తిని అదే మార్గమున సహస్రారము (శీర్షము)నుండి అనాహతము (హృదయము)నకు దింపి, "భావముఖము" అనునొక విశిష్టదివ్యభావమున నిలిచి, బ్రహ్మానందమునుకూడ అనుభవింపనొల్లక యుందురు. వారి బుద్ధి కొంతసేపు పారమార్థికసత్యక్షేత్రమునను, కొంతసేపు వ్యావహారికసత్యక్షేత్రమునను నివసించుచుండును. అనగా వారు కొంతసేపు నిర్వికల్పసమాధిలో బ్రహ్మైకజ్ఞాననిమగ్నులుగాను, కొంతసేపు దయాప్రేరితులై జీవకోట్లను అవిద్యామాయాబంధమునుండి విముక్త మొనర్చుసంకల్పముతో మానవక్షేత్రమునకు దిగియు, ఉందురు.

* * *

140. హిందూశాస్త్రోక్తయోగవిధానములను సక్రమముగా అవలంబింపకయే, మిక్కిలిఅరుదుగా, ఎవరోయొక్క మహాత్మునియొక్క కుండలినీశక్తిమాత్రము తనంతటతానే మేలుకాంచునని స్వామిజీ (శ్రీవివేకానందస్వామి) చెప్పియున్నాడు. అది అనిరీక్షితసత్యమొకటి హఠాత్తుగా తెలియవచ్చినవిధమైనది. రోడ్డులో నడచుచు, కాలుతడవడి, అందుచే ఒక రాతిబండ తొలగి, ఆ రాతిక్రింద ఏదో మెఱయు వస్తువొకనికి కానిపించు ననుకొనుము. అత డా రాతి నెత్తి చూడగా, బంగారు నాణెములతో నిండిన భాండము, లోక

దానిపై నొకటి పేర్చియుండుట, కనుగొనును. ఇది అట్టిది. కాని ఇట్లు ఆకస్మికముగా ఉన్నతసత్యానుభూతి నొందినవారు తమ సంకుచితదృష్టిత్వముచేతను, మూర్ఖాభినివేశముచేతను, లోకమునకు అపకారోపకారములను సమముగా చేయగలిగి యుందురు. సామూహిక సంకీర్తనవేళలందు అనేకులు హఠాద్విజృంభితభావోద్రేకముచేత కన్నీరుకార్చుటయు, విలపించుటయు, ఉన్మత్తనాట్యముచేయుటయు, చివరకు స్మృతికోల్పోవుటయు కలదు. వారి కుండలినీశక్తిలో నొక యంశము కొంతతడ వొకించుక మేల్కాంచియుండుట నిజమే. కాని దీనికి అతిభయంకరప్రతిఘాతము కలుగును—వారి కలవడియున్న దురభ్యాసములం దధికతరలోలురగుదురు. మఱియు, భక్తాగ్రేసరులుగను, పారమార్థికతత్త్వసంపన్నులు గను నటించుచు, వారు పేరుప్రతిష్ఠలార్జించుకొనునభిలాష మితిమీఱి, చివరకు మిథ్యాచార్యులుగను, నిరర్థకప్రజ్ఞాభాష ణులుగను, పరిణమింతురు.

* * *

141. సూర్యుడు మానవులకుకనిపించుట సూర్యరశ్మి మూలముననేగాని దీపమూలమునఎట్లుకాదో, అట్లేఈశ్వరుడు మానవులకు కనిపించుట తన కృపవలననే గాని, మనకుగల స్వల్పశక్తివలన గాదు. కాని మేఘావృతుడై యున్నప్పుడు సూర్యుడు కానిపింపడు. అట్లే అవిద్య (అజ్ఞానము, మాయ) ఈశ్వరదర్శనమున కడ్డుపడి నిరోధించును. సాధన, ప్రార్థనా రూప మారుతము లీ మేఘములను పాఱదోలును. అప్పు డాయన గోచరించును. ఈశ్వరుడు స్వయమావిష్కారశీలుడు

గనుక సాధనప్రార్థన లాయన నావిష్కరింపజేయు ననుట పొరపాటు. అవి చేయగలిగినది ఆవరణమును, త్రోవలోని అడ్డంకులను తొలగించుట మాత్రమే.

* * *

142. జ్ఞానము, భక్తి, శౌచము, త్యాగము, ఈశ్వర కాంక్షాతీవ్రత—ఇవి దైవీగుణములు, దైవముయొక్క స్వకీయసత్త్వసారరూపములైనవి. తా నెవరి కనుగ్రహము చూపదలచునో, ఎవరికి సాక్షాత్కరింపదలచునో, అట్టివారి కాయన ఈ సుగుణములను ముందుగనే ప్రసాదించును. ఈ సుగుణము లెవనియందైన కానిపించినయెడల, అతని మోహాంధకారనిశీథిని గడచిపోవుచున్నదనియు, తేజో వైభవస్ఫూర్జితప్రభాత మావిర్భవించు సమయమాసన్న మైనదనియు, స్పష్టముగా ఎఱుగనగును. శ్రీ గురుదేవుని వాక్యమగు దీనిని నీ వెఱుగుదువా? జమీందారుడొకడు తనరైతు అభ్యర్థనము నాలకించి, వాని యింటికి వేంచేసి, వాని ఆతిథ్యము నంగీకరించుటే గాక, ఆ రైతు నిర్ధనుడగుట చేత విలువగలపదార్థములను సేకరింపజాలడని ఎఱిగి, ముఖ్య వస్తువులు కొన్నిటిని వానియింటికి పంపెను. తనకై సర్వము పరిత్యజించి పరితాపపూరితచిత్తముతో తన్నాకాంక్షించు వానికే ఈశ్వరుడు అనుగ్రహము చూపును.

* * *

143. అనగా, ఈశ్వరునికి రాగద్వేషములుకలవు,—అతడు కొందఱి ననుగ్రహించి కొందఱిని నిగ్రహించును, అనియా అర్థము? తన్ను మఱచిసతీసుతకుటుంబద్రవ్యవ్యగ్రుడై

ప్రాపంచికజీవనము గడపువాని కాయన కృపచూపడా, అట్టివానియెడ ఆయన కసంతుష్టియా? అది యెట్లు! ఎల్లరు—ఉపచారములొనర్చుభక్తులు, అపచారములాడు దూషకులు; సన్న్యాసులు, గృహస్థులు — ఆయనబిడ్డలే గదా! తల్లికి బిడ్డపైగల ప్రేమానురాగములు — ఆ బిడ్డ ఆటలలోచిక్కి తన్నుమఱచినప్పుడును, అది బొమ్మలను పాఱవేసి, తనకై ఏడ్వగా ఆమె ఇతర కార్యములను వీడి, వేవేగమవచ్చి, దాని నెత్తుకొని ముద్దాడునప్పుడును— సమానములేగదా. బిడ్డ ఆటలలోమునిగియున్నంతసేపు అది సుఖప్రపూర్ణమైయుండునుగాన, దాని నేల కదల్పవలెను, సుఖముగా ఆడుకోనిమ్ము, అని తల్లి తలచును. బిడ్డకు ఆటలో కొంతసేపటికి విసుగుపుట్టగా, దానిని వీడి, బొమ్మవస్తువులను పాఱవేసి, తల్లియందే బుద్ధితగిలి, ఇతరముదేనిచేతను సంతుష్టి నొందకున్నప్పుడు — ఆమె అప్పుడువచ్చి బిడ్డను తన యొడి లోనికి కైకొనును. తల్లియొడిలోచేరి, ఆమె చన్నుకుడుచు నప్పు డుండు సుఖము నిజమునకే ఆటయందైన నుండునా? కాని బిడ్డ ఆటలను మానదు. ఇదియేమాయ.

* * *

144. భూమిపై తుపాను ఎంతగాచెలరేగుచున్నను, వర్షమెంత ధారాపాతముగా కురియుచున్నను, ఉఱుము లుఱుముచున్నను, మెఱపులు మెఱయుచున్నను, పిడుగులు పడుచున్నను, చాతకపక్షి అణుమాత్రమైనభీతిల్లక మింటి వైపుననే దృష్టినిలిపి వాననీటిని తనివితీఱ త్రాగి దప్పి తీర్చు కొనును. దప్పికొనిచచ్చుచున్నను, అది నేలమీఁది చెఱువు

నీటిని త్రావడు. అట్లే యథార్థభగవద్భక్తుడు తన ఆత్మ యొక్క తీవ్రపరితాపపూరితపిపాసను తీర్చుభారమును ఈశ్వరు నందే నిలిపి, ఇతరు లెవరియొద్దనుండి ఎట్టి తోడ్పాటు నేనియు ఆశింపడు. ఎప్పు డేమి జరిగినను, అదంతయు ఆయన అనుగ్రహప్రసాదమేయని అత డెఱుగును. ఆయనముఖ మెంతభయంకరరూపమున కానిపించినను అత డెప్పుడేని కలవరమునొందడు. బాధ, దుఃఖము, లేమి, పేదఱికము, ఆపదలు, ఇతరకష్టములు. ఏవి త న్నెదురుకొన్నను, అన్నిటి యందతనికి తన ప్రియుని ముఖమే కానిపించుచుండును. ఈశ్వరుడు శ్రేయస్కరుడనియు, అతడు ఏమిచేసినను, అది తనయొక్కయు, ఎల్లరయొక్కయు, మేలుకొఱకే అనియు అత డెఱుగును. అసంతృప్తినొందుటనగా ఆయనను తప్పు పట్టుటయు, ఆయనను, ఆయనఏర్పాటును ఆక్షేపించుటయునే అని యర్థము. యథార్థభక్తుడు, ప్రాణమునైనకోల్పోవును గాని, అట్లు చేయజాలడు.

* * *

145, జీవితతాపత్రయముచే (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములు) వేగుచుండుజీవుని ఈశ్వరునివైపుకు, శాంతిదెసకు, తీసికొనిపోవువాడే గురువు. గురుశిష్యుల సంబంధము పారమార్థికజనకునకును, తత్ పుత్రికాపుత్రులకును గల సంబంధమే. లౌకికజనకు డొక పుత్రుని కనును. గురువు శిష్యునికి పరతత్త్వమునుచూపి జననమరణములనుండి విముక్తునిచేయును. పితృఋణము వంశమునునిలుపుటవలనను, తండ్రియొక్క శ్రాద్ధాదిఉత్తరక్రియలుజరుపుటవలనను, తీర్చు

కొనవచ్చును. కాని గురువు ఋణము — అతడు అవిద్య నుండి తొలగించును గనుక — తన సర్వస్వమిచ్చినను తీఱదు. వంశములోని పూర్వులసుగుణము లేవి యో యొక్కొకటి పుత్రపౌత్రులకు కొద్దిగనో గొప్పగనో సంక్రమించునట్లే, గురుపారంపర్యమునందు కొంతకొంత పారమార్థికత్వము శిష్యప్రశిష్యులకు తప్పక సంక్రమించును.

* * *

146. ఓర్పులేక ఆతురపడువానికి పరమార్థము లభింపదు. పరమాత్మయే ఏకైకయథార్థవస్తువు, ఏకైకసత్త్వసారము, ఏకైకసత్యము, తక్కిన దంతయు — అభివ్యక్తజగత్తు — మిథ్య, అవాస్తవము, మాయాకల్పితము, కావున నిరాకరించుట కేతగినది. అత్యంతతీవ్రాంతి పరిశ్రమలు లేనిది ఈ సత్యము సుస్థిరముగా ఎఱుకపడదు.

* * *

147. క్షుద్రరూపమగు "నీవు" అంతరించినపిమ్మటగాని యథార్థమగు "నీవు" నిజముగా నెలకొనదు. క్షుద్రరూపమగు "నీవు" మరణించినపిదపనే నీయథార్థజీవిత మారంభమగును. క్షుద్రరూపమగు "నేను" మృతినొందగనే చిత్తసంక్షోభహేతువు లదృశ్యమగును.

* * *

148. మనము జీవించుటయు మరణించుటయు ఈ లోకముమీాదనే ఆధారపడియుండునని భ్రమించి, మన "హక్కు"లను, స్వార్థములను, సంరక్షించుకొనుప్రయత్నములో సర్వవిధకష్టములను సంక్షోభములను మనము స్వాయ

ముగనే కల్పించుకొనుచుందుము, మనము అసౌఖ్యము నొందుటేగాక, ఇతరులకుకూడ నష్టము, నాశము కలిగించుటకు శంకింపము! రేయుంబవళ్లు మన అభిమతార్థములు సాధించుకొనుటకై పరువులెత్తుటలో, జీవించుటకై యుద్ధములు చేయుటలో, ఒకరినొకరము చంపుకొనుటకై యత్నించుటలో, అలసిపోవుదుము. "నాకు చావనుకూడ తీఱిక లేదు" అను లోకోక్తి కలదుకదా. ఈ విశ్వభ్రాంతిని కల్పించిన ఆ ఇంద్రజాలికురాలి, ఆ దివ్యజనని, ఆ మహామాయయొక్క మాయ అట్టిది! ఆమె కూర్చుండి ఈ ఆటను చూచుచు, నవ్వును. పిల్లికూనలు, కుక్కపిల్లలు, చెరలాటములాడుచు, కీచులాడుకొని, అప్పుడప్పుడొక దానినొకటి గట్టిగా కొఱుకుకొనుటవంటి దిది. ఈ ఆటకు మనము లేనిపోని యాథార్థ్యము కల్పించి, దానియందనవసర శ్రద్ధవహించి, దానివలన ఏమి కలుగునో అని ఆలోచింపక, పోరాడుటలో చావుకుకూడ తెగింతుము. నాటకమందు నటీనటులు తమపాత్రలతో పూర్ణముగా తాదాత్మ్యమునొందినప్పటివలె ఆటఅత్యాకర్షకమగును నిజమే. కాని అది తాత్కాలికము—క్షణికము.

* * *

149. ఈ జగత్తే, ఈ మనజీవితమే, క్రీడా (ఆట) మాత్రమైనదనుజ్ఞాన ముత్పన్నమైనప్పుడుగాని ఈ క్రీడ అంత మొందదు, చెడుకలవచ్చినప్పుడు మన మొక్కొకసారి పిచ్చివాండ్రవలె నవ్వుదుము. ఒక్కొకసారి ఏడ్తుము, ఒక్కొకసారి ఘోరవిపత్సముద్రమున అసహాయులమై కొట్టుకొనిపోవుచున్నట్లు తలచి వెఱపుతో మూల్గుదుము, దుఃఖావిష్టులమై

అఱితుము, ఆపదల కంతమే లేనట్లు తోచును, తార్కిక బుద్ధియు, నిర్ణయశక్తియు అదృశ్యమై, విపరీతతమవిషయములు కూడ అత్యంతసహజములుగా, యథార్థములుగా, తోచును. కాని మేల్కొంచి, కలనిలిచిపోయినతోడనే, అదంతయు వట్టి కలయేనని కనుగొందుము. జాగ్రదవస్థకు వచ్చినప్పుడు "ఎంత శాంతి దొరికినది! ఎంత హాయిగా నున్నది!" అనుకొందుము. ఒక్కొకసారి సుఖప్రదమగు కలగందుము— లాటరీలో రెండులక్షలుగెలిచితి మని ఆనందపరవశులమై యుందుము, ఈ కల ఆకస్మికముగా అంతమొందినప్పుడు వ్యాకుల మొందుదుము. మనజీవిత మంతయు అట్టిస్వప్నమే— అవిచ్ఛిన్నముగాసాగు దీర్ఘస్వప్నమే. మంచికలలు, చెడు కలలు, ఆశానిరాశలు, సుఖదుఃఖములు పడుగుపేకలుగా నేయబడినవస్త్రమువంటిది. కలజరుగుచున్నంతసేపు అదంతయు వాస్తవమేయని తలతుము. కాని కల ముగిసినప్పుడు జగత్తే శూన్యములో లీనమైపోవును. అప్పు డేమి మిగులును? నిత్యసత్యపదార్థమొక్కటియే నిలిచి, తన స్వభావముచేత, తన్ను ఎఱుకపఱచుకొనును.

* * *

150. ఈశ్వరు డెవనిమీదనేని ఏల కినుకబూనవలెను? శ్రీ వా కాంక్షితవస్తుప్రాప్తికడ్డుతగులుట కోపకారణమగును. ఈశ్వరునికి ఏ వస్తువుమీదనేని కోరికయుండునా? ఆయన కింకను లభ్యముకానిది, అలభ్యముగానుండునట్టిది, ఏదైన ఉండునా? ఆయనకు అంతరాయములుకల్పింపగలవారెవరు? మనయొద్దనుండి ఆయన ఏదియు అభిలషింపడు.

మన మాయనను స్మరించినను, విస్మరించినను ఆయన కొల్కటియే. తత్ఫలముగా కలుగు లాభనష్టములు, సుఖదుఃఖములు, పుణ్యపాపములు మనవే.

* * *

151. తాను బ్రహ్మము నెఱుగుదనని తలచువాడు దాని నెఱుగడని ఉపనిషత్తులు ప్రకటించుచున్నవి. కాని బ్రహ్మము వాఙ్మనోతీతమని, అఖండజ్ఞాన స్వరూపమని, కావున ఉపాధిగత జ్ఞానానుభూతుల కతీతమని ఎఱిగినవాడు దానిని యథార్థముగా ఎఱుగును. అప్పు డతడు బ్రహ్మమే అయిపోవును. జ్ఞాతను (ఎఱుగువానిని) ఎవ రెఱుగగలరు? ఎఱుగబడుటతోడనే అది జ్ఞేయపదార్థము — అనగా పరిచ్ఛిన్నము—అగును, పరిచ్ఛిన్నమైనదంతయు దేశకాల నిమిత్తతాసీమలోనిది, జననమరణములు, గుణాగుణములు గలది, కావున ముక్తిని (పరిపూర్ణతను) ఈయజాలదు. అట్టి పరిచ్ఛిన్నవస్తువు నెఱుగుటచే, ఆరాధించుటచే, పొందుటచే ఏమి ప్రయోజనము?

* * *

152. బ్రహ్మము సత్య, జ్ఞాన, ఆనంద, అనంత స్వరూపమైనది. ఇవి దాని గుణములు కావు; దానిస్వరూపమే, దానిసత్త్వమే. గుణములు ఉపాధులు. అవి శాశ్వతములు కావు—వానికి వృద్ధిక్షయములు కలవు గదా, కావున బ్రహ్మము సర్వగుణములకు, సర్వఆఖ్యాతములకు (Predicates) —సర్వమునకు—అతీతము. దానినిగూర్చి మనము "నేతి", "నేతి" (ఇది కాదు, ఇది కాదు) అని మాత్రమే

చెప్పగలము. దాని పరిపూర్ణస్వరూపము సాక్షాత్కరించి నప్పుడు అట్లుకూడ చెప్ప నలవికాదు. ఏలయన ఆ స్థితియందు ద్వంద్వతాభావమే పూర్తిగా అదృశ్యమగును. ఏమి చెప్పను, ఏమి తెలుపను, అప్పు డెవరు కలరు? కాని దాని సాకార భావమున—సగుణబ్రహ్మభావమున—బ్రహ్మము అనంత కల్యాణగుణసమన్వితుడు.

* * *

153. బ్రహ్మము "ఏకమేవాద్వితీయమ్" (ఒక్కటియే, రెండవ దేదియు లేదు) అయినయెడ, ఎక్కడనుండి, ఏల, మాయవచ్చి దాని నధ్యసించినది? ఇది అత్యంత ప్రాచీన సమస్య, అపరిష్కార్యమైనది, ఏలన మాయాధీనప్రపంచములోనున్నవారు సమాధానము నీయ నసాధ్యమైనది, మాయను తరించిన పిదప ఈ ప్రశ్నము నడుగువారెవరు? అట్టివారికి మాయయనునది ఉండదుగదా, ఆ స్థితియందు ద్రష్ట, దృశ్యము—రెండును—అదృశ్యమై ఏకత్వభావ మొక్కటియే నిలిచియుండును. అప్పుడతడు బ్రహ్మ మొక్కటియే—త్రికాలములం దొకేస్వరూపమున, తన సర్వాతీత తేజస్సుతో ప్రకాశించుచు—కలదనియు, మాయ దాని నెప్పుడుగాని స్పర్శింపలేదనియు, ద్వందతాభావము కేవల భ్రాంతియనియు, "నేనే అఖండబ్రహ్మమను" అనియు ఆంతరబోధముచే తెలిసికొనును.

* * *

154. గురుబోధలను — తద్వాక్కులను, తద్భావమును—పూర్తిగా అనుసరించి, అకృత్రిమగౌరవముతో,

పరిపూర్ణ శ్రద్ధాభక్తులతో, త్రికరణశుద్ధిగా, అనుష్ఠింప యత్నించుచు, గురుసేవకు — ఆయనప్రీతిని, సంతుష్టిని మాత్రమే ఆశించి—తన్నంకితమొనర్చుకొనువాడే శిష్యుడు. గురువును మానవమాత్రునిగా భావింపవలదు. ఆయనను దృశ్యరూప భగవంతునిగా చూచుచు, హృదయపూర్వకముగా ప్రేమించుచు, ఆరాధించుచు ఉండు శిష్యుడు శీఘ్రముగా పారమార్థిక పురోగమనము నంది వాంఛితార్థమగు పరమగమ్యమును చేరును. హృదయస్థుడగు పరమగురువుతోడి (ఇష్టమూర్తియగు ఈశ్వరునితోడి) సమావేశము కల్గించునది "అధికారి"యగు గురువే. గురువుద్వారానే పారమార్థిక ప్రవాహము శిష్యునికి చేర్పబడును. గురువు ననుగ్రహముచే సర్వాభీష్టములు సిద్ధించును. కాని శిష్యుడు కూడ అందుకు అర్హ లక్షణములు ఆర్జించుకొనియుండవలెను. వాఙ్మనఃకాయశుద్ధి, జ్ఞానభక్తిముక్తులకై తీవ్రాసక్తి, ప్రాపంచిక వస్తువిముఖత, నిర్నిరోధ పరిశ్రమము ఆవశ్యకములు. గురువుకూడ శాస్త్రసిద్ధాంతభావమునందు కూలంకషపరిజ్ఞాన మార్జించుకొని, పాపవిదూరుడై, బ్రహ్మమునందు సుప్రతిష్ఠితుడై యుండవలెను. అతడు ఐహికభోగవాంఛారహితుడుగను, స్వార్థపరత్వశూన్యుడుగను, పరహితరతుడుగను ఉండవలెను. అతని ప్రేమయు, దయయు సర్వభూతములందు సమముగా నుండవలెను.

* * *

155. తండ్రి తన పుత్రునిచేతను, గురువు తన శిష్యుని చేతను ఓటమినొంద కాంక్షింతురు. అనగా వారి హృదయ

పూర్వకవాంఛ ఇట్టిది: "నా పుత్త్రుడు, నా శిష్యుడు నాకన్న అధికతరమహత్త్వము నొందుగాక; నాకన్న అధికతరోన్నతి నంది, నాకన్న ఎక్కువకీర్తిని, గౌరవమును ఆర్జించుకొను గాక". కాని తండ్రి తన పుత్త్రునియొద్దనుండి కాలక్రమమున నెన్నిలాభములనో పొంద నాశించును. గురువట్లుకాక శిష్యుని యొద్దనుండి స్వలాభమేమియు పొందగోరడు. ఇచ్చుటయే అతని స్వభావము. ప్రతిఫలకాంక్ష యేమాత్రములేక అత డిచ్చును. స్వామీజీ మాకిట్లు చెప్పువాడు: "మీలో ప్రతివాడును వివేకానందుని మించుగాక! అప్పుడు నేను పూర్ణానంద ప్రపూర్ణుడనై, నారాక (లోకమునపుట్టుట) సార్థకతనొందె నని తలంతును."

* * *

156. శవము ఖడ్గముతో నఱకబడినను బాధ నొందదు, దేహము శవప్రాయముగా చేయబడెనేని, అనగా, దేహాత్మబుద్ధి నశింపజేయబడెనేని, జీవితమున మనపై ఎన్ని గాఢమగు దెబ్బలుపడినను, వానివలనిబాధ మనకు ఉండనే ఉండదు! ఈ దశకు వచ్చినవారు మాత్రమే — సామాన్య మానవులవలె-స్థితిగతులకు చలింపక జీవన్ముక్తులైయుందురు. వారికి గృహశ్మశానములు — బ్రదుకు చావులు — అభిన్నములు.

* * *

157. దేహముతోడి ఏకీభావము—దేహాత్మబుద్ధి— సర్వపాపములకు మూలము. అన్ని భయములు, అన్ని పొరపాట్లు, అన్ని దురితములు దానినుండియే ఉత్పన్నము

లగును. దేహమును కాపాడుకొని బ్రదికియుండుకొఱకు మనుష్యు డెట్టి దురితమునేని — దొంగిలించుట, మోసగించుట, ఇతరులకు వినాశము తెచ్చుట, చంపుట—చేయ వెనుదీయడు. కామినీకాంచనములే అత డర్చించు దైవము. తత్ఫలముగా అతడు చివరకు సుఖము కలుగునను ఆశతో దుఃఖమునకు స్వాగతము చెప్పును, అమూల్యమగు తన దేహమును సంరక్షించుకొనుటకై మరణమునే ఆలింగన మొనర్చుకొనును. క్షణక్షణము అతనికి మృత్యుభీతి. కాని, జ్ఞానప్రబుద్ధాత్ముడు — దేహాత్మబుద్ధికిఅతీతమైనవాడు — తన ప్రాణము నొక క్షుద్రజంతువు కొఱకేని హర్ష పూరిత బుద్ధితో ఆహుతి యొనర్ప సంసిద్ధముగా నుండును. ఈ శరీర మతని కొక లెక్కలోనిదే కాదు — కేవలక్షుద్రవస్తువు. మనుష్యులు రెండు విధములవారు — పశుప్రాయులు, దైవ ప్రాయులు - దేహముతో నైక్యమొందియుండువారు, దేహ భావము లేనివారు. దేహబద్ధుడగువాడు పశుప్రాయుడు, దేహభావమే లేని రెండవవాడు దైవప్రాయుడు.

* * *

158. సర్వకర్మముల—సత్కర్మముల, దుష్కర్మముల, మిశ్రితకర్మముల — ఫలములను ఈశ్వరార్పణ మొనర్పవలెను. మన సత్కర్మములను, పుణ్యకర్మములను తలచి — వానిని చేసినది మనమే అనుభావముతో — గర్వించి, వాని ఫలములను మనమే, మనభోగార్థమే ఉంచుకొనుటయు, మన దుష్కర్మములను, పాపకర్మములను— వానివలన మనకు అగచాట్లు కలుగునుగదా యని—భగ

వంతుని కర్పించుటయు అనుచితము. మన దుష్కర్మము లన్నియు ఆయనప్రేరణవలననే చేసితిమనియు, ఆయన నడపిన ప్రకారమే మనము నడచితిమనియు, కావున బాధ్యత యంతయు ఆయనదే యనియు, మనము నిర్దోషులముగనుక ఆ దుష్కర్మముల ఘోర ఫలమును మన మనుభవింపవలసినది లేదనియు దీని కర్థము! ఇది కేవల మాత్మవంచనము. ఏమియు తనకొఱకై ఉంచుకొనక, తనవిషయమే ఆలోచించుకొనక సర్వము ఈశ్వరునికే సమర్పించుకొనువానికి ఆయన సర్వమును ప్రసాదించును.

* * *

159. మనస్సును అవిద్య(అజ్ఞానము)నుండి విముక్త మొనర్చు పవిత్రనామము లేక పవిత్రశబ్దము మంత్ర మనబడును.

* * *

160. పాతంజలదర్శనమున అవిద్య ఇట్లు నిర్వచింప బడినది అవిద్య అనగా అనిత్యవస్తువులు (ఐహికప్రపంచము) నిత్యము లను భావము; అపరిశుద్ధవస్తువులు (శరీరాదులు) పరిశుద్ధము లను భావము; బాధాకరవస్తువులలో (అనగా చివరకు బాధకలిగించు ప్రపంచ విషయ భోగములలో) ఆహ్లాదము, అనాత్మలో ఆత్మభావము (పారమార్థిక దృక్పథమునుండి స్వకీయులు కానట్టి భార్యాపుత్రాదులను స్వకీయులుగా భావించుట). అవిద్య ఎచ్చట, ఎప్పుడు, ఎట్లు ప్రారంభమైనదో తెలియరాదుగనుక అది అనాది, జగత్తులోని ప్రకృతికల్పితపరిణామవిధానమునుబట్టి చూచిన దానికి

విరామముగాని, సమాప్తిగాని లేదు. కల్పాంతములందు—జగత్తంతయు లయించు ప్రళయకాలములందు—కూడ అది బీజరూపమున అవ్యక్తముగా నిలిచియుండి, సృష్టికాలమున మరల దృగ్గోచరమగుచుండును. తత్త్వజ్ఞానము సిద్ధించు వఱకు మానవులు జననమరణపరంపరావశులై, తమ కర్మాను సారముగా మనుష్య, పశు, పక్ష్యాది జన్మము లందుచు, బహువిధ క్లేశము లనుభవించుచుందురు.

* * *

161. అనగా, ముక్తికై పరిశ్రమించుట వ్యర్థమేనా? కానేకాదు! ఏలన అవిద్య వ్యక్తిమానవులలో అంతమొందు చుండును. అనంతవ్యథ లనుభవించినపిదప, వివేక వైరాగ్య ములు పొడసూపి, జీవుడు ఈశ్వరునిశరణుచొచ్చినచో, ఈశ్వరకృపవలన ఆ జీవుని అవిద్య నిర్మూలముగా నశించి, జ్ఞానోదయమగును. కావున అనంతకరుణానిధియగు భగవంతుడు గీతలో ఇట్లు పలుమాఱు ఉద్ఘాటించియున్నాడు: "అనిత్యము, అసుఖము అగు ఈ లోకములోనికి వచ్చితివి గనుక నన్ను భజించుచు, నన్నే ఆశ్రయింపుము. నీ పాపము లన్నిటినుండి విముక్తునిచేసి, జననమరణరూపమును, దుర త్యయమును(దాటుటకు మిక్కిలి కష్టమైనది)అగు ఈ సంసార సముద్రమున కావలనుండు శాశ్వతానందపదమున నిన్ను చేర్తును."

* * *

162. "అన్నము నా నోటియొద్దకు తెమ్ము; కదలుట నా శక్తికి మించినశ్రమ! మీ తండ్రులను, వారిపుణ్యకర్మము

లను ప్రశంసింపుము!" అను నొక వంగదేశ లోకోక్తి కలదు. ఈ కాలమున ననేకు లీ తరగతికి చెందినవారు. ప్రతివాడును తన యభిమతార్థమును అశ్రమముగను, అప్రయత్నముగను, లేక, ఏదోయొక కుయుక్తిమూలముగను, సాధించుకొన జూచును. ముఖ్యముగా పారమార్థిక విషయములందు ప్రయత్నము, పరిశ్రమము, నొల్లక, సర్వమును తనకై ఇతరులు చేసిపెట్టవలెనని కోరును. కొన్ని దినములపాటో, కొన్ని నెలలపాటో, సుమా రొకగంట సేపు కన్నులుమూసి కొని కూర్చుండి, అతడు అసంతుష్టితో "అయ్యో, నా కేమియు సిద్ధించుట లేదు, నా మనస్సు నిశ్చలము చేసికొన జాలకున్నాను, పురోగమన మేమియు పొందుచున్నట్లు నాకు కాన్పించుటలేదు"-ఇట్టి విధములగు మొఱ లారంభించును. స్వామీజీ ఇట్లు చెప్పువారు: "భగవంతుడు శాకపదార్థమా, బచ్చలికూరకట్టయా, చేపయా నాలుగు డబ్బులు పాఱవేసి కొనుటకు?" సద్యఃఫలములకై అంత ఆతుర మేల? పరిశ్రమము సాగించుచుండుము, కాలపరిపాకమున నీ ప్రయత్నము తనంత తానే ఫలించును. లోకులకై నీవు పాటుపడినచో, నీకు కూలి యిత్తురు; భగవంతుని కొఱకు పాటుపడినచో, అత డీయడా? శ్రద్ధ, సుస్థిరత, అకృత్రిమప్రేమ, ఓర్పు, పట్టుదల ఆవశ్యకములు. విత్తనము నాటినతోడనే మొలచి, చెట్టయి, ఫలించునా? ఎంతో కాలము ఎంతో కష్టించి, ఎంతో జాగ్రత్త తీసికొనినపిదపనే గదా కాలపరిపాకమున దానిఫలము లనుభవింపగలుగుదుము.

* * *

163. అనేకులు దీక్షాదానము (ఉపదేశము) గొన్న పిదప కొన్ని వారములపాటు జపధ్యానములు గాఢశ్రద్ధతో అనుష్ఠించి తత్ఫలముగా ఎంతో ఆనందమును, ఉపకారమును పొందుటయు, అటుపిమ్మట ఈ శ్రద్ధ ఆకస్మికముగా ద్రవించి పోయి, ధ్యానార్థము కూర్చుండుటకుకూడ ఇష్టములేకుండు టయు కలదు. హృదయములు వట్టిపోయినట్టును, నిరాధారు లైనట్టును, పట్టుగొమ్మ ఏదియు లేనట్టును, వారికి తోచును. కాని ఇందు భీతిల్లుటకును, నిరాశనొందుటకును, తగుకారణ మేమియులేదు. ప్రతిదానికిని క్రిందుమీదులు, ఆటుపోట్లు, సంయోగవియోగములు,ఉండును. అట్లే సాధకుని జీవితమున గూడ ఆశానిరాశలు, వెలుగుచీకట్లు, ఉండును. ఈశ్వర సాక్షాత్కృతికై గాని,పరమార్థికతాసిద్ధికై గాని మనోభీష్టము తీవ్రముగా ప్రజ్వలించుచుండువాని కిది కలిగెనేని, ఆ తీవ్ర జ్వాల అధికతరతీవ్రతనందును, అతడు చిత్తశాంతికోల్పోయి, ఈశ్వరకృపకై హృదయవేదనతో విలపించును. అంతట ఈశ్వరకృపచే అతడు ద్విగుణీకృతోత్సాహముతో ధ్యాన నిష్ఠ నారంభించి, అధికతరపురోగమనమునంది, అధిక తరానందానుభూతి నొందును.

* * *

164. మఱియొకతరగతివారును కలరు. వారి "నూతనప్రేమావేశము" (లేక ప్రాథమిక ప్రేమ భావో త్సేకము) క్రమక్రమముగా చల్లబాఱును; మనస్సు మొదటి బలోద్రేకములుతక్కి తొల్లిటిదశకు ఆభాసరూప మగును. నిర్దిష్టాచరణములు బాధాకరనిత్యకర్మములుగా, బలాత్కృత

కష్టకార్యములుగా, లాంఛనమాత్రములుగా జరుపబడును. లేక, ఆ అనుష్ఠానములు నిలిపివేయబడి, అందుకు కారణములుగా వివిధములగు అనివార్యకార్యములు, బాధ్యతలు, తీఱిక లేమి, శరీరాస్వస్థత ఇట్టి దొంగసాకులు చెప్పబడును. ఇట్టివారివిషయమున దీక్షాదానముగొనుట, లౌకికజీవనపరిత్యాగము తాత్కాలిక భావావేశఫలమనియు, దుస్సహవియోగమో, తీవ్రక్లేశమో క్షణికమగు పారమార్థికోత్సాహమును, వైరాగ్యమును కలిగించియుండుననియు; లేక, స్వార్థమగు ఏదో ప్రయోజనము సాధించుకొనుకోరిక అందుకు కారణమైయుండుననియు ఊహింపనగును. అట్టివారియందు విశేషపారమార్థికతను ఆశింపదగదు.

* * *

165. అనేకు లిట్లు తలతురు: "నాకు దీక్షాదానము చేసినప్పుడు గురువు నా పాపబాధ్యతనంతయు కైకొనెను. నే నింకేమియు చేయబని లేదు, దేనినిగూర్చిగాని విచారింపనవసరము లేదు; ఆయన అనుగ్రహమువలననే సర్వము సిద్ధించును". ఒకరి పాపబాధ్యత మఱొకరిపై వైచుటయు, ఇతరుల పాపభారమును తాను కైకొనుటయు అనేకు లనుకొనునంత సులభముకాదు. అట్లైనచో, ప్రపంచజీవనమే రూపాంతరమొందియుండును; ప్రతివాడును అశ్రమముగా పాపరహితుడై యుండును! నీ పాపభారమును గురువుకో, ఈశ్వరునకో ఈయదలచితివేని, నీ పుణ్యకార్యభాగమును కూడ అప్పుడే ఇచ్చివేయవలెను. అట్లుకాక, నీ కీ జన్మముననో, జన్మాంతరముననో, సుఖభోగములు చేకూర్పనున్న నీ

పుణ్యకార్యభాగమును నీవే అట్టిపెట్టుకొని, నీకు వ్యథా బాధలు కలిగింపనున్న కార్యభాగమునే ఇచ్చివేయదలచితి వేని, నీవు పాపముల నిచ్చుటయు, ఆయన వాని నంగీకరించుటయు అసత్యము. మఱియు తన పాపభారము నితరులకిచ్చివేసి నిష్పాపుడైనవాడు ఆ పిదప నెట్టిపాపకృత్యములందును ప్రవేశింపరాదు. కావున పాపములుగాని, పాపమనోవృత్తులు గాని దీక్షాదానానంతరము మనస్సులోనిలిచియుండి, నూత్న జీవనము ప్రారంభింపబడకుండెనేని — సర్వపాపహరమగు గంగాస్నానసమయమున ఆ స్నానమాడువాని పాపములు నదీతీరవృక్షశాఖలపై పొంచికూర్చుండి, అతడు నదిని వెలువడివచ్చినతోడనే అతని భుజములపై మరల వ్రాలునని శ్రీరామకృష్ణుడు పరియాచకముగా చెప్పుచుండినట్లు — నీ దీక్షాదానసమయమున నీ పాపములుకూడ అట్లే ప్రవర్తించియుండు ననుట స్పష్టము.

* * *

166. ఎగతాళిమాటలటుండ, ఈ విషయము నించుక ఆలోచించిచూడుము గురువునందు నీకు శ్రద్ధా, ప్రేమ, భక్తు లణుమాత్రముగానేని ఉన్నయెడల, నీ దుష్కార్యఫలములను, నీ పాపములను ఆయనపైని ద్రోసి, ఆయనను వ్యథా వేదన లనుభవింపజేయుట నీవు సహింపగలుగుదువా? ఆయన పాకీబండియా? ప్రేమభావమే లేక, అత్యంతస్వార్థపరులై, ఐహికపదార్థాసక్తులై యుండువారే అట్టి నైచ్యమునకు దిగగలరు. నిజమున కట్టివారు శిష్యులుగా పరిగణింపబడుటకే అనర్హులు. గురువునందు సుస్థిర

శ్రద్ధాప్రేమలుకలవారు దీక్షానంతర మెట్టిపాపమును చేయ నోపరు. తత్ఫలము గురు వనుభవింపవలసియుండునని వారి భీతి. అట్టి శిష్యుల పాపభారమునే ఆయన కైకొనును. నిజము నకు ఈశ్వరుడే గురురూపమున ఈభారమును కైకొని శిష్యుని పాపవిముక్తు నొనర్చును.

* * *

167. అయినను శిష్యుని పాపములు కొన్ని గురువుపై బడుట నిజమే. అనేకులకు—వారి నైతికయోగ్యత, అర్హత విచారింపక — మంత్రదీక్ష (ఉపదేశము) నిచ్చినచో, శుద్ధుడు, అకలంకుడు అగు గురువుయొక్క భౌతిక దేహములో అసాధ్య వ్యాధి ప్రవేశించి, ఆయనజీవితమును కుఱుచపఱచుట పెక్కుసార్లు చూచుచుందుము. కాని ఇది చక్కగాఎఱిగియు నిరవధిక ప్రేమస్వరూపుడు, అస్వార్థపరుడు అగు మహో త్తమ గురువు ఇతరులశ్రేయస్సు నభిలషించి, వారిని ఈశ్వ రాభిముఖుల నొనర్చుటకై, స్వ శరీరవిషయమే ఆలోచింపక, శిష్యజన హితార్థము తన ప్రాణమును కొంచెకొంచెముగా ఆహుతియొనర్చుకొనుచుండును. అవతారమూర్తులు ఇతరుల పాపభారమును తమపై వైచికొందురు. అందుచే వారును వివిధవ్యాధుల ననుభవింపవలసినవా రగుదురు. "ఈవ్యాధి (కంఠమందలి రోహిణీవ్రణము) గిరీశుని (తన శిష్యప్రముఖు డగు నాటకకర్త) పాపములను స్వీకరించుటచే నా శరీరమును పీడించుచున్నది" అని శ్రీరామకృష్ణుడు చెప్పి నాడు.

* * *

168. తుచ్ఛమగు ఈ శరీర మొక లెక్కలోనిదా? గురువరేణ్యుడు యావజ్జీవ తపస్సాధనలచే ఆర్జించుకొన్న అమూల్య పారమార్థిక నిధానము నంతయు ప్రతిఫలకాంక్ష యేమాత్రములేక, అపరిమేయ మని సంకోచింపక మనః పూర్తిగా శిష్యుని కిచ్చివేయును. శిష్యుడు పరిశుద్ధాత్ముడును, యథార్థభగవద్భక్తుడును అయినగాని గురువు తనలోని కెక్కించిన పారమార్థిక ప్రవాహశక్తిని పూర్తిగా గ్రహింపజాలడు. సుస్థిర శ్రద్ధావిశ్వాసములతో గురూపదిష్ట సాధన మార్గమున పురోగమించుకొలది, శిష్యుడు, క్రమాధికముగా పరిశుద్ధమనస్కుడై, గురువు మహనీయతను, ఆయన అనుగ్రహమును గ్రహింపగల్గును. గురువుయొక్క అనుగ్రహము శిష్యుని యొక్క అవిరామపరిశ్రమముతో కూడిన యెడల సంసిద్ధిగలుగును.

* * *

169. మానవజీవితపరమార్థము ఈశ్వరానుభూతియే యగుట నెన్నడును మఱవకుము. నీ జీవితమును పశువువలె ఆహార, నిద్రా, విషయానుభూతులలోను, పనికిమాలిన మాటలలోను, ముచ్చటలలోను, వ్యర్థకార్యాచరణముల లోను పాడుచేసికొన్న యెడల, నీ జన్మము సఫలతనొందక, నీకు క్లేశమే కలుగును. నీ మనశ్శరీరములలో బలవీర్యములు నిలిచియున్నంతకాలము, ఈశ్వరసంసిద్ధికొఱకు నీ యావచ్ఛక్తితో హృదయపూర్వకముగా ప్రయత్నింపుము. ఏకారణమువలనగాని ఆప్రయత్నము సడలకుండవలెను. "ఈ సాధనలు కాలాంతరమున చేయవచ్చును, భగవత్సంకల్పము

కలిగినగాని, ఆయన అనుకూలించినగాని ఇవి సాధ్యము కాజాలవు'' — ఇట్టిమాటలు కార్యోత్సాహశూన్యులును, కర్మాచరణవిముఖులును అగు సోమరు లాడుదురు. శ్రేయస్కరమైన దేదియు వారివలన సాధింపబడదు.

* * *

170. జీవితమునందు శ్రేష్ఠతమకాలము పదియాఱవ సంవత్సరము మొదలు ముప్పదియవసంవత్సరము వఱకు. అప్పుడు దేహమునందు కార్యాచరణసామర్థ్యము పరిపూర్ణముగానుండును, ఇష్టార్థసాధన కుపయుక్తములగు గుణములు—ఉత్సాహము, ప్రారంభకత, ధైర్యము, ఆత్మవిశ్వాసము, ఇచ్ఛాబలము, దృఢనిశ్చయత్వము—మనస్సునందు స్వతస్సిద్ధముగా నెలకొనియుండును. అమూల్యమగు ఆ ప్రాయమును వ్యర్థపఱచికొని, వార్ధక్యమున సాధనానుష్ఠానమునందు మనస్సును వినియోగింపవచ్చునని తలపకుము. అది వెఱ్ఱి ఆశ! ఆత్మవంచనము! అప్పుడు మన స్సొకవేళ అభిముఖమై యున్నను, దేహశక్తు లా పరిశ్రమమునకు తాళజాలక పోవును; దీర్ఘవ్యాధు లెన్నియో పీడించుచుండును; జబ్బులు, బాధలు మనశ్శాంతిని భంగపఱచుచుండును; కొద్దిపాటిపరిశ్రమమే ఆయాసమును దౌర్బల్యమును కలిగించి; కార్యవైముఖ్యమును, నిద్రాభిముఖ్యమును తోడితెచ్చును, శక్తిని కోల్పోయి, ఉన్నతాశలన్నియు అడుగంటి, ఏ కొంచెపు పనికిగాని, సహాయమునకుగాని ఇతరులపై ఆధారపడవలసిన క్లైర్పడి జీవితము దుర్భరమగును; దేహ మొకవేళ కొంత బలముకలిగి యుండినను, నీ పూర్వజన్మసంస్కారములు, ఈ

జన్మమున ఏర్పడ్డ అభ్యాసములు, మనోవ్యగ్రతలు, భార్యా పుత్రపౌత్రులందుగల వ్యామోహము ఇత్యాదులు నిన్ను గాఢముగా బంధించి యుంచుటచేత మనస్సు సులభముగా ఈశ్వరునివైపుకు మరలదు, ఆయన ననుభూత మొనర్చు కొనుట కవసరమగు సాధన లొనర్ప మనఃపూర్వక ప్రయత్నము చేయనీయదు; ఐహిక కార్యములందు దిగిపోయిన బుద్ధిని నీ వెంత యత్నించినను ఉద్ధరించి మరల్పజాలవు. ఇవన్నియు అట్లుండగా, జీవిత మశాశ్వతము, రేపో, ఎల్లుండియో అంత మొందవచ్చును. ముసలితనము వచ్చువఱకు బ్రదుకగలనని, అప్పుడు సమయము, తీఱిక దొరుకునని ఎవరు చెప్పగలరు? నీ వేమి చేయదలచితివో దాని నిప్పుడే చేయుము. "రేపు" చేయ నెంచి, కాలయాపన చేసితివేని ఆ "రేపు" ఎన్నటికిని రాకపోవచ్చును.

* * *

171. సాధకు డీ క్రింది సుగుణములను, నియమములను అభ్యసించుట అత్యంత ముఖ్యము:

(1) ఈశ్వరునందు దృఢవిశ్వాసము కలిగి ఆయననే ఆశ్రయించుకొని యుండుట. (2) బ్రహ్మచర్యము, అనగా ఇంద్రియనిగ్రహము, కామనాపరిత్యాగము. ఇంద్రియవిషయములు అవాస్తవములని, దుష్టములని, చింతించుట చేత వానియం దాసక్తిని, తృష్ణను విడనాడి, సర్వకామవిదూరుడవై యుండవలెను. కాముకత్వనిగ్రహము లేనిది మనోబుద్ధి శరీరముల పూర్ణాభివృద్ధి అసాధ్యము. బ్రహ్మచర్యము పండ్రెండేండ్లపాటు నిర్విరామముగా అభ్యసించినచో, "మేధ"యను

పేరుగల యొక సూక్ష్మనాడి — ధారణాంతరిక జ్ఞాననాడి— ఆవిర్భవించును. ఇది సిద్ధపురుషులందును, ఆకర్షకమూర్తి మత్త్వముగల వారియందును చూపట్టును. దీనినుండి సూక్ష్మ సత్యములను గ్రహించి చిత్తమున నిలుపుకొనుశక్తి కలుగును; అంతట పరిపూర్ణారోగ్యము కలుగును; దేహము, ముఖము దివ్యవర్చస్సుతో తేజరిల్లును; మనస్సు దుర్దాంతశక్తిసంపన్న మగును; కార్యాచరణశక్తియు, బుద్ధిసూక్ష్మతయు బహుగుణాధికమగును. (3) ఆహారవిహారములందు పరిమితియు, క్రమబద్ధతయు ఉండవలెను. ఆహారము అనుద్రేకకారకముగా, పుష్టికరముగా, సులభజీర్ణముగా నుండవలెను. దూబఱదిండి తనమును త్యజింపవలెను. భోజనము చేయుట శరీరమును ఆరోగ్యవంతముగా, కార్యాచరణసమర్థముగా నుంచుకొనుటకుగాని రుచు లనుభవించుటకై కాదు. నిర్మలవాయువు, కొలదిపాటి వ్యాయామములు ఉపకారకముగా నుండును. అస్వస్థకాయులు, మంచముపట్టినరోగులు, దుర్బలులు, నిద్రాభిముఖులు, సోమరులు, కట్టడకు లొంగనివారు. ఇట్టివారు ఏపనికిని ఉపయోగింపరు — గొప్పపనులవిషయము చెప్పవలెనా? (4) దుస్సహవాసములు, దుష్ప్రసంగములు, ఎదుట లేనివారిని తీవ్రముగా ఖండించుట, నిరర్థక కార్యములందు కాలక్షేపముచేయుట, వీడవలెను. సాధుసంగము నన్వేషించుకొనుము, శాస్త్రములను పఠింపుము, సద్భావ మనసము చేయుము, సత్యాసత్యవివేచన మొనర్పుము. (5) జీవిత గమ్యముపై, జీవితాదర్శముపై ఎల్లప్పుడును దృష్టినిలిపి, తత్సాధనకై మనశ్శరీరాత్మలను వినియోగింపుము. తెలుగసి

తాలిమితో, పూనికతో సాధన లభ్యసించుచుండుము. నిరాశాభావముగాని, బడలికగాని నీ చిత్తమును లోబఱచుకొననీయకుము. నీ స్వసుఖమును, కర్మఫలములను లెక్కింపక, మనఃపూర్తిగా ఈశ్వరుని — అతడే నీ సర్వస్వ మని తెలిసికొని — ఆరాధించితివేని నీకు పరమశాంత్యానందములు చేకూరును.

* * *

172. పరతత్త్వసాధకుని యావజ్జీవితము నిరంతర పారమార్థికకృషిగా నుండవలెను, నియమితవేళలం దొకగంట రెండుగంటలసేపు జపధ్యానములందుగడపి, తక్కిన కాలమంతయు — అహోరాత్రములు — తుచ్ఛలౌకికవ్యవహారములం దు మునిగియుండరాదు. పారమార్థికజీవిత మట్లు నిర్మితముకానేరదు. సాధకుని ప్రతితలపునందు, ప్రతిచర్యయందు, ప్రతివ్యాపారమునందు, అది పొడచూపుచు, అతని అస్థిమజ్జాగతమైనదని చెప్పదగియున్నప్పుడే అతడు యథార్థపారమార్థికతగలవా డని తలపనగును. చేతులతో పనిచేయుచుండుము, నోటితో వ్యవహారవ్యాపారముల విషయము పెక్కండ్రతో సంభాషించుచుండుము, కాని మనస్సును మాత్రము ఈశ్వరునియందే నిలిపియుండుము. ఇట్లు ఈశ్వరునందు జీవించుటకే మానవుడు లోకములో పుట్టుచున్నాడనియు, దానివలననే జీవితము సార్థకమగుననియు ఎఱుగుము. వినమ్రత, నిస్స్వార్థత, నిస్సంగత, ఈశ్వరుడొక్కడే నిత్యసత్యపదార్థము అనుజ్ఞానము ఇవియే ఆ దశ నధిష్ఠించు మార్గములు. ఇది కష్టమేగాని అవిరామచిరతరాభ్యాసముచే

సిద్ధించును. శ్రీరామకృష్ణు డొక నీతికధచే — పల్లెటూరి స్త్రీయొకతె అటుకులు దంచుచు, బిడ్డకు పాలిచ్చుచు, పాత బాకీలు చూచి పరిష్కరించుచు, కొనవచ్చినవారితో బేరము లాడుచు, ఇన్నిపనులుచేయుచునే, రోకటిపోటు చేతిపై పడకుండ మనస్సును దానిమీద నిలిపియుండు నను నీతి కథచే—దీనిని దృష్టాంతీకరించువాడు.

* * *

173. ప్రారంభదశలో జపధ్యానము లొక క్రమము ననుసరించి నడుపవలెను. మనస్సు స్వాభావికముగా పని చేయుటకు, శ్రమించుటకు విముఖమై, వానిని తప్పించుకొను టకు సాకును వెదకుచుండును, నియమితకార్యము నొనర్పక ఇతరముఖముల పరుగులిడుచుండును. ఏదో యొకకార్యమున ప్రవర్తిల్ల జేయవేనిఅది అనేకవిధ నిష్ప్రయోజన విషయముల లోను దుర్విషయములలోను నిమ్న దించును. కావున "నిర్వ్యాపృతబుద్ధి పిశాచకర్మాగార" మని న్యాయముగనే చెప్పపడినది. దానిని కట్టడిలోనికి తెచ్చుటకు బలాత్కృత నియమములచే బంధించి యుంపవలెను. చక్కగా యోచించి నీకు ఆచరణసాధ్యముగానుండు దినచర్యాక్రమము నొకటి ఏర్పఱుపుము. ఎప్పు డెట్టి స్థితిగతులు కలిగినను, ఇతరకార్య మేదిచేయవలసివచ్చినను, ఆ (దినచర్యానుసార) కార్యక్రమ మునే అనుసరించి తీఱుదు నని నిశ్చయించుకొనుము. పార మార్థికపురోగమనమున కట్టి పట్టుదల, అట్టి సుస్థిరత్వము అత్యంతముఖ్యము. ఆహారము, విహారము, గ్రంథపఠనము, వ్యాయామము, నిద్ర, పని, ధ్యానము, సాధనలు—ఇంతేల,

యోగ్యకార్యముల కన్నిటికిని—ఒక నియమిత వేళ యుండ వలెను. క్రమబద్ధము కానివిధమున దినములు గడిపితివేని, జీవితము వ్యర్థమగును. ఒక దినచర్యాక్రమము నేర్పఱచి, మనస్సు నిట్లు తీవ్రముగా ఆదేశింపవలెను· "నీకు ఇష్ట మున్నను, లేకున్నను ఈ నియమములను నీవు పాటించియే తీఱవలెను!" మనస్సు కొంతకాలము మొండిచేసి, అవశ ముగా నుండును. దానిని కార్యాచరణమున ప్రవర్తింపజేయు నీ ప్రయత్నముల నన్నిటిని ఎదిరించుచుండును. పలుదిశల పరువిడుచుండును. కాని, దానిని బలాత్కారముగా కార్యో న్ముఖము చేయు ప్రయత్నములను నీవుమాత్రము మానరాదు. బలాత్కరించుటేకాక బుజ్జగించుచు కూడ నుండవలెను. మఱియు పని సరిగా జరుగునట్లు కూడ చూచుచుండుము. మనస్సును మచ్చిక చేసికొనుట అడవి మృగమును మచ్చిక చేసికొనుట వంటిది. ఎంతో ఓపికయు, పూనికయు, ఇచ్ఛా బలమును వలయును. మనస్సు చివరకు తప్పించుకొనుత్రోవ లేదని కనుగొని, కోతిచేష్టలు మాని, విధేయతచూపి, ఎట్లు చెప్పిన నట్లు చేయును. దీనిని అభ్యాసయోగ మందురు— పట్టుదలతో మాటిమాటికి ప్రయత్నించుచుండుట. మనస్సును వశపఱచుకొనుటకు వేఱుమార్గ మేదియు లేదని ఎఱుగుము.

* * *

174. ఎంతకష్టముగానున్నను, ఎంతరసవిహీనముగా నున్నను, ఎంతచప్పిడిగానున్నను, ఎంత రోతగానున్నను ఈ అభ్యాసయోగమును మందు మ్రింగినట్టుగానేని మూడు నాలుగేండ్లు నిర్విరామముగా సాగించితివేని, ఈ ధ్యాన

సాధనానుష్ఠానము ఎంతమధురమో, ప్రాణప్రదమో, అమృత ప్రాయమో' పరిశుద్ధానందప్రదమో నీ కప్పుడు తెలియును. కాలేజీపరీక్ష యేదోయొక దానిలో ఉత్తీర్ణులగుటకు, విద్యార్థు లెంతభయంకర శ్రమకోర్చి అర్ధరాత్రము వఱకు మేల్కొని యుండి అనాలోచితముగా శరీరమునకు చేటుతెచ్చుకొనుచు, ఆరోగ్యమును నాశిల్లజేసికొనుచుందురు! ఇదంతయు కాక నిరంతరభీతి, దిగులు, ఆతురత వారిని వేధించుచుండును. అదియొక గండమువంటిదిగా తోచును — పరీక్షలో విజయ మొందుట మీదనే బ్రదుకు చావు లాధారపడి యున్నట్టు! ఇంతకు, ఇదంతయు ఏ ఫలముకొరకు? గొప్ప ఉద్యోగమును సంపాదించుకొని — ఇది సంశయగ్రస్తవిషయము — ధన మార్జించి, పేరుప్రతిష్ఠలు మున్నగునవి లభ్యముచేసికొని, సుఖముగా జీవితముగడపుట కేగదా? భగవత్సాక్షాత్కృతికై చేయవలసినపరిశ్రమ మింతకన్న ఎంతో సులభతరము— అందు గమ్యసిద్ధి నిస్సంశయము గనుక భయవ్యాకులములకు తావులేదు. తక్కిన ఉద్యమము లన్నియు విసర్జించి "గమ్యార్థసంసిద్ధియో, శరీరపతనమో" అను నిష్ఠురదీక్ష గొని ఈశ్వరానుభూతికొఱకు గాఢపరిశ్రమ మొనర్చినచో ఆయన సాక్షాత్కరించి, భక్తునికి అమూల్యాపారమార్థిక నిధానమును ప్రసాదించుట నిస్సందేహము. ఆ నిధానముతో పోల్చిచూచిన, ప్రాపంచికభాగ్యము, సంపద, సుఖము క్షుద్రములుగా తోచును. మరణమును తరించి, అతడు అమృతత్వమును సాధించును.

*    *    *

175. మహారాజ్ (బ్రహ్మానందస్వామి) ఇట్లు చెప్పు వాడు. "దీక్షాప్రదానానంతరము కొలదికాలమునకు నా శిష్యుడొకడైన నాయొద్దకువచ్చి 'మహాశయా, ఇన్నాళ్ళ నుండి నేను జపధ్యానము లభ్యసించుచున్నాను, కాని ఎట్టి ఫలము కలుగలేదు, మనోనిగ్రహశక్తి కొంచెమైన లభింప లేదు, శాంతిసుఖము లేమియు చేకూరలేదు' అని మొఱ పెట్టుకొన్నచో, ఆ మాటలు నాకు వినిపింపనట్లే ఏమియు బదులు చెప్పక ఊరకుందును. పిదప రెండుమూడేండ్ల కతడే వచ్చి యిట్లు చెప్పును 'ఇంతకాలముజరిగినపిదప నేనిప్పుడు కొంచెము పురోగమించుచున్నట్టు తోచుచున్నది. కొంత శాంతిసుఖము లనుభవించుచున్నాను'. కావున నేను మీకు చెప్పునదేమనగా హృదయపూర్వకముగా రెండు మూడేండ్ల పాటు సాధనలు, ప్రార్థనలు నిర్విరామముగా సాగించు చుండుడు. మీ కప్పుడానందానుభూతి కలుగును. ఎట్టి పరిశ్ర మము చేయకయే, ఏదో కుయుక్తివలన, అభిలషించినంత మాత్రముననే మీరు సిద్ధపురుషులు కాగోరుచున్నారు! అది యెట్టి వెఱ్ఱికోరికగదా?"

* * *

176. శారదాదేవి (శ్రీ శ్రీ మాతృదేవి) కూడ ఆమె సంతతి (శిష్యుల) యొక్క అవివేక సంప్రార్థనములచేత విసుగుచెందెడిది. ఆమె ఇట్లనును: "శ్రీరామకృష్ణునికాలపు భక్తజను లెంత ఉత్తములు! ఇప్పటివారు 'అమ్మా, మాకు ఈశ్వరుని చూపుడు!', 'శ్రీగురుదేవుని చూపుడు!', 'మాకు ఆయన దర్శనమేల ప్రాప్తింపదు!', 'సంకల్పించితిరేని మీరు

మాకీ ఉపకారమును సులభముగా చేయగలరు,' మన ప్రాచీన యోగీంద్రులు, మహర్షులు యుగముల పర్యంతము గాఢ తపోభ్యాసము చేసియు ఎందఱో ఈశ్వరుని ప్రాపింప జాలకుండిరి గదా! కాని వీరు క్షణకాలమున సర్వము సాధించుకొన జూచుచున్నారు! వీరు సాధన లభ్యసింపరు, తపశ్చర్యగాని, ఆత్మనిగ్రహముగాని పూనుకొనరు, కాని 'ఆయనను మాకిప్పుడే చూపుడు' అందురు! పూర్వజన్మము లందు వారేయే దుష్కర్మము లొనర్చిరో యెవ రెఱుగుదురు? ఆ పాపఫలమంతయు క్రమక్రమముగా అనుభవించి నిశ్శేషపఱచికొన్న గాని ఉన్నత విషయములు ప్రాప్తించునని వారెట్లు ఆశింపగలరు? ఈ జన్మమున సంసిద్ధి ప్రాప్తింపని యెడల, మఱుజన్మమున ప్రాప్తింపవచ్చును, ఆ పిమ్మటి జన్మమున ప్రాప్తించినను ప్రాప్తింపవచ్చును. దానికై పరిశ్రమించుచున్నయెడల అది వచ్చితీఱును. ఈశ్వరానుభూతి అంత సులభమా? కాని, ఈసారి ఠాకురు (శ్రీరామకృష్ణుని) రాకచేతను, ఆయన ప్రదర్శించిన మార్గము మూలముననూ, అది కొంత సులభతరమైయున్నది. అంతయే. వీరు ఐహిక జీవనము గడపుచు, ఏఁటేట బిడ్డలు కనుచుండియు, ఇచటికి వచ్చి '(శ్రీ)గురుదేవుని దర్శనము మాకేల లభించుటలేదు?' అని ప్రశ్నింతురు. స్త్రీలు ఠాకురు కడకు వచ్చి 'మనస్సు ఈశ్వరాభిముఖము కాదేల? నిశ్చలము కాదేల?' — ఇట్టి ప్రశ్నలు వేయువారు. అందుకు ఠాకురు ఇట్లు బదులిడువారు: 'అది ఇప్పు డెట్లుసాధ్యమగును? మీయొద్ద నింకను పురుటి వాసన కొట్టుచున్నది. అది పోనిండు, కాలపరిపాకమున అది

జరుగును. ఈ జన్మమునకు మీరు నా యొద్దకు వచ్చుటే చాలును. మఱుజన్మమున మీరు సులభముగా పారమార్థిక మార్గము పట్టగలుగుదురు'. ఒకవేళ స్వప్నములలో ఆయన దర్శనము లభించునేమో? కాని ఆయన సశరీరుడై భక్తుని చర్మచక్షువులకే దర్శనమిచ్చుట — ఎందటి కట్టి ప్రాప్తి కలుగును! అది నిజముగా అత్యపూర్వభాగ్యము."

* * *

177. శ్రీరామకృష్ణు డిట్లు చెప్పువాడు: "నేను పదునాఱణాలు* చేసితిని, మీరొక అణామాత్రమే చేసిన చాలును". ఈశ్వరానుభూతికై శ్రీరామకృష్ణు డనుభవించిన అమానుష గాఢతపఃక్లేశములలో నూఱవవంతైన అనుభవించుట మర్త్యునిశక్తికి మించినపని. కాని ఆయనకోరిన ఒక్క అణాయైన చేయుట అవసరము. సంపూర్ణమగు పదునాఱుపాళ్ళు చేయప్రయత్నించినగాని ఒక్కపాలైన చేయ గలుగుట దుష్కరము. ఈశ్వరునివైపు నీవొక అడుగు వైచితివేని, ఆయన నీవైపు పదియడుగులు వైచును. తక్కిన యడుగులు తాను తోడ్పడి భక్తునిచేత వేయించును. అది ఆయన అనుగ్రహము, ఆయన కృప.

* * *

178. అహింస పరమధర్మమనుట నిస్సంశయముగా నిజము. కాని దాని యునికి నభినయించుట — అనగా నోటి మాటలందుమాత్రమే అది యుండుట — కేవల నిష్ఫ్రయో

---

* ఒక రూపాయ, అనగా పరిపూర్ణసాధన.

జనము. ఇందు కొక యుదాహరణము జంతువులను చంప కుండుట, చేపలు, మాంసము, తినకుండుట—ఇంతమాత్రము ననే అహింసకాదు, సర్వభూతములందు ఈశ్వరుని చూడ గలిగినప్పుడే — అనగా ఆత్మసంసిద్ధి ప్రాప్తించినప్పుడే-నిజ మైన అహింస ననుష్ఠించుట సాధ్యమగును. ప్రతిక్షణము— తెలిసియో, తెలియకో — అసంఖ్యాకములగు దృశ్యభూత ములను, అదృశ్యభూతములను చంపక లేక హింసింపక, మనము బ్రదుకుటే అసాధ్యము. యోగులు కేవల సాత్త్వి కాహారమునే కైకొనవలెనని పాలుమాత్రమే త్రాగి తపో నిష్ఠ లాచరింతురు. కాని తల్లి పాలన్నియు న్యాయముగా దూడవే గదా. దానికై యుద్దేశింపబడిన పాలను దానినోటి నుండి తీసినగదా వీరికి పాలు లభించును? ఇది అధర్మ కార్యము, క్రూరకార్యము కాదా? ఐనను ఇతరభూతములకు హానికలిగించుచున్నామని, అపకారము కలిగించుచున్నామని ఎఱిగి అట్టి కార్యముల నెంతవఱకు విసర్జింపగలుగుదుమో అంత శ్రేష్ఠము. కాని ఎల్లప్పుడు యధార్థమగు అహింస నభ్యసించుచున్నచో, సాధకునికి సర్వభూతములందు ప్రేమ చేపడి, క్షుద్రాహము (లేక) స్వార్థపరత్వము నశించి, శత్రు మిత్రులయెడ అభేదభావ ముదయించును. అందుచే చిత్త శుద్ధికలుగును. పరిశుద్ధచిత్తమునందు భగవంతుడు సమగ్ర ముగా ప్రతిఫలించును.

* * *

179. "ఒకమూలనో, అరణ్యమందో, మనస్సు లోనో, ధ్యానింపవలెను" అని శ్రీరామకృష్ణుడు ఆదేశించి

యున్నాడు. అట్లుచేసినచో మనస్సు సులభముగా ఏకాగ్రత నొందును. "మూల" అనగా, గుప్తమైన వివిక్త స్థలము. సాధనలు గుప్తముగాచేయవలెను. బహిరంగముగాను, అనేకు లెఱుగునట్లును చేసినయెడల బహువిధ ప్రతిబంధములు, విఘ్నములు బయలుదేఱును. మానవుని మనోగర్భాంతరాళ భావములు, సాధనమార్గములు రహస్యముగా నుంచుకొన వలెను. నిర్నిరోధ బహిఃప్రకటనముచే నవి పాడుకొనక ముందే నాశిల్లునని చెప్పనగును. నీ పారమార్థిక భావములు, భక్తి ఎంతరహస్యముగా నుంచుకొందువో, అవి అంత పెంపు చెంది, అంత తీవ్రబలిష్ఠములగును. కావుననే, సాత్త్విక సాధకుడు జపధ్యానములను చీకటిలోనో, ఒంటరిపాటుననో, అర్ధరాత్రముననో, దోమతెరలోపల మంచముమీదనో — అనగా ఎవ్వరికి తెలియరాకుండు విధమున—అనుష్ఠించును.

* * *

180. "అరణ్యమందు" అనగా ప్రజా, నగర ఘోషకు చాలదూరమున నొక నిర్జన స్థలమున — ఉ. హిమాలయములందు, గంగవంటి పవిత్రనదుల తీరమున, ప్రకృతిసౌందర్యశోభిత మగు పరిశుద్ధమును, ఆరోగ్యకర మును అగు వాతావరణముగలచోట. చిత్తవిభ్రమణ హేతు కములగు కామినీకాంచనాదులవలని అపాయ మేమాత్రము లేకయుండు నిట్టిస్థలములను యోగులు సాధనల కనుకూలము లని ఏర్పఱచుకొందురు. కాని, అరణ్యమున కేగిన పిదపకూడ ప్రాపంచికవిషయచింతనే గలవారి కది అరణ్యముగనే ఉండదు, ప్రపంచమును తమవెంట గైకొనిపోవుటే యగును.

మనస్సును నిశ్చలము, ఏకాగ్రము చేసికొనగలిగిన చో, బాహిరవస్తువేదియు దానిని వికలత నొందింపజాలదు. అప్పు డీ ప్రపంచరూప విపణివీథి (అంగడివీథి) యోగి కరణ్యమై, అరణ్యనిశ్శబ్దతాప్రశాంతులు విపణివీథిఘోషలోకూడ అత డనుభవింపగలుగును.

* * *

181. ధ్యానము మానసికమైయుండుట ముఖ్యము. ఎచ్చట ధ్యానించినను, ఇష్టమూర్తిని మానసాభ్యంతరమున నెలకొల్పి, ఇంద్రియములను నిరోధించి, నీ మనస్సు (లేక, ప్రత్యగ్బోధము) నంతయు దానిపై కేంద్రీకరించుటకు పూర్ణ శక్తితో యత్నింపుము. ఇట్టి అవిరామాభ్యాసము అపార మగు ఆత్మశక్తి వికాస కారణమై, ఈశ్వరుని యథార్థ తత్త్వము నెఱుగుట కనువుపడును. మనస్సు చెదరి పలుదెసల కేగు కొలది, తన ప్రచ్ఛన్నశక్తిని కోల్పోవుచు, దుర్బలమై, నిస్తేజమై, ఎట్టి ఘనకార్యమును సాధింప నేరని స్థితికి వచ్చును.

* * *

182. కన్నులుమూసికొని చీకటిలో ధ్యానము చేయుము. గదిలో గాలియాడుచుండునట్లు కిటికీలు తెఱచి యుంపుము. వస్త్రములు బిగుతుగానుండరాదు. శ్రీ గురుదేవుడు తన సన్న్యాసశిష్యులలో కొందఱిని దిగంబరులై కూర్చుండి ధ్యానముచేయుడని నిర్దేశించెను. అందుచేత వారికి శిశుభావము, బంధవిమోచనము ఉదయింపవలెనని ఆయన ఉద్దేశము.

* * *

183. ధ్యానవేళయందు ఇష్ట మూర్తి హృదయమున నెలకొనియున్నట్లు భావింపవచ్చును. ఏ రూపముననైనది సాధకుని యిష్టము· ఉ. హృదయపీఠమున, హృదయకమలమున, హృదయకుహరమున, హృదయదేవాలయమున, హృదయాకాశమున, హృదయశూన్యతలో, హృదయపేటికలో, లేక హృదయకోశమున, హృదయకేంద్రమున, హృదయనిలయమున, హృదయకుటీరమున, హృదయనికుంజమున (పొదరిల్లు), హృదయసింహాసనమున — ఇంతేల సాధకుని భావనాశక్తి సృజింపగలిగిన ఏ రూపమైనను. హృదయ మనగా మానవుని చైతన్యాంతరాళగర్భము. సామాన్యభాషలో ఈ స్థానముననే ప్రియుడు తీవ్ర మధుర భావావేశముతో గాఢోపగూహనమున (నెఱకౌగిటిలో) తన ప్రేయసిని నిలుపుకొనియుండ గోరునది. ఇష్టమూర్తి హృదయమున నిలిచియున్నట్టు ధ్యానింప జాలనివారు, ప్రాథమిక దశలో నొక చిత్రపటమునో, ప్రతిమనో ఎదుట నుంచుకొని ధ్యానింపవచ్చును. కాని అది బాహిరము.

* * *

184. ధ్యానమునకు అనుకూలతమము లగు వేళలు: (1) రేపగల్లు కలియువేళలు, అనగా ప్రొద్దుపొడుపు, ప్రొద్దుగ్రుంకు వేళలు, (2) "బ్రాహ్మముహూర్తము"న, అనగా రాత్రియొక్క చివరిభాగమున సూర్యోదయమున కొక గంటముందు, (3) అర్ధనిశాసమయమున. ఈ తరుణములందు ప్రకృతి నిశ్చలము, ప్రశాంతము, పావనము గా నుండును. వెన్నెముకలోనుండు సుషుమ్నానాడి ఆ తరుణము లందు

గతిశీలదశయందుండుటచే నాసికాద్వారములు రెండింటిగుండ ఊపిరి నడుచుచుండును. తక్కిన తరుణములందు సుషుమ్నా నాడి కిరుప్రక్కలనుండు ఇడాపింగళానాడులలో ఏదోయొక్కటియే గతిశీలమై యుండుటచే ఊపిరి కుడిముక్కుగుండనో, ఎడమముక్కుగుండనో, ఏదోయొకదానిగుండ మాత్రమే నడచుచుండును. తత్ఫలము మనస్సు నిశ్చలముగా నుండ నేరదు. ఈ కారణముచేతనే, యోగిజను లనేకులు సుషుమ్న ఎప్పుడు గతిశీలమైయుండునో కనిపెట్టియుండి అది పనిచేయ సాగగనే, ఇతరకార్య మంతయు విడనాడి ధ్యానోపవిష్టులగుదురు.

* * *

185. సాధకుని కొన్నొక కాలమున మనస్సు జడమై, గమనవైవిధ్యరహితమై, ఉత్సాహాకరభావావేశశూన్యమై యుండును; జపధ్యానాభిముఖ్య ముండదు; లేక మనస్సు దుష్టభావములకు, దుష్టమనోగతులకు అభిముఖమై, నిరంకుశమై, అవశమై పాఱిపోవుచుండును. ఇట్టి యవస్థ కొంతకాలము నిలిచియుండెనేని, దానికి ప్రతిక్రియ సాధుసంగముతప్ప వేఱొండు లేదు. సాధుసంసర్గము, సాధుస్పర్శ, సాధు దర్శనము, సాధుసేవ: వీనివలన ఆ సాధువుల ఆత్మశక్తి, వారి దైవీస్థితి భక్తుని హృదయమును ప్రవేశించి, పారమార్థిక ప్రేరణ, పారమార్థికబోధము కలిగించి, అతని మనోమాలిన్యమును పోనడచును. అప్పు డతడు నూతనోత్సాహయుక్తుడగును. సాధుసంగావకాశము లభింపనిచో శాస్త్రపఠనము, సద్విషయ విచారము, పరితాపపూరితభగవత్ప్రార్థనము

చేపట్టవలెను. ఈశ్వరనామమునో, మంత్రమునో—ఇచ్ఛయున్నను, లేకున్నను — సదా జపించుచుండవలెనని, సంకల్పబలము నుపయోగింపవలెనని గాఢదీక్ష పూనవలెను. అప్పుడు పిశాచముపాఱిపోయి, తమోంధకారనిశీథిని ద్రవించి పోవును.

* * *

186. మన స్సెల్లప్పుడు నేదోయొకకర్మమునందు వ్యాపృతమైయుండునట్లు చూడుము. దానిని నిర్వ్యాపారముగా నుండనీయకుము. నిర్వ్యాపృతముగా నున్న వెంటనే అది దుర్వృత్తులకు దిగి నిన్ను పీడించును. నీ మనస్సు మిక్కిలి అశాంతస్థితియందో, దుష్టభావపూరితముగనో ఉన్నప్పుడును, ఏదోయొక వ్యామోహమును నీవు నిగ్రహింపజాలనప్పుడును, ఎంత ప్రయత్నించినను మానసోద్రేకమును అణపలేకున్నప్పుడును, ఆ స్థలమును వీడి—నీ కధోగతి కలిగింపనున్న ఆ దుష్ట వాతావరణమునుండి—మఱొకచోటికి పొమ్ము. పల్లెటూళ్ళవైపు నిర్మలవాతావరణమున మూడునాలుగుమైళ్లు వేగముగా నడచినను, ఆ అధోగమనము — తాత్కాలికముగానైనను — అరికట్టబడును. ప్రలోభనము (Temptation) నుండి తప్పించుకొనుటకు రెండే రెండు మార్గములు కలవు. పాఱిపోవుటో, పోరుసల్పుటో కాని మనస్సునుండి పాఱిపోయి దూరముగానుండుట అసాధ్యముగదా. దానిని వశపఱచుకొనుట, దానివశమై దాని యాజ్ఞల ననుసరించుచుండుట—ఇవియే మనకు సాధ్యములు.

* * *

187. కట్టెలోనుండు అగ్ని రాపిడిచేతను, పాలలోనుండు వెన్న చిలుకుటచేతను, నువ్వులలోనుండు నూనె రుబ్బుటచేతను, భూగర్భముననుండు నీరు త్రవ్వుటచేతను ఎట్లు బయటికివచ్చునో, అట్లే హృదయకుహరమున దాగియుండు పరమాత్మ మనఃపూర్వకశ్రద్ధాభక్తులతో ఆచరింపబడిన తపశ్చర్యలచేతను, మనఃకేంద్రీకరణముచేతను, జీవునకు—అతనిసత్త్వసారముగా — తన యథార్థస్వరూపమున నభివ్యక్తమగును.

* * *

188. సాధనలయొక్క ప్రారంభదశలో, జపధ్యానములు క్రమక్రమముగా, కొంచెకొంచెముగా, హెచ్చింపవలెను. నేడు అరగంటో, ముప్పావుగంటో వినియోగించితివేని, కొన్నాళ్ళపిదపనో, కొన్నివారములపిదపనో ఒకగంట వినియోగింపుము. పిమ్మట నిలకడగా గంటన్నఱ, రెండు గంటలు కొంచెకొంచెముగా శక్త్యనుసారము హెచ్చించుచుండుము. అధికాతురతవలననో, శీఘ్రఫలాభిలాషవలని మానసోద్రేకమువలననో, నీకు కాయికముగా, మానసికముగా గల శక్తిని మించి, బలాత్కృతశ్రమాధిక్యము నాకస్మికముగా పూనితివేని. నీ దుడుకుతనముయొక్క ఘోర ఫలములను పిదప ననుభవింపవలసి యుండును. దాని ప్రతిఘాతము భయంకరమై దుర్భరమైయుండును, నాడీదౌర్బల్య శోషణములు తీవ్రరూపమున నుద్భవించి, జపధ్యానానుష్ఠాన శక్తిసంకల్పములు అదృశ్యమై, శీర్ష మస్తిష్కములు వట్టిపోయెనా అనిపించి, నిరుత్తరములుగా నుండును. పూర్వస్థితిని మరల

పొందుట కెంతో కాలము, ఎంతో శ్రద్ధ అవసరమైయుండును. బుద్ధిచెడి, పిచ్చిపట్టుటయు కలదు. ఒకేగంతుతో గృహాగ్రము నందుకొనుట సాధ్యమా? పడి, చేతులు కాళ్లు విఱుచుకొనుటయే ఆ ప్రయత్నమునకు ఫలము. గృహాగ్రమును చేరుటకు మెట్లొక్కొక్కటిగా ఎక్కవలెను.

* * *

189. తీవ్రజపధ్యానములు, యోగము, ననుష్ఠించువారొక సూక్ష్మసాత్త్వికశరీరమును, సూక్ష్మతరనాడీకూటమును, సూక్ష్మనాడీకేంద్రములను పొందుదురు. ఆ నాడులు అగాధములగు అతీంద్రియభావములను, అతీంద్రియభావోద్రేకములను భరింప సమర్థములై యుండును.

* * *

190. యాచకులకై యేర్పఱుపబడిన ధర్మసత్రములలో తృప్తితీఱ భోజనముచేయుటయు, పూర్తిగా సంబారము కైకొనుటయు, సన్న్యాసులకు నిషిద్ధము. వాణిజ్యమూలమునను, ఇతరమార్గములను, అపార ధన మార్జించినవారు శ్రాద్ధకర్మసందర్భములందీ సత్రములకు పెద్దపెద్ద మొత్తములను దానముచేయుదురు. వారిపితరులపారలౌకిక క్షేమముకొఱకో, తమపాపపరిహారార్థమో, పుణ్యమార్జించుకొనుటకో, మత ధర్మపరుడను ప్రతిష్ఠ నొందుటకో, వివిధప్రాపంచికలాభములను సాధించుకొనుటకో ఈ దానములు చేయుదురు. కావున సత్త్రాన్నము పారమార్థికముగా కలుషితము. అది తిన్న వారిబుద్ధి అపవిత్రతనంది, అధోగతిపట్టును. సన్న్యాసులకు మాధుకర-భిక్ష (అనగా, తుమ్మెదలు వేర్వేఱు పువ్వుల

నుండి పూ దేనెను గ్రహించునట్లు భిక్షుకులు అనేకగృహస్థుల యిండ్లకుబోయి ఒక్కొక్కముద్దగా గ్రహించిన భిక్ష) అత్యుత్తమము. అట్లు భిక్షచే నార్జించికొనిన యన్నము పవిత్రమైనది.

* * *

191. సాధనలు సక్రమముగాఅభ్యసించుచున్నగాని, గృహస్థుల దానము లంగీకరించు నధికారము సన్న్యాసులకు లేదు. అది గృహస్థులను మోసముచేయుట. తాము కై కొన్న పరిశుద్ధనియమజీవితమునకు క్రించుదనముతెచ్చుట. సన్న్యాసులు అన్నవస్త్రాదిజీవితావశ్యకవస్తుచింతయే లేక తమ కాల మంతయు సాధనలందే వినియోగింప ననువు పఱుచుకొఱకే గృహస్థులు వారిని సేవించుట. ఈపుణ్యకార్య మొనర్చుటచేత గృహస్థులకు సన్న్యాసుల సాధనఫలముల లోను, వా రార్జించు పుణ్యములోను కొంతపాలు లభించుట సహజమేగదా. కావున ఆ దాతలకును, ఉపకర్తలకును చెందవలసిన భాగముపోగా తమకు వలయునంతమిగులునట్లు సన్న్యాసులు పుణ్యమార్జించుకొనవలయును. ఇట్లుగాక, తామే నష్టావస్థలో నున్నయెడల నైతికముగాను,పారమార్థికముగాను వారికి అపారహాని కలుగును. నష్టినొందియుండు వారి కిహపరములందు కలుగు వ్యథ లనంతములు. వారు తీఱనిదరిద్రదశ ననుభవించుచుందురు. కావుననే యథార్థ త్యాగబుద్ధిగల సన్న్యాసులును, పూర్వాచారపరులు, ధర్మ నిష్ఠులు అగు బ్రాహ్మణులును; దానము లంగీకరింపనే అంగీకరింపరు. శ్రీరామకృష్ణునితండ్రి ఎన్నడును వాని నంగీ

కరించువాడుకాడు. ఇదిగాక, దానపరిగ్రహణము ఋణపఱచి మానవుని స్వాతంత్ర్యమును తగ్గించును.

* * *

192. తలిదండ్రులయెడ, కుటుంబము నెడ, తమకు గల కర్తవ్యబాధ్యతలను విడనాడి, బ్రహ్మచర్యాశ్రమము, సన్న్యాసాశ్రమము, స్వీకరించువారు ఈ జీవితములోనే ఈశ్వరానుభూతినొందు ఏకైకవాంఛతో అట్లొనర్తురు. ఇందువలన ఆ సాధకుల పారమార్థికనిష్ఠాఫలములో కొంత పాలు వారికి (తలిదండ్రులకు) లభించును. కావుననే "యథార్థత్యాగియొక్క పూర్వులు పవిత్రులగుదురు, తల్లియు అదృష్టవంతురాలు" అని చెప్పుదురు. పుత్త్రునికి తలిదండ్రుల యెడ గల ఋణ మిందుచేతనే తీఱును. కాని తలిదండ్రులను విడనాడినప్పుడు వారి దుఃఖాశ్రుకారకుడైన సన్న్యాసి ఆదర్శమునుండి పతనమొంది, నిర్వ్యాపారముగనో, నిరర్థక కార్యములలోనో, దుర్వ్యాపృత్తులందో, కాలయాపన చేయ సాగెనేని, వాని పుణ్యకార్యము లన్నియు వారి కన్నీటిధార లలో కొట్టుకొనిపోవును. అట్టి పతనమున కొకే ప్రాయ శ్చిత్తము కలదు — గృహస్థజీవనము మరల నవలంబించి, తద్ధర్మము లొనర్చుచుండుట.

* * *

193. పారమార్థికనిధానము—గోపాలబాలునిపిడత లోని పాలవలె — అక్షయ్యముగా నుండవలెనన్న, ఈశ్వరానుభూతియొకటియే మార్గము. ఆ పిడతలోనిపాలు, ఎంతకుమ్మరించినను అయిపోవు, తఱుగవు. ఆ కథ మీ రెఱు

గరా? దరిద్రురాలగు నొక బ్రాహ్మణవితంతువుయొక్క కుమారుడు, గోపాలుడనువాడు, ప్రతిదినము ఒంటరిగా నొక అడవిదాటి బడికి వెళ్ళవలసియుండెను. అందు కా బాలుడు మిక్కిలి భయపడుచుండెను. తల్లితోనాత డీ సంగతి చెప్పగా ఆమె యిట్లనెను "నాయనా, భయమేల? మీా మధుసూదన్ దాదా (అన్న) అడవిలోనే ఉండును. నీవు పిలిచినచో అతడు వెంటనే వచ్చును". అకృత్రిమశీలుడగు ఆ బాలుడీ మాటను నిర్వివాదముగానమ్మి తనకు భయముపుట్టినప్పుడెల్ల "మధుసూదన్ దాదా, ఎక్కడనున్నావు" అనును. వెంటనే మనోహరరూపుడగు నొక చిన్ని బాలుడు అడవిలో నుండి వచ్చి "సోదరా, ఇచటనే ఉన్నాను. ఎందుకు భయపడుచున్నావు" అని అడవిదాటునంతవఱకు గోపాలునితో మాటలాడుచు, ఆటలాడుచు, పోవును. ఇట్లు కొన్ని దినములు గడచెను. బాలునికిప్పుడు మిక్కిలిసుఖముగా కాలము గడచుచుండెను. అంతట నొకనాడు ఉపాధ్యాయుని తల్లియొక్క శ్రాద్ధకర్మము జరుపవలసిన దినము వచ్చెను, విద్యార్థులందఱును ఆ నాడు ఏవేవో కట్నములు, కానికలు తేవలసియుండెను. తేగలిగిన బాలురెల్లరును పెక్కు తెఱగు కానికలను కొల్లకొల్లగా తెచ్చిరి. గోపాలుని తల్లి లేమిచే వేమియు పంపజాలకపోయెను. ఆ నాడు గోపాలుడు విన్ననైన మొగముతో బడికిపోవుటచూచి మధుసూదనుడు అందుకు కారణమడిగి తెలిసికొని, ఓదార్చి, యొకచిన్న పాలపిడత నిచ్చి దీనిని మీా ఉపాధ్యాయుని కిమ్మనెను. ఆ పిడతను చూచి ఉపాధ్యాయుడు కోపోద్దీపితుడై అంత కొద్దిపాటికానిక తెచ్చి

నందు కతనిని తీవ్రముగా చీవాట్లుపెట్టెను. కాని ఆ పిడతను కుమ్మరింపగనే అది మరల నిండుచుండుటచూచి అందఱును అచ్చెరువుచెందిరి. అంత ఉపాధ్యాయుడు విషయ మంతయు సవిస్తరముగా విని, అతనితో అడవికేగి "మీ మధుసూదన్ దాదాను పిలువుము. నేనుకూడ చూచెదను" అని గోపాలునితో చెప్పెను. గోపాలు డట్లు పిలువగనే ఆకసమునుండి యొకశబ్ద మిట్లు వినిపించెను "నీ వకలంకవిశ్వాసముగల వాడవు గనుక నీవు నన్ను చూడగలుగుచున్నావు. మీ యుపాధ్యాయునిబుద్ధి ఇంకను పరిశుద్ధినొందలేదు. అందుచే అతను నన్ను చూడ నర్హుడుకాడు".

* * *

194 అకృత్రిమవిశ్వాసముతో, హృదయపూర్వకముగా, భగవంతుని ఆవాహనచేసి. ఆయనయొద్ద మఱేమియు కోరక యుండువాని,కాయనదర్శనము లభించును. ఆ దర్శనము లభించినపిదప అతని కే కొఱతయు ఉండదు. ఇహపరసుఖములకై భగవంతు నాహ్వానించి, లౌకికవస్తువుల నిమ్మని యర్థించువారి, కాయన సంకల్పించెనేని, అవి లభించును. కాని, ఆయన దర్శనము సిద్ధింపదు.

* * *

195. బ్రహ్మచారులు, సన్న్యాసులు, ఆదర్శము నుండి పతన మొందుటకు "కామినీకాంచనములే" కారణము. కామకాంచనవ్యామోహము మహాయోగీంద్రులయొక్కయు జ్ఞానిసత్తములయొక్కయు పతనముకలిగింపగల అత్యద్భుత ప్రభావమహితము. చెట్టుయొక్క లేత మొక్కను కాపాడు

టకై దానిచుట్టును కంచెవేసినట్లు, సన్న్యాసులయొక్కయు, బ్రహ్మచారులయొక్కయు సంరక్షణకొఱకు శాస్త్రములలో అనేకగాఢనియమములు విధింపబడియున్నవి. "కాము డున్న చోట రాము డుండడు" అని తులసీదాసు చెప్పియున్నాడు. స్త్రీసంభోగపరుడగు యోగి వంచకుడు, మిథ్యాచారుఁడు అని కబీరు పలికెను. శ్రీరామకృష్ణుడు తన బాలశిష్యులకు స్త్రీలతోడి సాహచర్యమును—వారు భక్తురాం డ్రైనను— నిషేధించెను. ఆయన ఇట్లు చెప్పువాడు "భగవన్నామము వినుటతోడనే కన్నీరు వెల్లువలుగా కార్చు భక్తురాలితో నైనను సహచరింపవలదు. ఆమె మనస్సు పరిశుద్ధమైనదిగా ఉండవచ్చును. కాని నీ మనసులో దుష్టభావము లంకురింప వచ్చును" వృద్ధికివచ్చువారుగా కనిపించిన బాలురే— ఉన్నతపారమార్థికదశలను పొందినపిమ్మటకూడ—కొందఱు అనంతరజీవితమున శ్రీ గురుదేవుని హితోపదేశము నతిక్ర మించి పతనమొందిరి.

* * *

196. శ్రీ మాతృదేవి కీ విషయమున గల భావము లింకను కఠినములు, నిష్ఠురములు. దీక్షొదానమొందిన యొక వితంతుయువతి కామె యిట్లు చెప్పెను "కుమారీ, పురుషుల నెన్నడును నమ్మరాదు. ఇతరులవిషయ మటుంచు, మీ తండ్రి నైనను, సోదరునైనను నమ్మవలదు. పురుషరూపముదాల్చి భగవంతుడువచ్చినను అతనినికూడ నమ్మవలదు!" దీని భావ మేమనగా, దేహాత్మబుద్ధి నిలిచియున్నంతవఱకు కామాతుర తయు నిలిచియుండును; కావున పతనావకాశము కలదు.

మనస్సు అపరిపక్వస్థితియందున్నంతకాలము వ్యామోహా వేశమునకు లోబడుట సాధ్యమే. కావున దానికి దూరముగా నుండుటకై పరిపూర్ణయత్నము చేయవలెను తప్పినచో అపాయము అనివార్యము.

* * *

197. సాధకునికి కామోద్రేకముతో పోల్పదగినంత భయంకరమును, దుర్జయమును, అగు శత్రు వింకేదియు లేదు యావజ్జీవావిరామపరిశ్రమమువలనతప్ప దానిచేత చిక్కక తప్పించుకొనుట అసాధ్యము. అది ఈ రావణ వాక్యమునంటిది "ఈ రాము డెట్టి శత్రువు! ఎన్నిసార్లు చంపినను అతడు చావడు!" ఎన్నో నూర్ల సంవత్సరములు గాఢతరతపశ్చర్య ననుష్ఠించిన పిదప కామినీవ్యామోహ వశులై బ్రహ్మచర్యమునుండి భ్రంశ మొందిన యోగిసత్తముల యొక్కయు మహర్షులయొక్కయు వృత్తాంతము లనేకములు మనపురాణములందు కలవు. సన్న్యాసులు, బ్రహ్మచారులు, స్త్రీలతో అన్యోన్యభావము కలిగియుండరాదనియు, వారి ముఖములైన చూడరాదనియు, వారితో ధారాళముగా ప్రసంగింపరాదనియు, రహస్యముగా వారితో పరియాచకము లాడరాదనియు, శాస్త్రములు నిర్దేశించుచున్నవి. స్త్రీల చిత్రపటములైన చూడరాదనియు, నియమముకలదు. అట్లు చూచినచో అపరిపక్వ బుద్ధులందు దుష్టభావము లంకురించి, దుర్జ్ఞేయవిధమున మనోగమనమున దుష్ప్రవృత్తిని కలిగింప వచ్చును. కాని ఈ కఠిననియమములు సామాన్యమానవులకు

వర్తింపవు, సర్వసంగపరిత్యాగులై, యోగాభ్యాసముచేతను, కఠిన తపశ్చర్యచేతను ఈ జన్మమందే భగవదనుభూతినొంద జూచువారికి మాత్రమే వర్తించును. వారు వేఱువర్గమునకు చెందినవారు.

* * *

198. ఈ కారణమువలన ఆస్తికధర్మసాధకులగు స్త్రీపురుషులు ఒండొరులతో కలసిమెలసి మెలగక, అట్లు మెలగుటను విషతుల్యముగా వర్జింపవలెను. ఈ నియమము ననుసరింపని మత సంప్రదాయములు, మత వ్యవస్థలు అన్నియు—ప్రాచీనములు, ఇదానీంతనములు—కలుషితములై హీనదశకు కూలినవి. ఇందులకు నిదర్శనములు హిందూదేశమున బౌద్ధ, తాంత్రిక, వైష్ణవసంప్రదాయములందును, పాశ్చాత్యఖండమున మధ్యయుగరోమన్ క్యాథొలిక్ సంప్రదాయములందును, కలవు. బుద్ధుని జీవితకాలమున భిక్షుణీమఠము స్థాపింపబడినప్పు డాయన "బౌద్ధమత వినాశనబీజ మిప్పుడు నాటబడినది" అని పలికెను. దివ్యప్రేమబోధక మహాగురువగు శ్రీచైతన్యుడు—అనంత దయారాశి యయ్యును—తన కత్యంతప్రియుడగు సన్న్యాస శిష్యుడు చినహరిదాసును, తన మహోన్నత భక్తురాండ్రలో నొకరిచేత భిక్షముకైకొనిన మాత్రముననే, విడనాడెను. మానవశిక్షణార్థ మిది ఎట్టి నిష్ఠురపాఠము!

* * *

199. మనస్సునుండి కామోన్మాదమును తఱిమివేయుట కొకేమార్గము కలదు—పురుషులు స్త్రీలనంద

ఱను తమ తల్లులుగాను, స్త్రీలు పురుషుల నందఱను తమ బిడ్డలుగాను భావించుకోవలెను. ఈ మనోవైఖరిని కల్పించుకొన్న గాని పతనావకాశము మిక్కుటముగా కలదు. మదనోన్మాదమును నిగ్రహించి, నిష్ఠురబ్రహ్మచర్య మనుష్ఠించిన గాని మనోనిశ్చలత్వము కుదురదు. సమగ్రధ్యానము, ఏకాగ్రత ప్రాప్తింపదు, లేక, "రాగానుగాభక్తి"—ఈశ్వరునందు పరమభక్తి—ఇది 'వైధిభక్తి'కి వ్యతిరేకమైనది—సిద్ధింపదు.

* * *

240. అపరిపక్వబుద్ధి అత్యంతవంచనాశీలము. ఏమఱుపాటునొందియున్న ఏ క్షణమున, ఏ విధమున, అది సాధకుని—వాని యెఱుక లేకయే—అమార్గమునకు లాగుకొనిపోయి, మాయాజాలబద్ధ మొనరించునో, కనుగొనుట మిక్కిలి కష్టము. శరీరము యొక్కయు, ఇంద్రియముల యొక్కయు సుఖముల నన్వేషించుచుండుట, కళత్రపుత్త్ర కుటుంబములు స్వకీయములను భావము కల్పించి మాయామోహమున గూల్చుట, సంపద, సంతతి, యశస్సు, పదవి, అధికార ప్రాబల్యము—ఇవియే జీవితమున పరమప్రాప్యములుగా భావింపజేయుట అపరిపక్వబుద్ధి లక్షణములు. సుఖాన్వేషణమున మాటిమాటికి బాధలొందుచున్నను, దెబ్బలు తినుచున్నను, దానికి బుద్ధిరాదు. అపరిపక్వ బుద్ధిగలవాడు, తన చుట్టును సర్వదిశలనుండుజనులు మరణించుచుండుట ప్రతిదినము చూచుచునే, ఏ క్షణముననో తానుకూడ — సర్వము విడనాడి — వెడలిపోవలసియుండునని తెలిసికొన

నేరడు. అతడు తన యభిమతములను బుద్ధికుశలతచేత— ఏదో యొకవిధమున — సాధించుకొనగోరును. తన చర్యల వలన ఇతరులకు కష్టనష్టములు కలుగునేమో అను సంకోచ మతనికి కలుగనే కలుగదు. అతనికి కావలసినది స్వసుఖ మొక్కటియే. అతని యక్కఱ లన్నియు ఈ లోకమునందే కేంద్రీకృతములై యుండును.

* * *

201. అపరిణతబుద్ధి గనినుండి యెత్తబడిన ముతక లోహమువంటిది. ఇంకను కరగింపబడకుండుటచే దానియందు "మష్టు", సర్వవిధ కల్మషములు ఉండును. ఈ ముతక పదార్థమును చక్కగా కడిగి, రసాయనశాస్త్రోక్త విధానమున కరగించినచో, అపరంజిగాను, ఇంకను ఎక్కువ విలువగల ఇతర లోహములుగాను మాఱి మానవుని కైన్నోరీతుల నుప యోగపడును. అట్లే అపరిణతబుద్ధియు—వివేక (సత్యా సత్యవివేచన) జలముతో కడిగి, త్యాగ, భగవద్భక్తి నామక వహ్నులయందు ఐహికపదార్థాకాంక్షను దగ్ధమొనర్చి, పర తత్త్వసిద్ధికై గురువు నిర్దేశించిన సాధనాభ్యాసముచే పరిశుద్ధ మొనర్చినచో — నిర్మల మగును. అప్పుడు అపరిణతబుద్ధి పరిణత మగును. సచ్చిదానందస్వరూపుడును, నిత్యశుద్ధుడును అగు పరమేశ్వరుడా నిర్మలపరిణతబుద్ధికి అభివ్యక్తుడగును.

* * *

202. మనస్సు ఫలమువంటిది. అపక్వఫలము పుల్లగా, వగరుగా, చప్పగా నుండి తిన్నవారికి సర్వవిధ వ్యాధులు కలిగించును. కాని పరిపక్వమైన పిదప అది ఎంత మధురము,

ఎంతఆరోగ్యకరము! అప్పు డది దేవునికి నైవేద్యముగాకూడ నర్పింపదగును. మనస్సువిషయముకూడ అట్టిదే.

* * *

303. అపరిపక్వబుద్ధి సాత్త్వికముగనో, రాజసికముగనో, తామసికముగనో ఉండును. సాత్త్వికబుద్ధిగలవారు స్వధేవ ఆస్తికధర్మజీవన మవలంబింతురు. ఈశ్వరానుభూతి నొందవలెనని, ధర్మమార్గము ననుసరింపవలెనని, పరోపకారము చేయవలెనని వారికి తీవ్రాభిలాష యుండును. ఈ గుణము లార్జించుకొనుటకు వారు ప్రయత్నింతురు. కాని వివిధకారణములచేత—మర్దశ, దైహికాశక్తత, దుర్బలులమని, అనర్హులమని భావించుకొనుటవలని నిరుత్సాహము · ఇట్టివానిచేత—వారు ఎక్కువగా పురోగమింపరు, సులభముగా ధైర్యమును కోల్పోవుదురు. రాజసికబుద్ధిగలవారు ప్రపంచమునందును, ప్రాపంచికవ్యవహారములందును వ్యగ్రులై ఆస్తికధర్మవిషయములం దంతగా ప్రవేశింపరు, లేక, ఆస్తికధర్మజీవనము నడుపుచున్నట్లు నటింతురు, లేక, ఇహాపరములు రెంటియందును సాధ్యమగునంత లాభము నొంద యత్నింతురు. తామసికులు ప్రాయికముగా దుర్వృత్తులు, ఇతరులకు హానిని, నాశమును కలిగించు టెట్లా అనియే వారి యాలోచన, వారి ప్రయత్నము. వారు కామాంధులు, లోభులు, పాపిష్ఠులు,

* * *

204. తమ దేశమునకుగాని, లోకమునకుగాని ఉపకార మొనర్చు నుద్దేశముతో కృషిసల్పువారును, అట్టి

కోరికతోనే వ్యవస్థానిర్మాణములు చేయువారును—అపరి పక్వబుద్ధి కలిగియున్నచో — మహోన్నతాదర్శములు కలిగియు, చివరకు లోకమున నుపకారమునకన్న అపకార మునే ఎక్కువగ చేయుదురు. జీవితమున వారికి తగులు ఘాత ప్రతిఘాతముల నడుమ వారు తమ ఉన్నతాదర్శములను విశేషకాలము పరిపాలించుకొనజాలక, పూర్ణ ప్రయత్నములు చేసియు చివరకు లొంగిపోవుదురు. పేరు ప్రతిష్ఠలు, పదవి, అధికారము. వీని నార్జించుకొనవలెనను వాంఛితము ప్రబల మగును, అసూయ, ద్వేషము, సంకుచితత్వము, స్వార్థపరత వారిని లోబఱచుకొనును. అందుచే వారి కృషియంతయు నిరర్థకమగును. ఇంతేకాదు. తమలోని విషమును సమాజము లోని కెక్కించి, సదుద్దేశబుద్ధు లనేకులను చెఱచి, పరోప కారకార్యములందును, ఆస్తికధర్మసంప్రదాయములందును, సంస్థలందును — చివరకు మతమునందుకూడ — ప్రజా బుద్ధిలో సంశయమును, అవిశ్వాసమును కలిగింతురు.

* * *

205. ఆదిలో బ్రహ్మ మొక్కటే—అద్వితీయమై— స్వతేజోవైభవమగ్నమైన సత్స్వరూప మొక్కటే — యుండెను. ఆయన ఒంటరిగా నుండెను, ఇంకేమియు లేకుం డెను. అంతయు బాగుగనే ఉండెను. అజాగ్రత్తగానున్న యొక తరుణమున ఆయన "అనేకమయ్యెదను" అని కోరు కొనెను. వెంటనే లక్షలాది లోకములతోకూడిన ఈ సృష్టి యంతయు ఉత్పత్తియయ్యెను! ఇది యొనర్చుట కాయన కూడ తపోధ్యానములు చేయవలసివచ్చెను. సర్వచరాచర

చేతనాచేతన వస్తువులతో కూడిన ఈ జగత్తును సృజించి ఆయన వాని యన్నిటిలో ప్రవేశించి మానవునికి మాత్రము కార్యకారణవిచారశక్తి నిచ్చెను ఇందువలన ఆయనదశ "పంచేంద్రియజాలములో చిక్కి బ్రహ్మయు విలపించును" అను లోకోక్తి ప్రకార మేర్పడెను. ఇప్పుడు బుద్ధిమంతులనబడు ఈ "అనేకులు" తమతప్పులు, పొరపాట్లు, తెలివితక్కువలు, దోషములు, అసమర్థతలు, కోఱగాములు మున్నగువాని నన్నిటిని ఆయనపై ద్రోసి, అందు తమబాధ్యత ఏమియు లేదని తలతురు! తమ పొరపాట్లవలనగాని, ప్రయత్నలోపము వలనగాని, ఏ కార్యమైన సిద్ధింపక పోయినచో, "అది యాయనఇచ్ఛ కాదు!" అందురు. తమ కెంతో ప్రీతికరముగా నున్న కార్యమును నిర్వహింపజాలనిచో "ఆయనయిచ్ఛాను సార మది యట్లుజరిగెను!" అని తప్పించుకొందురు, ఈశ్వరేచ్ఛ యేదైనది, ఏదికానిది—వారికి సర్వము తెలిసియున్నట్లు! అది నిజమేయైనచో వారు సామాన్యజనులలో చేరినవారు కారు, సర్వజ్ఞుడగు ఈశ్వరునిసంకల్పగతినికూడ వా రెఱుగుదురు! ఆధికారికపదవికలిగినట్లు వా రిట్లుకూడ పల్కుదురు· "ప్రతిమనుష్యుడు వివాహమాడి ప్రాపంచికజీవనము నడుపవలె నని ఈశ్వరసంకల్పము. అందఱును సన్న్యసించి పారమార్థికజీవనము నభ్యసించినచో, సృష్టి ఎట్లు జరుగగలదు?" ఈ ఘోరవిపత్తు — ప్రపంచవిలయము — కలుగుననుభీతిచే వారు నిద్రాశూన్యరాత్రులు గడుపుచున్నట్లు! ప్రపంచములోని జనులెల్లరు సన్న్యాసదీక్షగొన తహతహ పడుచున్నట్లు!

206. సామాన్యముగామాటలాడునప్పుడు మనము "అది-ఈశ్వరేచ్ఛ" అని పలుమారు పలుకుదుము. లేక, ఆయనను తోడ్పడు మందుము, ఆయనను సాక్షిగా నుండు మందుము, లేక ఈశ్వరుని పేరిట, ధర్మము పేరిట ప్రమాణము చేయుదుము. ఇవి వట్టి బొల్లుమాటలు — ఉబుసుపోని మాటలు, అర్థరహితములు. పసిబిడ్డలాడు "నాగౌరవము తోడు" వంటివి, లేక ఆంగ్లేయులాడు "బై జోవ్!"* "థాంక్ గాడ్!" "మైగాడ్!" "గాడ్ అలోన్ నోస్!" వంటిమాటలు. ఈశ్వరసంకల్పమున పూర్తిగా శరణుచొచ్చినవారు "నేను యంత్రమును, ఆయన యంత్రచోదకుడు" అను సత్యము ననుభవపూర్వకముగా గ్రహించినవారు, శుభాశుభము లొకటిగనే చూచువారు, రాగద్వేషరహితులు, లాభనష్టము లందు, నిందాస్తుతులందు, సుఖదుఃఖములందు ఒకే రీతిగా ప్రసన్నబుద్ధులైయుండువారు ఇట్టివారే ఈశ్వరసంకల్పమును నిజముగా నెఱుగుదురు. వారే ఇట్లు పలుకుటకు అర్హులు

* * *

207. పూర్ణమగు బ్రహ్మము సర్వదా పూర్ణమేయని వేదములు చెప్పుచున్నవి, అది ఎక్కువ కాదు, తక్కువ కాదు, పెరుగదు, తఱుగదు. పూర్ణమునుండి పూర్ణమును తీసివైచి నప్పటికిని పూర్ణమే మిగిలియుండును పూర్ణమును పూర్ణమునకు కలిపినను, ఆ మొత్తముకూడ పూర్ణముగనే ఉండును! పూర్ణమగు బ్రహ్మము — అనంతపరమాత్మ — నుగూర్చి

* రోముదేశీయుల దేవుడ్లలో నొకడు.

మాత్రమే ఇట్లు చెప్పనగును. పరిపూర్ణమునకు బదులుగా మాత్రమే పరిపూర్ణము వచ్చును. పరిపూర్ణస్వరూపుడగు పరమాత్మని — అఖండుని — సాక్షాత్కరించుకొనవలె నన్నచో, మనశ్శరీరహృదయాత్మలయొక్క పరిపూర్ణ శక్తితో ఆ కార్యమున సంసక్తుడై ఆయనలో లీనమగుటకు ప్రయత్నింపవలెను. అట్లు చేసిన గాని ఇష్టసిద్ధి ప్రాప్తింపదు

* * *

208 కాని అందఱిశక్తిసామర్థ్యములు సమానమై యుండవు. దేహపుష్టి, బలము, బుద్ధికుశలత గల యువకు నికి—ప్రపంచముతోడి సర్వబంధములు విడనాడి, మనో నిగ్రహార్థమును, మనోవికారనిర్మూలనార్థమును, అహోరాత్ర ములు, ఏకాంతమున యోగసాధన లొనర్చుచు, మాధుకర వృత్తిచే లభించిన ఏకభుక్తముతోనో, యదృచ్ఛాలబ్ధఫల మూలములతోనో జీవించుచుండువానికి — ఈశ్వరాను భూతియు, సమాధియు సుసాధ్యమైయుండవచ్చును. కాని కొందఱు భగవదనుభూతికై తీవ్రవాంఛ కలిగియు, ఎల్లప్పు డును మిక్కిలిప్రతికూలస్థితులందే యుండువారు — అశక్తు లగు వృద్ధ మాతరపితలను సేవించుటందును, ఆలుబిడ్డలను పోషించుటకు ఎముకలువిరుగునట్లు కష్టించుటందును, ఎల్లప్పు డును వ్యాపృతులై యుండువారు—కలరు. కొందఱు భక్తులు అసాధ్యవ్యాధిపీడితులై మంచముపట్టి యుందురు. మనశ్శరీ రములు మిక్కిలి బడలి, నిస్సత్తువవలన పారమార్థికసాధనలు సక్రమముగానొనర్చుట అసాధ్యముగానుండును. అట్టివారికి మోక్షములభించు ఆశయే లేదా? వారు కలకాలము కార్య

కారణ ఘోరసముద్రమున—తుపానులో చిక్కిన చిన్నదోనె వలె——ఇటు నటు ఊపబడుచు, దెబ్బలుతినుచు ఉండవలసిన దేనా? వారికి విముక్తికలుగు ఆశయే లేదా? నిర్దయమగు కార్యకారణచక్రముల క్రిందపడి వారు పురుగులవలె. పురాకృతకర్మఫలముగా చితికిపోవలసిన దేనా? కానే కాదు. దయామూర్తియగు ఈశ్వరుని రాజ్యములో ఇట్లెన్నడును జరుగదు. వారి హృదయవిదారకవిలాపము లాయనకు వినవచ్చియే తీఱును. వారి హృదయమునందు దుఃఖోపశాంతి కరమగు ఆశాసందేశము మెల్లని స్వరముతో—కాని, విస్పష్టముగా—వినవచ్చియేతీఱును. వారిమోక్షేచ్ఛ అగాధము, బలిష్ఠము అయియుండి, వారు తమ అసమర్థతను పూర్తిగా ఎఱిగి, హృదయవేదనతో ఈశ్వరశరణ మర్థించిరేని, గృహస్థజీవనము నిస్సంగతతో, కర్తవ్యనిర్వాహణార్థమే నిర్వహించుచు, తమ బంధుకుటుంబాది సర్వము ఈశ్వరునివే అని భావించి, కర్మమువలనగాని, మానవులందలి మోహములవలనగాని బద్ధులుగాక, భగవంతు డొక్కనినేతప్ప ఇతరుల నెవ్వరిని హృదయపూర్వకముగా ప్రేమింపకుండినచో, స్థితిగతులు, వాతావరణము ఎంతప్రతికూలమైయున్నను దయాస్వరూపుడును, భక్తజనకర్మశృంఖలామోచకుడును అగు ఈశ్వరుని నిరవధికానుగ్రహఫలముగా, వారును ఇహజీవనమున చిత్తశాంతి నంది, పరమున పరమస్థితి నందుదురు.

* * *

209. సర్వము మానసప్రవృత్తియే. మనస్సుమీదనే ప్రతివిషయము ఆధారపడి యుండును. మనస్సే మనుష్యుని

బంధమోక్షములకు కారణము. మనోగతినిబట్టియే మనస్సు యొక్క కార్యప్రవృత్తి. పూర్వోక్త యోగి కాలక్రమమున —స్మృతిపథమున కందక, మనోగర్భాంతరాళసీమయందు దాగియుండు మనోరథములచేత—ఐహికసుఖములచేతను, పేరుప్రతిష్ఠలచేతను, ఆకర్షింపబడెనేని, అతని తపస్సాధన లెంత గాఢములైనను, స్థితిగతు లన్నియు ఎంత అనుకూలమై యున్నను, అతడు అభ్యసించిన సాధనలు, పడ్డ కష్టములు బూడిదలో చేసిన హోమమువలె నిరర్థకములై పోవును. కాని మానవుడు తాపత్రయ (ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాప)పీడితుడై, జగన్మిథ్యాత్వమును పూర్తిగా గ్రహించి, తత్ఫలముగా కామక్రోధాదులకు, సర్వసంగములకు, విముఖుడై, హృదయపూర్వకముగా భగవంతుని శరణ మర్థించెనేని, వానిని ఆయన సర్వక్లేశమూలమగు జనన మరణచక్రమునుండి విముక్తునొనర్చును.

* * *

210. సన్న్యాసివైనను, గృహస్థువైనను, నీవు నీ మార్గమునందు పరిపూర్ణసామర్థ్యముతో పరిశ్రమింపవలెను. నీ పారమార్థికపథమున కనుకూలమైయుండునట్లు నీ జీవితము నంతయు నిర్మించుకొనవలెను. మాయోపాయమూలమున సంసిద్ధి లభింపదు. మోసముచేయ నభ్యసించినవాడు తన్ను తానే మోసము చేసికొనును. సమష్టిదృష్టికి ఈశ్వరుడు సన్న్యాసులకన్న గృహస్థ భక్తులకే కొంత యెక్కువ అనుకూలుడుగా నుండునని చెప్పనగును. ఈశ్వర స్మరణ ప్రార్థనాదులకొఱకే సర్వము త్యజించినవారు సన్న్య

సులు. వారట్లెన్నడేని చేయకుండినచో, వారికపార పాపము కలుగును. కాని నిష్పాపరులగు గృహస్థ భక్తులు లౌకికజీవితవిషమమార్గమున తమ దుస్సహాభారములను మోయుచునే ఏమాత్రము వెనుదీయక ఆయనను స్మరించి, ధ్యానించుచు, కృపాభిక్షుకులై ప్రార్థించుచుందురు. మఱియు వారు సన్న్యాసులను, ఈశ్వరభక్తులను, సన్మానగౌరవ పూర్వకముగా సేవించుచు, వారికి భిక్షములు పెట్టుచు, దీనులకు, ఆర్తులకు, ధర్మసంస్థలను; యాత్రికులకు విశ్రామ మందిరములను స్థాపించుచుందురు.

* * *

211. ఈ జీవితముననే ఈశ్వరసాక్షాత్కృతి నొందు భాగ్యము ప్రతివానికి లభించునదికాదు. ఆయనకై ఎన్నో జన్మములనుండి గాఢ తపస్సాధన లభ్యసించి, కర్మశేష మొకింతయే అనుభవింపవలసియుండువారు, పూర్వజన్మార్జిత పుణ్యాకారణమున ఉత్తమమనోగతులు, ఉత్తమమనఃప్రేరణ ములు కలిగి పుట్టుదురు. కావున పారమార్థికోద్యమమున కీ జన్మమున అనుకూల్యము కలిగినవెంటనే, వారు ఆ మిగిలి యున్న స్వల్పభాగమును సులభముగాముగించి, జననమరణా తీతమగు పరమదశలో లీనమొందుదురు.

* * *

212. ఫలములను కలిగింపనికర్మ మేదియు లేదు, వ్యర్థమగుకర్మముగాని, నష్టమగుకర్మముగాని లేదు. ఎప్పుడో ఒకప్పుడు, సత్ఫలమునో, దుష్ఫలమునో, ప్రతికర్మ మిచ్చియే తీఱును. కావున, సత్కర్మములు, సర్వవిధప్రయత్నపూర్వక

ముగ నిర్వహింపవలెను. అట్టికార్యమే మూలధనముగా మాఱి, దుష్కర్మజనిత ఋణమును సంచితపాపరాశిని, తీర్చుట కుపకరించును.

* * *

213. సత్కర్మములఫలము అక్షయమైనది. కూడ బెట్టుకొనుకొలది అది ఇహపరములలో — ఆపదలందును, బాధలందును, నష్టములందును, ప్రయత్నములందును, విషమ పరీక్షావేళలందును, మనోంధకారమందును, భయమందును, నైరాశ్యతరుణములందును — అక్కఱకు వచ్చుచుండును. ఇతరస్వామ్యము లన్నియు అనిత్యములు; వాని యార్జన రక్షణములు బాధాకరములు, క్షైణ్యానష్టములును బాధాకరములే. వానిని మరణవేళ మనతో తీసికొనిపోజాలము. అంతేకాదు. ఆ ప్రియవస్తువులయెడగల కోరికలు—తీఱకో, అణచిపెట్టబడియో నిలిచి యుండునవి—సంస్కారరూపము నొంది మఱుజన్మమున మనలను బలాత్కారముగా నూత్న కర్మములందును, తత్ఫలములందును, చిక్కించి, మనబంధ ముల నింకను అధికపఱచి, అనంతవ్యథాకారణము లగును.

* * *

214. ప్రపంచకారాగారములో బంధించియుంపబడిన ప్రత్యగాత్మ—శ్రీరామకృష్ణుడు చెప్పుచుండినట్లు—పచ్చి వక్క లేక పచ్చికొబ్బరకాయ వంటిది — దాని విత్తు పెంకుకు అతి గాఢముగా అంటుకొని, అది దానిలోనిభాగమే యైనట్టును, వేఱుచేయ నసాధ్యమైనట్టును, తోచును. కాని అది పండి యెండిపోయినప్పుడు, సులభముగా వేఱగును.

అట్లే, దేహాత్మబుద్ధి నిలిచియున్నంతకాలము, శరీరకష్టసుఖములు తనకష్టసుఖములే అను భావ మున్నంతకాలము, మనుష్యుడు మాయాబద్ధుడై, తాపత్రయపీడచే నిరంతరవ్యథ లనుభవించుచుండును. ఈశ్వరకృపచే, ఆత్మ దేహేంద్రియాంతరావయవములకు భిన్నమైనదను సత్యమెఱుకకు వచ్చినప్పుడుగాని జీవుడు విముక్తి నొందడు. జ్ఞానయోగమునో, భక్తియోగమునో, కర్మయోగమునో అభ్యసించినగాని, అఖండసత్యమగు ఆత్మ నిత్యశుద్ధము, నిత్యబుద్ధము, నిత్యముక్తము అను యనుభూతి లభింపదు.

* * *

215. కర్మయోగమూలమున చిత్తశుద్ధిని, ఆత్మజ్ఞానమును పొందవచ్చును. మన మందఱము కర్మమొనర్తుముగాని కర్మయోగము నొనర్పము. అందువలననే మనము కర్మబద్ధులమై క్లేశము నొందుదుము. గీతలో కర్మయోగమును గూర్చి శ్రీకృష్ణభగవాను డిట్లు చెప్పియున్నాడు: "కర్మమొనర్చుటకుమాత్రమే నీ కధికారము కలదు. కర్మఫలములకు లేదు". మరల నిట్లు చెప్పియున్నాడు: "ఫలములుగోరి కర్మము లాచరించువారు హీనులు." అనగా, స్వప్రయోజనసాధనార్థము కర్మాసక్తులగువారు స్వల్పబుద్ధులు, హీనశ్రేణికి చెందినవారు. కర్మమొనర్పుము, కాని ఏ కర్మమొనర్చినను స్వార్థపరత్వము లేక, సంగరహితుడవై యొనర్పుము, కర్మాచరణార్థమే, నిష్ఫలాపేక్షతో, కర్మమొనర్పుము. అట్లొనర్చితివేని, నీవు సర్వబంధవిముక్తుడ వగుదువు, నీ కర్తవ్యమునంతయు నిర్వహించినవాడ వగుదువు; సుఖదుఃఖాతీతమగు

పరమానందానుభూతిగాంచి జీవితపరమార్థమును సాధించిన వాడ వగుదువు.

* * *

216. ఫలాపేక్ష లేకున్న చో కర్మమాచరింపవలెనను మనఃప్రేరణముగాని, బుద్ధిగాని ఎట్లుండును అనెడు గాఢ సంశయ మనేకుల కుండును. మన కెట్టి యుపకారము కలుగనిచో, మనము బుద్ధినంతయు, శక్తినంతయు వినియోగించి కర్మమునందేల వ్యగ్రులమగుదుము? అట్టి కర్మము నేల ఆచరింతుము? ఇట్లు తలచుట మిక్కిలి పొరపాటు. మనుష్యుడు సుఖముకొఱకు పాటుపడు ననుట నిజమే, కాని ఆ విధమున మన మెంత సుఖమును, ఎట్టి సుఖమును పొందగలుగుదుము? అందు తొమ్మిదివంతులు బాధ, ఒకవంతో, ఇంకను తక్కువో సుఖము. ఆ కొంచెముకూడ వెంటనే గడచిపోవునది, దుఃఖమిశ్రితమైనది. మఱియు స్వప్రయోజన మేదేని సాధించుకొనుటకు, న్యాయముగా ఇతరులకు రావలసినదాని కడ్డుపడి, వారికి మనోవేదన, బాధ—హాని కూడ—కలిగింపవలసియుండును. ఇక, ఈ లోకమున శాశ్వతసుఖమును అస్వార్థపరులు, నిస్సంగులు—అనగా, కర్తృత్వభావరహితులు — మాత్రమే సాధింతురు. శ్రీకృష్ణుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు, శ్రీచైతన్యుడు, శ్రీరామకృష్ణుడు, వివేకానందస్వామి వంటి అతంద్రితకర్మతులు—నిజముగా అస్వార్థపరులగువారు—ఇతిహాస మంతటిలో ఎందఱుకలరు? అత్యల్పసంఖ్యాకులు! వారే ఆదర్శ మహాపురుషులు. అట్టివారే అనాదికాలమునుండియు గణనాతీత

స్త్రీపురుషులకు సంసారజీవనదుస్సహాభారమును మోయుశక్తి నిచ్చి, పాపపంక నిమగ్నులు అవిద్యాంధకార సంఛన్నులు, తాపత్రయపీడితులు అయియున్న లక్షలాది జనుల హృదయములందు ఆశా శాంతుల నుద్భవిల్లజేసినవారు. వారి బోధలచేతను, ఆదర్శములచేతను ప్రేరితులై, కోట్లాదిజనులు జీవితమును తుచ్ఛముగా నెంచి, జగద్ధితార్థము దానిని నిస్సంకోచముగా త్యజించి, దానికి బదులు అమృతజీవనము నందిరి.

* * *

217. నిర్లిప్తత, ఐహికవస్తువులందనసక్తత, సర్వజనులందు ప్రేమ ఇవియే అన్ని మతములకు మూలభావములు. ఈ సుగుణములు గలవాడు దేహేంద్రియాధీనుడుకాడు. అట్టివానికి పేరుప్రతిష్ఠ లొందు కోరికగాని, అధికారతృష్ణగాని, మమతాహంకారములుగాని, స్వబంధువులు, ఇతరులు అను భేదముగాని ఉండవు అతడు సర్వజీవములను—ధనికులను, నిఱుపేదలను, బ్రాహ్మణుని, "హరిజనుని"; సాధువులను, దుష్టులను, మిత్రులను, శత్రులను, జంతువులను. పక్షులను, కీటకములను—సమదృష్టితో చూచును. స్తుతిగర్హణములు, లాభనష్టములు, జయాపజయములు, సుఖదుఃఖములు: వీనిచే నతడు పొంగిపోక, క్రుంగిపోక నిశ్చలుడై యుండును. కర్మ మొనర్చునప్పుడుకూడ అతడు కర్మమొనర్పనివాడే, కర్మ మొనర్పనప్పుడుకూడ అతడు కర్మమొనర్చువాడే. యథార్థముగా అతడే ఆదర్శకర్మయోగి.

* * *

218. శరీరమున ప్రవర్తించు ప్రాణవాయువును కట్టడలో పెట్టుటే ప్రాణాయామము యొక్క ఉద్దేశము. అది ఉచ్ఛ్వాసనిశ్వాసరూపమున మనయందు వ్యక్తమగు చుండును. దాని సంచారము క్రమబద్ధ మొనర్పజాలితిమేని, మనస్సుయొక్క నైసర్గిక చాంచల్యము అణగిపోయి అది శాంతినందును. మనస్సు అనేకవస్తువులమీదికి పోవుచు చెదరియుండుటచే దానిశక్తులు వ్యర్థమగుచుండును. చెదరి పోవుచుండు ఈ శక్తులనెల్ల ఏదోయొకవస్తువుమీదనే కేంద్రీ కరింప గలిగితిమేని మనస్సు నిరవధికశక్తి నార్జించుకొనును. అట్టి మనసు సాధింపజాలని దీ జగత్తులో నేదియు లేదని యోగశాస్త్రములు చెప్పుచున్నవి. పారమార్థికసీమలో ఆ కేంద్రీకృతశక్తిని ధ్యానమార్గమున పరమాత్మతత్త్వముపైకి త్రిప్పినచో, జీవుడు నిర్వికల్పసమాధి నంది పరబ్రహ్మముతో ఐక్యమగును. లేక, హృదయకమలాసీన (సరూప) దైవ ధ్యానమున మనస్సు నిమగ్నమైనచో, సాధకునికి ఇష్ట మూర్తి—భగవంతుని—సాక్షాత్కారభాగ్యము లభించును. లేక, కేంద్రీకృతశక్తి ప్రాకృతిక ప్రకృత్యతీత విషయముల పైకి త్రిప్పబడినచో, వానిని గూర్చిన వివిధ సూక్ష్మాద్భుత సత్యములు ఎఱుకకువచ్చును, అమానుషములగు అష్టసిద్ధులు —రహస్యశక్తులు—లభించును.

* * *

219. అష్టసిద్ధు లివి· (1) అణిమ, అణువువలె అల్పి ష్ఠముగానుండగల శక్తి, (2) లఘిమ, కోరినతోడనే మిక్కిలి తేలికయగుశక్తి, (3) వ్యాప్తి, కోరినతోడనే సర్వవ్యాప్తి

నొందగల శక్తి, (4) ప్రాకామ్యము, నిర్నిరోధ సంకల్ప శక్తి, (5) మహిమ, కోరినతోడనే తన పరిమాణము నధిక పఱచుకొను శక్తి, (6) ఈశత్వము, ప్రభుత్వము, (7) వశిత్వము, కోరినతోడనే ఇతరులను వశపఱచుకొను శక్తి, (8) కామావశాయిత, కోరినతోడనే ఏ పనినైన చేయగలుగు, లేక ఇష్టవస్తువులను లభింపజేసికొను శక్తి.

* * *

220. ఈ అష్టసిద్ధులు అపారదుష్ప్రభావయుక్తములు. యోగనిష్ఠాపరమప్రాప్యములగు సవికల్పనిర్వికల్పసమాధులు సాధించుటకు ప్రబలాంతరాయములు. సాధకు డీ సిద్ధుల నార్జించుకొను దురభిలాషకు వశుడయ్యెనేని అతడు వాంఛా కారణమున నధోమార్గముపట్టి, యోగభ్రష్టు డగుటే గాక, ఈ సిద్ధుల నయోగ్యవస్తుప్రాప్తికై వినియోగించి నైతికపథ విదూరుడై, కాముకసుఖసంసక్తినంది, స్వార్థసాధనార్థము నిరపరాధులగు సాధుజనుల యెందఱి వినాశమునకో కారణ భూతు డగును. తత్ఫలముగా అతడు తనపతనమును తెచ్చు కొనుటేకాక, ఆ సిద్ధులనుకూడ కోల్పోవును.

* * *

221. యోగాభ్యాసమే యేకైకకార్యముగా బెట్టు కొనుట అతిదుష్కరము, సామాన్యమానవుల కది అను ష్ఠేయముకాదు. ముఖ్యముగా ఆధునిక కాలస్థితిగతులలో నిర్దిష్టనియమములను—అనగా, క్షీరఫలమూలాది కేవల సాత్త్వికాహారము, పరిమితవ్యాయామనిద్రలు, నిర్మల వాయుశోధిత వివిక్తస్థలము, వ్యాకులరహితజీవనము, ప్రతి

విషయమునందును క్రమబద్ధత—ఈ యన్నిటికన్న ముఖ్యముగా, నిష్ఠురబ్రహ్మచర్యము; యోగాభ్యాసమున పూర్ణనైపుణ్యము నార్జించిన గురువుతోడనో, అతని సాన్నిధ్యముననో నివాసము—నిర్దుష్టముగా పాటించుట ప్రాయికముగా అసాధ్యము. ఈ నియమములలో ఏది తప్పినను, విజయము దుస్సాధము. గురు నిర్దిష్టమార్గము ననుసరించుటలో పొరపాటుగాని, లోపముగాని కలిగినను; యోగశాస్త్రములు చదివి తన కర్థమైన విధముగా అభ్యసించినను, అసాధ్య నాడీవ్యాధియో, హృద్రోగమో కలుగు నవకాశము కలదు. ఉన్మాదము, బుద్ధిభ్రంశము ఏర్పడుటయు సాధ్యమే.

* * *

222. ఉచ్ఛ్వాసనిశ్వాసము లెప్పుడు, ఏల, విషమమగును—అనగా, అతివేగము, లేక అతిమందము అగును? కామక్రోధాదులు మనల నావేశించినపుడు, సుఖసాధనార్థము భోగ్యవస్తువుల వెంట పరుగిడి, దిగ్భ్రాంతుల మైనపుడు; కామితార్థప్రాపణమార్గమున కెవరేని అవరోధము కలిగించుటచే కోపోద్దీపితులమై ఆత్మనిగ్రహము కోల్పోయినపుడు; కామితార్థము ప్రాప్తింపనిచో నిరాశాగ్రస్తుల మైనపుడు; మోహోద్రేక కారణమున ఔచిత్యజ్ఞానహీనుల మైనపుడు; ఇతరుల మేలునుచూచి ఈర్ష్యాగ్రస్తులమైనపుడు, రానున్న అపాయమునకు వెఱచి, హృదయము క్రుంగిపోయినపుడు, ఏదో ఆపద వచ్చుననితలచి హృదయము సంక్షోభించునపుడు; లేమిచే, ఆసలు దక్కనపుడు; ఆలుబిడ్డల పోషణవిషయమునను, క్షేమవిషయమునను, వ్యాకుల మొందినపుడు; వ్యాధి

పీడితులమై చిత్తశాంతి కోల్పోయి మనోవేదననందునపుడు; ప్రియబంధుమరణ దుఃఖముచేత అంతటను అంధకారమున్నే కాంచునపుడు; ద్రవ్యమును, ఆస్తిని పోగొట్టుకొని పిచ్చిపట్టి నట్టుండునపుడు — అట్టివేళలలో మనస్సు—తన ఎఱుక లేకయే—భీకరాందోళనమంది, అందుతోపాటే శ్వాసము—త్వరితములగు సుత్తెదెబ్బలవలె—అతివేగమగుటో, నిలిచి పోవునోయేమో అనిపించునంత మందమగుటో తటస్థించును. ఈ భయంకర మానసాందోళనము ప్రాణమును (ప్రాణ శక్తిని) కూడ ఆందోళనపఱచి, రక్తప్రసారక్రమమును కూడ తప్పించును. వీనియన్నిటి మూలకారణమును పోగొ ట్టినగాని, అనగా, ఐహికవస్తువులయెడ అనాసక్తి, వైరా గ్యము చేకూర్చుకొనినగాని, భగవత్ప్రార్థన మెంత చేసి నను, ప్రాణాయామ మెంత అభ్యసించినను, పరమార్థచింత, జపధ్యానములు ఏకాగ్రబుద్ధితో నభ్యసించుట కేవల మసాధ్యమగును.

* * *

223. అనేకు లిట్లు తలతురు "శరీరము నెడ నా కంతగా సంగము లేదు, నా భార్యపై నాకంతగా మోహము లేదు, నాబిడ్డలపై అంతగా భ్రాంతిలేదు, ధనకాంక్షకూడ అంతగా లేదు. దేనికిని బద్ధుడను కాను. సంకల్పించితి నేని యీ యన్నిటిని విదిర్చివేయగలను" కాని, తమలోపలి నుండియు, వెలుపలినుండియు, ఘాతప్రతిఘాతములు తగిలి, తూలిపడిపోవునప్పుడు, భాగ్యచక్రము ప్రతికూలముగా తిరిగి, ఘోరపరీక్ష లెదుర్కొనవలసివచ్చి దిక్కుతోపక యున్న

ప్పుడు, వారు ఆ భ్రాంతినుండి మేల్కొని, అతిభయంకర మాయాశృంఖలలతో కాలుసేతులు బంధింపబడి కేవల దుఃస్థితియం దున్నామని గ్రహింతురు. పూర్వజన్మసంచితము లగు సత్సంస్కారములతో పుట్టినవారికి బంధములు దుస్సహములుగా నుండును. ఏదో యొక విధమున వానినుండి విముక్తి నొందవలెనని యావచ్ఛక్తితో మనఃపూర్వక ప్రయత్నములు చేయుదురు. వీరే ముముక్షువులు—అనగా జనన మరణ రూపసంసారమునుండి తప్పించుకొని ముక్తినంద గోరువారు.

*　　　*　　　*

224. జన్మజన్మాంతరములనుండి వెట్టిచాకిరిచేయువారి వలె పరాధీనజీవనము నడుపు జీవులు కొందఱు కలరు. ఆ స్థితి వారికి అత్యంత సహజముగా నేర్పడి, స్వాతంత్ర్యమను మాటయే వారికి వెఱపుగొలుపును. వారి భావ మిది "ఈ స్థితి మనకు మిక్కిలి చక్కగా నున్నది. మనకిప్పుడు కల దంతయు విడనాడి, అజ్ఞాతము, అనిశ్చయము అగు స్వాతంత్ర్య మార్గమును త్రొక్కుటకన్న మనము స్వాతంత్ర్యము నే విడ నాడుదము!" పురీషములో జీవించు పురుగును పుష్పరాశిపై నుంచినచో, అది ఊపిరాడక చచ్చును. వీరు బద్ధజీవులు; శాశ్వతముగా ఐహికజీవనబద్ధులై యుండువారు.

*　　　*　　　*

225. లోకము అవిరామసుఖయుక్తమైయుండి, వ్యాధి, వియోగము, దుఃఖము, లేమి, అపాయములు, ఆపదలు, భయము, దిగులు: ఇవి లేకుండినచో; భగవంతుని స్మరించు

బుద్ధి యెవరికి ఉండియుండును? ఈశ్వరుడు మన బోధనార్థము; మన పరీక్షార్థము; మన మాయనను మఱవకుండుకొఱకు, మన అసహాయతను గుర్తించి ఆయన శరణ మర్థించుకొఱకు వీనిని మనకు ప్రసాదించియున్నాడు. కావున అన్ని స్థితులలో-సుఖదుఃఖములలో—ఎట్టైనను, ఆయనను అంటిపట్టుకొని యుండుము. హృదయపూర్వకముగా ఆయనను ప్రేమించి, ఆయనయే నీ యేకైకగమ్య మని, నీ యేకైకాధారమని, యేకైకనిధాన మని, సర్వస్వమని యెఱుగుము. అట్లు చేసితి వేని, బాధ, వియోగభావము, దుష్టత, నీ మనస్సును కలత పెట్టజాలకుండును; నీ హృదయము ఆనందపూర్ణమై యుండును.

* * *

226. క్షుధార్తి — ఈశ్వరప్రేమక్షుధార్తి—వీడితు డగు యాచకుడవై యుండుము. ప్రేమమూర్తియగు ఆయన దర్శనముకై పరితాపముతో విలపించుచుండుము. ఆయనను పొందనిచో జీవితము దుర్భరమైయున్నట్లు ఆయనకొఱకున్మత్తుడవై యుండుము. తనభక్తునిహృదయవేదనకు ఆయనవలె సానుభూతిచూపువారెవరు? సాధకునకు ఆయనవలె స్వకీయుడింకెవరు? ఆయనవలె తన హృదయమును పూర్తిగా ఆకర్షించినవారు—తన హృదయము నంతయు విప్పిచూపదగు వారు — మఱెవ్వరుకలరు? నూఱుపాపములు చేసినను, పశ్చాత్తాప మొందినవాని, నాయన యొడిలోనికి తీసికొని ప్రేమాలింగన మొనర్చుకొనును. ఆయనప్రేమ మన గ్రహణశక్తి కతీతము; అన్ని అవధుల కతీతము. ఆయన అవ్యయా

నందసాగరము, అనశ్వరతాసుధావార్ధి. ఆ మహాసముద్రము లోనికి దుముకుము, నీకు అమృతత్వము ప్రాప్తించును, పానక ములో తేలాడు 'రసగొల్లా'వలె నీవు ఆనందములో ఈదు లాడుదువు. సగుణాద్వైతారాధనలో గల ఆనందానుభూతిని గోల్పోవ నిచ్ఛగింపక రాగాత్మికా భక్తుడు ముక్తిని నిరాక రించున దూరకయేనా?

* * *

227. ఈశ్వరోన్మత్తులు, పానోన్మత్తులవలె, రెండు తరగతులకు చెందుదురు. కన్నీటితో "అమ్మా, అమ్మా" యని బిగ్గరగా పిలుచుచు, నీలవర్ణయగు శ్యామాదేవినిగూర్చి భక్తిగేయములుపాడు వారిం దొక తరగతి. రెండవతరగతి వారు, భక్తిపానామృతమును కడుపారగ్రోలి స్మృతితప్పి యుండువారు. ఆ స్థితికి వచ్చినవలకు వారికి తనివితీఱదు. మొదటివారిది భక్తశ్రేణి, రెండవవారిది జ్ఞానశ్రేణి. తమతమ మానసప్రవృత్త్యనుసార మిరువురును పారమార్థిక భావ నిమగ్నులగుదురు. కాని భక్తుడు "నే నతనివాడను" అను భావమును నిలుపుకొనును. జ్ఞాని తన "అహము" నాయనలో విలీనమొనర్చి "తత్త్వమసి—నిరుపాధిక, అనంత సచ్చిదా నందమును, పరమాత్మను, అఖండ పరబ్రహ్మమను నేనే" యను భావమున నుండును. ఇం దెవరి యానంద మధికమో చెప్పగలవా? భక్తిజ్ఞానములయొక్క అంతిమ (పరమాగ్ర) దశ ఒకటే. అది ఆత్మతోడి ఐక్యభావము, రెండును ఒకటిగా కలిసిపోయి, రెంటికిని భేదమే లేకుండు స్థితి.

* * *

228. నిరాకారబ్రహ్మము మహాకాశము (గగనము, ''దేశము'' ల) వంటిదికాదు, అఖండచిత్తు (చైతన్యము, ప్రజ్ఞానము) వంటిది. ఈ చిత్తు సర్వగతము—సర్వములోను నీరంధ్రముగా వ్యాపించి యుండును. ప్రపంచములోని సర్వ పదార్థముల యునికి దాని యునికి వలననే—వానియందదది యుండుటవలననే, ప్రపంచ విషయకజ్ఞాన మంతయు దాని చిత్ప్రకాశమునుండియే, విశుద్ధజ్ఞానమునుండియే వచ్చును. సృష్టిలోని సుఖ మంతయు దాని యానందమునుండియే ప్రవహించును. బ్రహ్మము విరాట్టు, అమేయ విశాలత. మహాకాశము, అనంత ''దేశము''. ధ్యానసౌకర్యార్థ మేర్పఱుచుకొన్న చిహ్నమాత్రమైనవి.

* * *

229. బ్రహ్మార్పణం బ్రహ్మ
హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం
బ్రహ్మకర్మసమాధినా॥—గీత ౪-౨౪.

(అతనిబుద్ధికి అర్పణకర్మము బ్రహ్మము, అర్పింపబడుహవిస్సు బ్రహ్మము, హోమాగ్ని బ్రహ్మము, అర్పించువాడు బ్రహ్మము, ఇట్లు కర్మరూపుడగు బ్రహ్మమందు నిమగ్నుడై యుండువాడు బ్రహ్మమునే పొందును). ఈ గీతాశ్లోకభావము సర్వమును బ్రహ్మముగా తలచుచు, ప్రతిపనిని చేయవలెను అని. అనగా, బ్రహ్మము (లేక, ఈశ్వరుడు) తానేయని తలపవలెను. అప్పుడతని జీవితమంతయు యజ్ఞకర్మ మగును అర్పణకర్మము,

హవిస్సు, హోమాగ్ని, యజ్ఞకర్త, క్రతువు, తద్గమ్యము: అన్నియు బ్రహ్మమే. ఏయే కర్మ మొనర్తువో దానినెల్ల యజ్ఞముగానే — ఆయన ఆరాధనగానే — భావింపుము. భోజనము చేయునప్పుడు అన్నము ఆయనయే యనియు, భోజనకర్మ మాయనయే యనియు, భోజనోపకరణములు— అనగా భోజనకర్మమునందు పనిచేయు అవయవములు— ఆయనయే యనియు, ఇంతేల, ఆయనయే భుజించుచున్నా డనియు తలపుము. భుజించునపుడు బ్రహ్మరూపమగు జఠ రాగ్నియందు అన్నమును హవిస్సుగా నర్పించుచున్నా నను భావముతో భుజింపుము. భోజనవిషయమునకు మాత్రమే కాదు ప్రపంచమున ప్రతిదానికి, ప్రతికార్యమునకు, ప్రతి తలపునకు ఈ బ్రహ్మ (లేక, ఈశ్వర) భావమును ప్రయో గింపవలెను. కర్మాసక్తుడగు మనుష్యుని కర్మమంతయు ద్రవించిపోవునట్లు చేయు మార్గ మిదియే — ఇందు బ్రహ్మ ప్రాప్తితప్ప వేఱుఫల మేదియు కలుగదుగదా. ఈ శ్లోకము నందు శ్రీకృష్ణ భగవానుని బోధ యిదియే. ప్రతికర్మము నందును, ప్రతి గమ్యార్థమందును, మనము ఈశ్వరుని ప్రతి ష్ఠింపవలెను, ఆయన శ్రేయస్కరస్పర్శను, శ్రేయస్కర సంకల్పమును ఎల్లప్పుడు, ప్రతివిషయములోను మనము చూచుచుండవలెను; మనకర్మము లన్నిటి (సత్కర్మముల, దుష్కర్మముల) ఫలమును అహంభావపూరితమగు కర్తృత్వ భావమును త్యజించి ఆయన కర్పించుచుండవలెను. మా బేలూరు మఠశాఖ లన్నిటిలో భోజనారంభవేళలందు ఈ శ్లోకము నందఱు కలిసి యొకటిగా పఠింతురు.

230. ఇదేభావము గల రామప్రసాదుని చక్కని గేయ మొకటి కలదు. దాని యర్థ మిది:*

దేశికుం † డిడ్డ మహనీయదివ్యమంత్ర
మును జపించు చహోరాత్రములు, మనంబ!
కొలుచుచుండుము కాళి నీ కూర్చువిధుల;
అమ్మకుఁ బ్రణామమౌత శయ్యను బరుంట;
దేవి ధ్యానంబటంచు నిద్రిలుట నెంచు,
శ్యామకుఁ బ్రదక్షిణమె తిరుగాడు టెల్ల;
చెవిఁ బడునదెల్లఁ దన్మంత్ర మవును—నిజము;
భాషలోనుండు నేఁబదివర్ణములును
కలిసి కాళియౌ; నందు నొక్కండొకండు
నామె నామంబెయౌ; తనుపార పంచ
భక్ష్యములనెల్లఁ గుడువుము, వానినెల్ల
శ్యామ కర్పించుచున్నాఁడ ననెడు బుద్ధి.

* * *

231. ఈ శరీరము అనిత్యము. మరణానంతర మది చివరకు క్రిములుగను, బూడిదగను మారిపోవును, పురీషము, మూత్రము, కఫము, రక్తము, క్రొవ్వు, మజ్జ, కండ- ఇట్టి అశుద్ధ, అసహ్య వస్తువుల కూడిక యే ఇది. కాని ఈ మాంసాస్థిపంజరములో బంధింపబడి జీవు డెట్టి యవివేక

---

* ఆంగ్ల పద్యమునకు తెనుగు. † దేశికుడు—గురువు; ఇడ్డ—ఉపదేశించిన.

భ్రాంతిలో చిక్కుచున్నాడు! ఈశరీరమునందపారాసక్తికలిగి, తా నదియేయైనట్లుతలచి, అతడు ప్రతినిమిషము అనంతవ్యథ ననుభవించుచుండును, కాని అతనికి జ్ఞానము రాదు. విశ్వమును భ్రమింపజేయుచుండు ఆ జగన్మాత, ఆ మహామాయ యొక్క మాయాప్రభావ మట్టిది! ఎల్లరను ఆమె యెట్టి భ్రాంతిలో చిక్కించినది! ముముక్షువులు, దేహేంద్రియార్థము లెల్ల అవాస్తవికములు, క్షణభంగురములు అని గ్రహించి, ఈ వినాశకర భ్రాంతిజాలమును ఛేదించుకొని, నిత్యు నాశ్రయింపవలెను.

* * *

**232.** వంగదేశసాధక కవి యొక డీ భావము గల గేయము వ్రాసెను.*

ఆ మహామాయ—దురవగాహప్రభావ—
క్షితిజనంబులపైఁ బ్రయోగించు మాయ
యద్భుతముగాదె! యమరులో నజముకుందు
లేని, యామూలముగ నామె నెఱుఁగలేక
ముగ్ధులై, స్మృతిచెడి, చాఁగి మ్రొక్కుచుండ,
వినుచు టేటికి మర్త్యభూజనులమాట!
పలలమున నొండెఁ, గాసారజలము వెలికిఁ
బాఱుచో నొండెఁ, జేఁపలఁబట్టు బోను

* ఆంగ్లపద్యమునకు తెనుగు.

నుంతు; రది చిఱుచేఁపల కునికి యగును;
తెలిపియుండియు నందుండి తెలియవచ్చు;
తనకొఱకుఁ బట్టుపు ర్వల్లుకొనును గూడు;
వెలికిఁ బోఁగోరనేని పోఁ గలుగుఁ; గాని
మంత్రముగ్ధమై య మ్మహామాయవలన
కూనలోపలనే యుండి కూలు నంద!
ఆత్మ నిర్మిత కారాగృహంబునంద!

* * *

233. ఉపాసన అనగా సేవార్చనాప్రార్థనల మూలమున ఈశ్వరునొద్ద చేరుట. ఆ శబ్దపు వ్యుత్పత్త్యర్థము ఆయన సామీప్యమున నుపవిష్టుఁడగుట. వ్యర్థ భావములు, వ్యర్థ కార్యములు, మన కుపకార మొనర్చుటకు మాఱు అపకార మొనర్చును. వానియందు నిరాఘాటముగా రమింపసాగినచో, అవి మనలను భగవంతునికి దూరముగా నే ముఱుగుడు మాంసపు గుంటలోనికో, ఇట్టి ఇంకేదో అసహ్యప్రదేశమునకో కొనిపోవును. వ్యర్థభావములకు, వ్యర్థకార్యములకు, అనిత్యైహికవస్తువులకు, దూరగతులమై, ఈశ్వరస్మరణ, విచార, ధ్యాన, పూజా జపములందును, పరోపకార కార్యములందును; మానవసేవయందును, ఆసక్తుల మగుకొలది, మన మీశ్వరసామీప్యము చేరుదుము, ఈశ్వరసారూప్యము నొందుదుము, మన హృదయము లానందపూరితము లగుచుండును. ప్రపంచమును జయించుటకును, దుఃఖమును, అశాంతిని పాఱదోలుటకును, ఇది తప్ప వేఱుమార్గము లేదు.

234. నేను బరానగరమఠములో పూజ్యపాదులు శ్రీ ప్రేమానందస్వాముల వారియొద్ద—ఇంతవఱకప్రకటితములగు—శ్రీరామకృష్ణుని నీతికథలు రెండు వింటిని. అందు మొదటి దిది "ఈశ్వరునొద్ద ప్రత్యేకాధికారమునంది, ఏదో యొక కార్యసాధనార్థము పంపబడి, ఆచార్యశ్రేణికి, లేక గురుశ్రేణికి, చెందినవారిని పాచికలాటలో పరిపూర్ణ ప్రావీణ్యమునొందినవారితో పోల్పవచ్చును. త్వరితముగా గమ్యమునుచేరునట్లు వారు ఆడ గలుగుట నిస్సంశయము, కాని వారు బుద్ధిపూర్వకముగా గమ్యమునుండి దిగివచ్చి మరల ఆడుదురు. అతినిపుణతతో వైచుటవలన వారికే సంఖ్య కావలెనో—రెండో, నాలుగో, ఆఱో, ఎనిమిదో, పదో— దానిని వేయగలమని వారెఱుగుదురు. వారు క్రొత్తవారిని జతగూర్చుకొని వారినికూడ గమ్యమునకు కొనిపోవుదురు. నీవు జతకాడవుకమ్ము. పాచికలాటలో అట్టిజత నెవరును ఓడింపజాలరు. అట్లే అట్టి గురువు ప్రాప్తించినవానికిని భయములేదు."

* * *

235. రెండవనీతికథ యిది. ఒక ముసలిది యెంతో బాధపడికూడబెట్టి యొక బంగారుమురుగులజత చేయించుకొని చేతులకుపెట్టుకొనెను. కాని వాని నెవ్వరునువచ్చిచూచి, మెచ్చుకొనలేదు. చివరకు ఆశాభంగమునంది, తన గుడిసెను తగులబెట్టుకొని, కన్నులనీరుకాఱ ఏడ్చుచు, అఱచుచు, ఒక గుంపును చేర్చుకొని చేతులతో చూపుచు "అయ్యో, మీరందఱుచూడుడు, నా గుడిసెను నిప్పంటుకొన్నది. ఎంత

దురదృష్టురాలనోకాని, నాకు గల వంతయు దగ్ధమై బూడిద యైపోయినది, ఈ నా మురుగులు మాత్రమే మిగిలియున్నవి'' అనివిలపించెను. ఇట్లే నీచస్వభావులు వారికిగల కొంచెమును, వారు ఆర్జించిన కొద్దిపాటి నిపుణతను, శక్తిని, లోకమునకు ప్రదర్శింప — అందుచే వారికి నష్టముకలిగినను — ఆతురపడుదురు.''

* * *

236. మానవునిజీవిత మంతయు విషమపరీక్షలతో నిండియుండును. కామాదిఅరిషడ్వర్గము నిత్యజాగరూకమై ఎప్పు డెవసి చిక్కించుకొని మ్రింగివేయుదుమా అని కనుపెట్టి చూచుచుండును. కావున మన మెప్పుడును నిర్నిద్రముగా, ధర్మాధర్మవివేచనముచేయుచు, ఈశ్వరుని ప్రార్థించుచుండవలెను. గదిలో దీపముమండుచుండి, ఎవరో యొకరు మేల్కొనియుండుటను చూచినచో, చోరుడా యింటిలో కన్నమువేయక, మఱొకచోటికి పోవును. ఏ నిమిషమున నీవు బిగిసడల్చి, అజాగ్రత్తకు, బలహీనతకు ఎడమిత్తువో, ఆ వెంటనే నీ శత్రువులు లోనికిజొచ్చుత్రోవ కన్గొని, దార్జన్యమువహించి, కుయుక్తిమార్గముల నవలంబించి నిన్ను పడగొట్టజూతురు, ఎన్నిసార్లోటమి చెందినను, వారెన్నటికిని లొంగిపోయి మానుకొనరు. కాని నీవు అధైర్య మొందకుము. ఎన్నిసార్లు పడిపోయినను, పునరుద్భూతవీర్యముతో లేచి నీ యావచ్ఛక్తితో పోరాడవలెను. అప్పుడు నీ ఓటమియు గెలుపువంటిదిగనే నీకు తోచును. ఇందుచే ప్రతితడవ నీ మార్గమున కొంచెకొంచెము పురోగమనము కలుగు

చుండును. ఉన్నతతరజీవితము గడపవలెనని యథార్థముగా అభిలషించువారికి భగవంతుడే తోడ్పడును, వారికి శక్తి ప్రోత్సాహము లొసగి, అన్నివిధములగు అంతరాయములను, అపాయములను, కష్టములను తొలగించి, మార్గమును సుగమ మొనర్చును. కామక్రోధాదివికారములతో ఎడతెగనిపోరు సలిపి, అలసిపోయి, వారు పరితప్తహృదయముతో ఆయన శరణు చొచ్చిరేని, వారిని తనయొడిలోనికికూడ తీసికొనును. ''భక్తవత్సలు''డనిగదా ఆయనపేరు!

* * *

237. భక్తు డీశ్వరునిసేవించునా, ఈశ్వరుడు భక్తుని సేవించునా? ఈశ్వరునికి తానుచేయగలసేవ అతిస్వల్ప మనియు, ఈశ్వరుడే తన్ను సేవించుచున్నాడనియు, భక్తునికి తోచు కాల మొకటి వచ్చును. భక్తు డొనర్చు ఆరాధన గంగాజలముతో గంగామాతనారాధించుటవంటిది, అనగా, ఆయనసొత్తునే ఆయనకు అర్పించుట. యథార్థభక్తుడు తన్ను గూర్చి తలపనేతలపడు; అతనినిగూర్చి తలపవలసినది ఈశ్వరుడే. ఎట్టివానిని మనము భక్తు డందుము? ఈశ్వరు నందు నిర్మల, నిష్కామ, నిర్నిబంధనప్రేమ గలిగి, ఈశ్వర ప్రేమోన్మత్తుడై యుండువానిని. అట్టి భక్తుని భారము నీశ్వరుడే వహించును, తనయందే ఎవనిహృదయాత్మలు ఎల్లప్పుడు నిలిచియుండునో, అట్టివానిఅక్కఱ లాయనయే తీర్చును. ''తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహా మ్యహామ్'' (సర్వమునందు నన్నుపాసించుచుండువారి యోగ క్షేమభారమును నేను వహింతును) అని గీతావాక్యము.

అట్టిభక్తులు మిక్కిలి అరుదు. మన పురాణేతిహాసములలో అట్టివారు పేర్కొనబడియున్నారు; నారదుడు, ప్రహ్లాదుడు, శుకదేవుడు, విదురుడు, శ్రీరాధ, బృందావనగోపీగోపకులు, ఉద్ధవుడు, మహావీరుడు (హనుమంతుడు) మున్నగు పురాణయుగపువారు, చైతన్యదేవుడు, మీరాబాయి, రామానుజుడు, తుకారామ్, రామప్రసాదు మున్నగు ఇతిహాసయుగపువారు, శ్రీరామకృష్ణుడు, వివేకానందుడు, పవహారి బాబా, నాగమహాశయుడు మున్నగు ఆధునిక కాలపువారు. వీరిలో శ్రీరాధ, శ్రీచైతన్యదేవుడు, శ్రీరామకృష్ణుడు అవతారమూర్తులుగా పూజింపబడుచున్నారు.

* * *

238. భక్తుని విశుద్ధభక్తిప్రేమలవలననే ఈశ్వరుడతని కధీనుడగుట. భక్తుడర్పించు ప్రేమవలన ఋణియై యతని కధీనుడగుచు, అతనిహృదయపూర్వకప్రేమకు తానోటమిచెందె నని ఆయన అంగీకరించును. భక్తుని ప్రేమపాశముచేతబద్ధుడై అతనిహృదయమం దాయన నిత్యనివాసమేర్పఱచుకొనును. ఆయన అతని కీయజాలని దేదియు లేదనుట నిస్సంశయము.

* * *

239. ఈశ్వరు నెడబాసి భక్తు డెట్లు జీవింపజాలడో, ఈశ్వరుడును భక్తు నెడబాసి జీవింపజాలడు — వలపుగొని యున్న యువతీయువకులవలె. కాని యువతీయువకులవలపు ఒండొరుల చక్కదనమువలననో, సామర్థ్యాది పుణ్యముల వలననో, కలిగిన మోహము—అనగా, అది ఐహికవాంఛా

దూషితము, స్వసుఖ, స్వార్థతాదుర్గంధపూరితము. వీనిలో ఏదైన మార్పుకలిగినను, వారి ప్రకృతు లసంగతములుగా తేలినను, ఆ వలపు నిలవజాలదు! ప్రతికూలతనుకూడ కలిగించును. ఈశ్వరునందలి ప్రేమ యిట్లుగాక నిష్కామము, అతీంద్రియము, దివ్యము, శాశ్వతము. ఆ ప్రేమామృతము త్రాగుకొలది, పిపాస పెరుగుచు, ఎన్నటికిని తనివితీఱకుండును. ఇందు ప్రేమభావము, ప్రేమస్వరూపుడగు ఈశ్వరుడు ప్రియుడు, ప్రేమించువాడు, అభిన్నతనొంది ఐక్యమగుదురు. అప్పుడు మిగులునది అఖండానంద మొక్కటియే.

* * *

240 జగన్మాత నిన్నే జీవితమార్గమున, లేక ఏ స్థితి యందు, ఉంచునో, అది—నీ వది గ్రహించినను, గ్రహింప కున్నను—నీ మేలుకొఱకే అని యెఱుగుము. సుఖదుఃఖము లామె హస్తాంభోజకృపాస్పర్శయే. ఆమెలీల నెవరు గ్రహింప గలరు? నిన్నామె సుఖదశలోనుంచినను, దుర్దశలోనుంచి నను, క్షేమముగానుంచినను, కడగండ్లలోనుంచినను, సర్వము ఆమెఅనుగ్రహముగనే వినమ్రతతో నంగీకరింపుము.

‘‘అమ్మ వైచెడు చెంపకాయలును దెబ్బ
లింపు, లవి వీపుపై నెన్నియేని పడుత!
వాని నీ బుద్ధిఁ గైకొనువాఁడు బళిరె!
అమ్మబిడ్డండె నిస్సంశయంబుగాఁగ,
అమ్మదెబ్బలచేఁ జావఁడామెబిడ్డ;
అమ్మబొమముడిపాటున కదరిపోడు,

అమృత మెటులుంచినను తృప్తినందు నతఁడు,
అమృతప్పఁ దదన్యంబు నతఁ డెఱుఁగఁడు.''*

* * *

241. నీ తుచ్ఛబుద్ధితో శాస్త్రచర్చచేసి, తార్కిక దుష్పాండిత్యప్రదర్శనముచేసి, వివాదములుచేసి కార్య కారణవిచారముచేసి, ఈశ్వరునిగూర్చి ఏమి ఎఱుఁగఁగలవు? ఈ మార్గములలో ఆయనను గ్రహింపయత్నించితివేని, నీ ప్రయత్నము విఫలమగుటయేకాక, నీ బుద్ధి చీకాకునొంది, నీ ఉనికినిగూర్చియే నీకు సందేహముకలుగునంతటి దుఃస్థితికి నీవు వచ్చు అవకాశముకలదు. అత్యంతదుర్లభమగు మానవ జీవితము నీకు ప్రాప్తించినదిగనుక, మామిడిచెట్టు ఆకులను లెక్కించుచు, వానినిగూర్చి అద్భుతపరిశోధనలు సాగించుచు దినములు వెళ్ళబుత్తువా, లేక మామిడిపండ్లుతిని సంతుష్టి నొందుదువా? అట్టి కార్యమునం దాసక్తులగువా రవి చేయు దురుగాక. కాని వత్సా, నీవు కడుపునిండ మామిడిపండ్లు తినుము.

* * *

242. జ్ఞానార్జనము, పృథక్కరణము, తార్కిక విచారము, పరిశోధనము, ఇతరశాస్త్రపఠనము ఇవి బుద్ధికి నిశితత్వము కలిగించి, సూక్ష్మవిధుల నెన్నిటినో బయలు పఱచి, లోకోపకారములగు క్రొత్తసత్యముల నెన్నిటినో వ్యక్తపఱచు ననుట నిస్సంశయము. కాని, ఈ లోకమునే

---

* ఆంగ్ల పద్యమునకు తెనుగు.

పరమార్థముగా భావించు స్వార్థపరులగు భౌతికవాదుల— వ్యక్తిజనుల, లేక, జాతుల—చేత ఈ జ్ఞానమే, ఈ పాండిత్యమే చిక్కినచో, అది మానవుల కనంతవ్యథామూలమై, మానవజీవితవినాశకారణమై, మనుష్యులను అరణ్యమృగములుగాను, లోకమును ప్రత్యక్షనరకముగాను మార్చివేయును.

* * *

243. ఈశ్వరునికి — పరమాత్మునికి, సర్వభూతములందు అంతర్యామియై నిలిచి, వారి మనోభావములను నియమించువానికి — తమ తీవ్రవేదనను, లేక కొఱతను, లేక, హృదయపరితాపమును అగాధభావరూపముననో, ఉచ్చరిత లేక, అనుచ్చరిత భాషారూపముననో, తెలుపుకొనుట, వానిని తొలగింపుమని ఆయనకు మనవిచేసికొనుట, ప్రార్థన మనబడును. స్వార్థవాంఛాపూరితప్రార్థన మిట్టిది, "ప్రభూ, ఈ జీవితములోని హింసను, వ్యాధిని, వియోగమును, లేమిని, దైన్యమును, నే నిక భరింపజాలను; సుఖమును, ఆరోగ్యమును, మనశ్శాంతిని ప్రసాదించి, నన్ను దారిద్ర్యవ్యాకులదూరు నొనర్పుము". నిష్కామవాంఛ యిట్టిది · "ప్రభూ, నీ యిచ్ఛవచ్చినంతభారమును నాపై వేయుము, నన్ను అగచాట్లపాలుచేయుము, ఆపదలలో త్రోయుము. ఇవన్నియు నాకు లెక్కలోనివికావు, కాని దేనివలనను బెదరక, నన్ను మఱవక, అభయప్రదాయకములగు నీచరణతామరసములపై నెల్లప్పుడు విశుద్ధభక్తి కలిగి

ఉండుటకు ఎంతపాటి ధైర్యస్థైర్యములు వలయునో అంతపాటి ధైర్యస్థైర్యములనుమాత్రము నాకు ప్రసాదింపుము.”

* * *

244. మానవజీవితప్రధానగమ్యము ఈశ్వరదర్శనము, లేక, మోక్షసిద్ధి. జీవితపరమార్థమును సాధించు నధికారసామర్థ్యములు మానవునికి మాత్రమే కలవు. ఇంకెవరికి—జంతువులకు, దేవయోనులకు, దేవతలకుకూడ—అవి లేవు. జంతుకోటి సత్యాసత్యవివేకహీనముగనుక, అది పొందజాలదు. వేల్పు లది పొందజాలమికి కారణము వారు స్వర్గభోగైశ్వర్యానుభూతియం దెల్లప్పుడును చిక్కియుండుట. వివేకవైరాగ్యముల నభ్యసించుటకు వారికి తీఱిక ఎక్కడిది! ఇదేకారణమున ద్రవ్య, సంపద లపారముగా గలవారికిగూడ ముక్తిదుర్లభము. మిక్కుటమగు పేదఱికముచేత, లేమిచేత, ఎల్లప్పుడు వేదననొందుచు, దిక్కుతోపక, క్షుధార్తిచే కృశించుచు, ఎద్దడిచే తఱుముబడుచు, ఉండువారికికూడ పారమార్థికత్వము దుస్సాధము. ఈ రెండు చివరలకు నడుమ నుండుటచే సామాన్యస్థితిపరులకు ఈశ్వరసాక్షాత్కారమార్జించుకొనుట ఎంతో సులభతరము. తమ బుద్ధివైభవముచేత మత, సాంఘిక, రాజ్యతంత్రాది క్షేత్రములందు శాశ్వతచిహ్నము లుంచిపోయిన మహాపురుషులు ప్రాయికముగా నందఱును మధ్యశ్రేణిలోని—ధనాధికులు, నిర్ధనులు, కాని—కుటుంబములలోనే పుట్టినారనుటకు ప్రపంచచరిత్రమే నిదర్శనము.

* * *

245. తే పేమి కలుగునో అను విషయమునుగూర్చి పరస్పరవివాదము లాడుచు మన శక్తిని వ్యర్థపఱచుకొని నచో, నేడు సాధించుకొనగలిగినదానిని, జేపు సాధింపనై యుండుదానిని రెంటిని పోగొట్టుకొందుము.

* * *

246. పాండిత్యము, మేధ, వేదజ్ఞానము, తర్కము, చర్చ, విచారము, ద్రవ్యము, దానము, పుణ్యకార్యములు, నిర్దిష్టకర్మములు, యజ్ఞములు — యోగతపోభ్యాసములు కూడ—వీనిలో దేనిచేతగాని ఈ యన్నిటికూడికచేతగాని ఈశ్వరసాక్షాత్కృతి సిద్ధింపనేరదు. వీనిలో దేనికిగాని, అన్నిటిమొత్తమునకుగాని, ఆయనదొరకడు. విశుద్ధప్రేమయే, మనఃపూర్వకభక్తియే, ఆయనను ప్రాపించుటకును, బందిగా నుంచుకొనుటకును, ఏకైకమును, అమోఘమును, అగు సాధనము. ఆయన ''పరమప్రేమస్వరూపుడు'' ఆ (ప్రేమ) శ్రుతిని ప్రయోగించితివేని, వెంటనే ఆయనతత్త్వము ప్రస్ఫుట ముగాగోచరించును, ఆయన ఇక దాగియుండజాలడు— దూడ, తలతో దాని పొదుగును దూటుటతోడనే, పాడి యావు ప్రవాహములుగా పాలు చేపునట్లు.

* * *

247. పరముడు గుణాతీతుడని, నామ, రూప, దేశ, కాల, నిమిత్తతోపాధిరహితుడని, వాఙ్మనోబుద్ధులకప్రాప్యు డని, స్వగతుడని, ఆద్యంతవిహీనుడని; భావాగమ్యస్వభావు డని, శ్రుతులు పలుకుచున్నవి. కాని భక్తునిహృదయము ఇదంతయు అంగీకరించి, వెఱచి, వెనుకకుతగ్గనేరదు. అట్లు

చేయుట దాని కసాధ్యము. భక్తు డిట్లనును. "ఈశ్వరు డట్టివాడేయైనచో, ఆయన ఉన్న నేమి, లేకున్న నేమి? ఆయనను చూచుటకుకూడ నా కశక్యమైనచో, ఆయనను నా స్వకీయునిగా జేసికొనుట అసాధ్యమైనచో, ఆయన నా కెట్లుపయోగపడును? అట్లైనచో, సాధనలు, కర్మములు, వ్యర్థములు, నా యునికియే వ్యర్థము, ఈ మనుష్యజీవితమే వ్యర్థము. బ్రదుకుటవలన నేమి ఫలము? ఎట్లైనను, ఈ జన్మముననే నేను ఆయనదర్శనము పొందుదును". భక్తుని హృదయరక్తాశ్రువులు, విలాపములు, ఈశ్వరసింహాపీఠిని చలింపజేయును. ఇక నాయన ఉదాసీనుడై తన ప్రాభవోన్నతియందే నిమగ్నుడై యుండజాలడు. నిజమున కాయన సర్వజ్ఞుడు, సర్వభూతాత్మ, సర్వాంతర్యామి, అవ్యాజనిరవధిక కరుణాసింధువు, వీని యన్నిటినిమించి భక్తవత్సలుడు. కావున భక్తుని హృదయవాంఛితము తీర్చుకొఱకు, తన యథార్థ తత్త్వమును మఱుగుపఱచి, భక్తుని హృదయాలయమున నర్చింపబడు మూర్తిరూపమునే కైకొని దర్శనమిచ్చి భక్తుని జీవితపరమార్థమును సిద్ధింపజేయును. మఱియు, అప్పుడప్పుడాయన మనుష్యరూపమున భూమిపైనవతరించి, మనుష్యులు తన యథార్థతత్త్వమును సులభముగా గ్రహించునవకాశమును ప్రసాదించును. ఈశ్వరు డవతరించి, మనుష్యలోకమున జీవించునపుడు, ఆయన యనుగ్రహముచేత తీవ్ర సాధనలు, గాఢతపశ్చర్యలు, లేనిదే పాపులు, ఆర్తులుకూడ, ముక్తి పొందుదురు.

* * *

248. సాధకునిపై కరుణవలనను, అర్చనాక్రియను తేలిక చేయుటకును, ఈశ్వరుడు రూపమును దాల్చును. ఆయన భావాతీతతత్త్వము నిర్గుణము, నిరుపాధికము గనుక ఆ తత్త్వము దురవగాహము, సకలదివ్యగుణ, సూక్ష్మతత్త్వ, సమష్టిగా భావించుటకూడ మన కశక్యమే. శివప్రతిమను చేయు నుద్దేశముతో నారంభించి, మనము చివర కొక మర్కటరూపమును నిర్మింతుము! మనము మానవులమై యుండునవఱకు, మనలో దేహభావము, ద్వంద్వతాభావము, నిలిచియున్నంతవఱకు, ఈశ్వరుని అనంతకల్యాణగుణసమగ్రుడగు ఆదర్శమూర్తిగా భావించుట తప్ప మనకు మార్గాంతరము లేదు.

* * *

249. దైవమును రూపరహితునిగాభావింప యత్నించితిమేని, అనంతాకాశమునో, అపారపారావారమునో తలంతుము, అంతయే. ప్రాథమికదశయందు దైవమునుగూర్చి ఆయనరూపరహితభావములో ధ్యానింపయత్నించితిమేని, శూన్యమునుగూర్చియే ధ్యానింతుము. అంతకన్న నధికము చేయుట సాధ్యముకాదు. అందుపై నేమియు అభ్యసింప జాలము—చీకటిలో రాళ్ళురువ్వుటవంటిది ఆ కృత్యము. దివ్యపితనుగాని, దివ్యమాతనుగాని, నిరాకారులుగా ధ్యానించుట నిష్ఫలభావనాశ్రమము—అది అర్థరహితవాక్యము. నిరాకారధ్యానము ద్వారా పారమార్థికమార్గమున నెక్కువగా పురోగమింపజాలము. ఏలన అది ధూళివలె కేవల శుష్కము, ఊతగానుపకరించు ఆధార మేమియు లేనిది.

దేహాత్మభావరహితుడై, సర్వభూతములందు దైవమునే చూచు, ముక్తజీవి యగు పరమహంసయొక్కడే నిరుపాధిక, రూపరహిత, బ్రహ్మమునుగూర్చి ధ్యానించు నధికారము గలవాడు.

* * *

250. గీతలో శ్రీకృష్ణభగవాను డిట్లు పలికి యున్నాడు: "సాధురక్షణార్థము, దుష్టవినాశనార్థము, ధర్మ సంస్థాపనార్థము, నేను ప్రతియుగమున—ధర్మముక్షీణించి, అధర్మమువృద్ధినొందినప్పుడెల్ల — దేహముదాల్చి జన్మింతును". కాని భక్తు "డిదంతయు బాహిరము, పైపైనిది; మన మింకను లోతుకు పోవలెను; అంతయు ఇదియేకాదు. ఇంకను కొంత యుండవలెను. దైవము సర్వశక్తిమంతుడు గదా, సశరీరుడై యవతరించి, అనంతవ్యథల నందక, తన ఇచ్ఛామాత్రమున ఇదంతయు సాధించియుండగలడు, కావున ఈశ్వరావతారవాదమున కిదియొక్కటియే సమర్థమగు మహోత్కృష్టప్రమాణమని భావింపజనదు. ఆస్తిక ధర్మ నిందకులు దుష్టులు, లోకకంటకులు, అగు కంసశిశుపాలులను వధించినమాత్రముననే కృష్ణు నవతారమూర్తిగా నెన్న రాదు. అట్టి కంటకులను హత్యచేసి ప్రజలను బాధావిముక్తుల నొనర్చిన సందర్భములు ప్రపంచచరిత్రమున నెన్నియేనియు కలవు. మోదమునం దాఱితేఱిన మహాత్ములయొక్కయు, మహాపురుషులయొక్కయు, జీవితములలో అలౌకికాద్భుత సంఘటన లనేకములు కానవచ్చుచున్నవి. వారత్యాశ్చర్య కరములగు అలోకసామాన్యక్రియలు చేయనోపుదురు, వారికి

అసాధ్యమైన దేదియు లేదు. మథురాద్వారకాపరిపాల కుడుగను, కురుక్షేత్ర యుద్ధభూమిలో పాండవులకు మార్గదర్శ కుడుగను, సాహాయ్యకుడుగను, ఆయనచేసిన కార్యములు కూడ ఆయన యవతారమూర్తియని స్థాపింపవు. వారికి కార్యసిద్ధిచేకూర్చుట కాయన కుమార్గము లెన్నియోసారు లవలంబింపవలసివచ్చెను. ఆయన యొనర్చిన ఈ యద్భుత కార్యము లాయనయెడ అగాధగౌరవసంభ్రమాశ్చర్యములు కలిగించునవియు, ఆయనమహాద్భుతసర్వతోముఖబుద్ధిపరిణతి కివి నిదర్శనములై యున్నవనియు, నిస్సంశయముగా చెప్ప వచ్చును. కాని అవి కేవలతాత్కాలికప్రయోజనసాధన మాత్రములే. మనుష్యజీవితముపై అవి అగాధశాశ్వతప్రభా వము చూపునవికావు.

* * *

251. బృందావనలీలలే శ్రీకృష్ణుం డవతారమూర్తి యనువాదమును స్థాపించు పరమప్రమాణములు—ఆయన అనిర్వాచ్యప్రేమయొక్క యథార్థతత్త్వమును అందు మాత్రమేగదా ఆయన వ్యక్తపఱచెను. విశుద్ధ భక్తిప్రేమలు భగవంతు నెంతవఱకు భక్తపరాధీనునొనర్పగలవో, భక్తుని ఆయన యెంతవఱకు స్వకీయునిగా చేసికొగలడో, ఆయన బృందావనలీలలనుబట్టి చక్కగా గ్రహింపవచ్చును. బుద్ధి జ్ఞానముల కప్రాప్యమగు ప్రేమశిఖరాగ్రము నాయన ఆ లీలలలో లోకమునకు చూపెను. ఆ సముదాత్తప్రేమచే నాకర్షింపబడి వ్రజ (బృందావన) గోపబాలికలు ఆయన వేణునాదాహ్వానమువిని, ఆయన దర్శనసాన్నిధ్యభాగ్యము

ఖొందు నాసతో యమునాతీరమునకు ఉన్మాదినులవలె పరు గిడుదురు. లజ్జా, భయ, కుటుంబగౌరవ, సాంఘికపదవీ భావములను పాఱద్రోలి, ఆయనసమక్షమున వారు శరీర భావమును, వ్యక్తిత్వభావమును మఱచి, ఆయనలో లీనమగు వారు! అట్టి అస్వార్థప్రేమను మనుష్యమాత్రుడు ఉద్భవింప జేయజాలడు. భగవంతునికి—భగవంతునొక్కనికిమాత్రమే —అదిసాధ్యము. ఆ అద్భుత, శాశ్వత, నిత్యానుభూత దివ్యలీలాప్రభావము ఆయనను ఇష్టమూర్తిగా నర్చించు అసంఖ్యాకస్త్రీపురుషహృదయములను యుగయుగములుగా ఆయనకడ కాకర్షించుచు, వారిజీవితములపై శాంతిసుఖము లను వర్షించుచు, వారిని మోక్షార్హుల నొనర్చుచున్నది. కతిపయశతాబ్దానంతరము ఆ ప్రేమభావమునే పునరుజ్జీవింప జేయుటకై శ్రీ చైతన్యమహాప్రభువు అవతరించెను. కామము యొక్క స్పర్శచేతకూడ కలుషితముకాని రాధాకృష్ణక్రీడా మాధుర్యధ్యానమునందు మహాభావము — మహోన్నతా నందమయ సమాధిదశ—లో నిమగ్నుడై లోకములో ప్రతి వాడును ఆ దివ్యప్రేమను, ఆ శుద్ధభక్తిని, చవిచూచునట్లు వానిని ఆయన ధారాళముగా వెదజల్లెను. ఇక మనకాలముననే శ్రీరామకృష్ణుడు ఆ రాధాకృష్ణలీలనుగూర్చి పాడునప్పుడును, మాటాడునప్పుడును, పారవశ్యమునంది మహాభావనిమగ్నుడై శ్రీ రాధికయొక్కయు శ్రీ చైతన్యదేవునియొక్కయు జీవితము లందు మాత్రమే ప్రకటితమైన అత్యపూర్వదివ్యభావముల

శాహ్యాచిహ్నాము లన్నింటిని తనశరీరముపై ప్రదర్శించు చుండెను.

* * *

252. ఎవడైనను తన కున్నదానినేకదా త్యాగము చేయగలుగును; లేనిదానిని త్యజించుటెట్లు? ఒక వస్తువును త్యజింపవలయునన్నచో దానిని మొదట ఆర్జించుకొనవలెను. అందుకు వలయు కష్టబాధ్యతలను తప్పించుకొనజూడరాదు. "గాలిలో ఎగిరిపోయిన వరిపేలాలను గోవిందునికర్పించి ప్రయోజనములేదు".* శాస్త్రములు భోగమును నిషేధింప లేదు. అవి యిట్లు చెప్పుచున్నవి "త్యాగమూలమున జగత్తును భోగింపుము" అనగా, 'నాది' అనుభావమును, దానియందలిసక్తతను త్యజించి భోగింపుము అని యర్థము. "జగత్తులోని సర్వము ఈశునిచే ఆచ్ఛాదితమైయున్నది. ఆయన ప్రతివస్తువునందును నిండియున్నాడు. సర్వము ఆయనదే. కావున ఈ జ్ఞానమునందు సుప్రతిష్ఠితుడవై, సర్వకర్మము లాచరించుచు, మమతాహంకారములువీడి, సర్వమును భోగింపుము. లేనిచో, భోగము క్లేశముగా మారును". ఈ భావముతో జగత్తును భోగించితివేని నీకు యోగము తనంతటతానే ప్రాప్తించును, నీవు దానిని అప్రయత్నముగా — నిర్దిష్టమార్గముల ననుసరింపకే — అభ్యసించినవాడవైతివి.

* * *

---

* అంగడివాడొకడు తన వరిపేలాలు గాలి కెగిరిపోవుట చూచి, వ్యర్థమైపోయినవని, వానిని గోవిందునకు (శ్రీకృష్ణునకు) అర్పించెనట. అందుచే క్షేమమననో, పరముననో, పుణ్యము ప్రాప్తించునని అతనిఆశ !

253. ఇష్టమూర్తిని తలంచుట, లేక స్మరించుట, అనగా మనస్సును దైవముతో సంయోజన మొనర్చుట. ఆ భావప్రవాహము ఆయనలోని కెంత అగాధముగా, ఎంత అవ్యవహితముగా, ప్రవహించునో, అంతఃకరణము*ను చెదర్చు తలపులు అంతగా శాంతించి, దైవాభిముఖభావప్రవాహము — పాత్రములోపోయు తైలధారవలె — నిరంతరమగును. అప్పుడే దానికి ధ్యాన మనుపేరు వచ్చును. ఆధ్యాన మింకను అగాధమైనచో మనస్సు ధ్యేయవస్తువుతో ఐక్యమగును, ధ్యేయరూపముగా ధ్యేయవస్తువుగా, మాఱిపోవును. ఆ స్థితిని సమాధి, అతీంద్రియావస్థ, యందురు. అప్పటికిగాని ఆత్మ యొక్క యథార్థతత్త్వ మనుభూతముకాదు; ఇష్టమూర్తి యొక్క, అనగా దైవముయొక్క. సాక్షాత్కృతి లభింపదు. బ్రహ్మానుభూతి నొందినవానికే హృదయగ్రంధులు తెగిపోవు నని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. అనగా వాని వాంఛాదు లన్నియు నశించును, సంశయములన్నియు శాశ్వతముగా విచ్ఛిన్నములగును, కర్మఫలములన్నియు నిశ్శేషముగా వ్యయ మగును—ఇంతేల, దుఃఖమెల్ల అంతమొందును. అనగా, ఈశ్వరానుభూతినొందగోరువారు ఎక్కవలసిన మొదటిమెట్టు సదా ఈశ్వరచింతాస్మరణములు, రెండవమెట్టు మనోవికార శాంతి మనస్సంక్షోభ రాహిత్యము, మూడవమెట్టు ధ్యానము,

* అంతఃకరణమనగా మనోవస్తువు (material). సాంఖ్యదర్శనము దీనిని నాలుగుగా విభాగించును (1) మనస్సు (గ్రహణ, లేక, కైకొను శక్తి), (2) బుద్ధి (నిర్ణయశక్తి), (3) చిత్తము (మననశక్తి), (4) అహంకారము (కర్తృత్వభావము—"నేను" అనుభావము).

చివరిమెట్టు సమాధి. ఏ నడిమి మెట్టునైన వీడి ఒకేసారి పై మెట్టు కెగురుట అసాధ్యము. కావున ఈశ్వరచింతాస్మరణ ములయొక్క కడపటి(పరిణత)దశ ఈశ్వరానుభూతి.

* * *

254. మంత్ర(ఈశ్వరపావననామ)జపము, ధ్యానము, పూజ వీనిని విధించుటకు కారణము నిరంతరోచ్చరణము, నిరంతరసాధనాభ్యాసము వలన ఈశ్వరచింతాస్మరణములు మనస్సులో సుస్థిరముగా పాదుకొనజేయుట. ప్రతిదినము, చాలసేపు, ఇష్టమూర్తియొక్క పావనమంత్రమును మానసిక ముగా జపించుచుండుట ఇందుచేతనే ఆవశ్యకము. మన మెల్లప్పుడు వేనియందు వ్యాపృతులమై యుందుమో, వేనిని గూర్చి మన మెల్లప్పుడు మననముచేయుచుందుమో, అవి చిహ్నరూపమున మనస్సుపై ముద్రితములై యుండును. అవి మనస్సునుండి ద్రవించిపోయినట్టు కానిపించినను, సూక్ష్మ స్థితిలో పూర్వసంస్కారరూపమున నిలిచియేయుండును. అనుకూలవాతావరణము లభించినతోడనే అవి మన యెఱుక లేకయే—దుష్టసంస్కారప్రాబల్య ముండెనేని చెడుతలపు లకు, చెడుపనులకు, సత్సంస్కారప్రాబల్యముండెనేని మంచి తలపులకు, మంచిపనులకు — మనల నుంకింపజేయును. కావున దుష్టులు క్రమాధికముగా దుష్కార్యములందును, పారమార్థిక పురోగమన మర్థించి పరిశ్రమించువారు ఆ మార్గమునందును వేగముగా ముందుకు సాగుదురు. ఇది అనుభవసిద్ధము.

* * *

225. జగత్తులోగల శక్తియొక్క సమష్టి ఎల్లప్పుడును ఒకటిగనే ఉండును; అది పెరుగదు, తఱుగదు, నశింపదు; కాని, మాఱుపు లొందుచుండును, రూపాంతరము లొందు చుండును—అంతయే. మన చేతలలోను, తలపులలోను—చెడువిగాని, మంచివిగాని—ఏదియు నశింపదు. సూక్ష్మ వైఖరితో అవి పనిచేయుచునే ఉండును. లేనియెడల, అవి సంచితములై నిలిచి, అనుకూలతరుణము వచ్చినతోడనే క్రియారూపమునకు వచ్చును. ఇట్లు మనకర్మముల—మంచి, చెడ్డ—ఫలములను మనమే అనుభవింపవలసియుండును. ఇంతేకాదు. ఒకని సంచితభావములు, కార్యములు, మఱొకనిపై తమ ప్రభావము చూపి వానికి కష్టమో, సుఖమో, కలిగింపవచ్చును.

* * *

256. మనము — ఎఱుకలేకయే — లోకములో వెదచల్లు కార్యరూపములు, భావరూపములు అగు వివిధ శక్తులు తరంగరూపమున మహాకాశమున సంచరించుచుండు ననియు, అవి మన మానసికశ్రుతినే గల ఇతరుని స్పర్శించు నెడల వానియం దవి క్రియాత్మకములగు ననియు వివేకానంద స్వామి చెప్పియున్నాడు. ఆ పురుషుని అదేభావముతో పూరించి, అతని నుత్సాహబలసమేతు నొనర్చి, వానియొద్ద నుండి తాముకూడ అదేవిధమగు నూత్నోత్సాహశక్తి నార్జించుకొనును. మఱియు ఈవర్తులగమనము పూర్తియైన పిమ్మట ఆ శక్తియే బలాధిక్యముతో ఉత్పత్తిస్థానమునకు మరలవచ్చును. మన కెవరికైన అపకృతిచేసినగాని, హాని

కలిగించినగాని, మన మెప్పుడో యొకప్పుడు—ఈ జన్మము ననో, మఱుజన్మముననో — అట్టి ఫలములనే అనుభవింప వలసియుండుట కిదియే కారణము. ఇది ప్రకృతినియమము, అనుల్లంఘ్యము.

* * *

257. నిష్ఠురమగు ఈప్రకృతినియమము నెఱుగక, మన వ్యథలకు ప్రత్యక్షకారణ మేదియు కానిపింపమిచే, మనసామాన్యబుద్ధితో అవి యేల కలిగెనో ఊహింపజాలక, విధిమీఁదనో, మఱేదో అదృష్టశక్తిమీఁదనో, దైవముమీఁదనో నేరమునంతయు మోపి క్రూరులని, పాక్షికులని వారిని నిందింతుము. మాయాసమాచ్ఛన్నులమై, మనకర్మఫలములనే—ఒకవేళ వడ్డికివడ్డితోకూడ—అనుభవించుచున్నామని మన మెన్నడును కనుగొనము! కావున, ఈ ఫలానుభూతిపై బుద్ధి నెఱపి నీ కార్యములను, భావములను నీకువశవర్తులనుగాచేసికొని, వానిని సన్మార్గమున నడుపుము. తాత్కాలిక సుఖమునో, తాత్కాలిక లాభమునో ఆశించి ఎవరికేని వెతను, హానిని కలిగింపకుము. పారమార్థికపథము నెప్పుడును వీడక, సుస్థిర బుద్ధితో నవలంబించితివేని గీతలో పేర్కొనబడిన (16-1-3) దైవీసంపదలు* నీకు సంక్రమించును. నీ చిత్తము

* భయాతీతత, చిత్తశుద్ధి, యోగజ్ఞానములందుసుస్థిరత, దానము, బాహ్యేంద్రియనిగ్రహము, యజ్ఞము, శాస్త్రపఠనము, తపస్సు, సరళత్వము, అహింస, సత్యము, కోపరాహిత్యము, త్యాగము, శాంతి, ఇతరులదోషముల నెన్నమి, భూతదయ, దురాశలేమి, మృదులప్రవర్తన,

శుద్ధమగుటచేత, నీ హృదయమున దైవశక్తిప్రవర్తించు చుండుట నీకు విదితమగును. అప్పుడు నీవు దుష్క్రియలు—చేయగోరినను—చేయజాలవు. శ్రీ గురుదేవుడు చెప్పు చుండినట్లును—ఆయన జీవితములో అక్షరాల ప్రదర్శింపబడి నట్లును— "నీ వెన్నడును తప్పటడుగు వేయజాలవు. పారమార్థికతా పరాకాష్ఠనందినందు కదియే గురుతు."

* * *

258. యోగాభ్యాసము చేయక, లేక, జ్ఞానమార్గము నవలంబింపక, యున్నవారికి సమాధిసిద్ధింప దని అనేకుల విశ్వాసము. కానిపతంజలి యోగదర్శనమిట్లుపలుకుచున్నది: "ఇష్టమూర్తితో ఐక్యముసిద్ధించుట, అనగా ఈశ్వరదర్శనము కలుగుట, మంత్రజపమువలన, అనగా పావననామస్మరణము వలన, ప్రాప్తించును", దీనికివెనువెంటనే ఇట్లు చెప్పబడి యున్నది· "ఈశ్వరుని కాత్మార్పణ మొనర్చుకొనినచో సమాధి లభించును"; "లేక ఈశ్వరధ్యానమువలన" అని మఱొకచోట చెప్పబడినది. అనగా, ఈశ్వరునిపై మనస్సును కేంద్రీకరించుటవలన, లేక, సర్వకర్మములను, కర్మఫలములను, ఈశ్వరుని కర్పించుకొనుటవలన, సమాధి ప్రాప్తించును. మఱియు వ్యాఖ్యాతయగువ్యాసదేవు డీ సందర్భమున ఇట్లు వ్రాసియున్నాడు· "అసాధారణభక్తిప్రేమలతో తన్ను

---

వినమ్రత, స్థిరత్వము, ధైర్యము, సహనము, చిత్తస్థైర్యము, శుచిత్వము ద్రోహచింతలేమి, గర్వరాహిత్యము ఇవి దైవీసంపదకుసంబంధించిపుట్టిన వాని లక్షణములు.

ధ్యానించుటచే ప్రీతుడై, ఈశ్వరుడు సంకల్పమాత్రమున భక్తునికి అనుగ్రహము చూపును. ఆయన సంకల్పించిన మాత్రాననే — అనగా అవ్యాజముగా — యోగులు సమాధిని, తత్ఫలమును, అతిశీఘ్రముగా పొందుదురు". దీనిని బట్టి యోగాంగముల నెనిమిదింటిని అభ్యసింపనిదికూడ సమాధిని సాధింపవచ్చు నని తేలుచున్నది. సరూపదైవముతో కలిసిపోవుట, నిరాకారబ్రహ్మముతో సమాధిలో విలీనమగుట· రెండును ఒకటియే. భావము, ఉపాయము, మాత్రము వేఱు. సత్యానుభూతి, తత్ఫలము రెంటిలో నొకటే. నిజమునకు నిర్గుణబ్రహ్మమే సగుణబ్రహ్మము. కాని దేహాత్మబుద్ధిగలవారుగనుక వ్యక్తిగతజీవులకు సగుణబ్రహ్మారాధన తేలికగా నుండును.

* * *

259. ఏదేనిఫలము నర్థించి భగవంతు నర్చించుట తన్నర్చించుకొనుటేగాని, భగవదర్చనముకాదు. కష్టములు, వ్యాధి, దుర్దశ, విపత్తులు, లేమి, దుఃఖము, భయము, వ్యాకులము, వియోగము, మున్నగువానినుండి విముక్తి నొనర్పుమని భగవంతుని ప్రార్థించుట స్వప్రయోజనార్థమో, స్వాన్నత్యార్థమో, స్వసుఖార్థమో, స్వహితార్థమో యనుట స్పష్టము. నియమితస్నానము, దానము, బాహ్యారాధనము, మతకర్మములు, ఉత్సవములు, వ్రతములు, ఉపవాసములు, యజ్ఞకర్మములు, ప్రాయశ్చిత్తక్రియలు, స్వాస్త్యయనములు, తీర్థయాత్రలు, సాధుసేవ, చండీగీతాదిక పారాయణము ఇట్టి సకామానుష్ఠానము లన్నియు పురాకృత

పాపపరిహారార్థమును, పుణ్యార్జనార్థమును ఆచరింపబడును. పురాకృతపాపపరిహార మనగా పాపాచరణస్వభావమును నిర్మూలించుకొనుట కాదు — పూర్వజన్మములందు చేయబడిన పాపకర్మముల యనివార్యఫలమగు నరకయాతనలను, బాధానుభూతిని ఏదో సులభమార్గమున తప్పించుకొను కోరికయే. పుణ్యార్జనమునందలి ఉద్దేశము ఇహమున బంధు, పుత్ర- కుటుంబములతో సుఖముగా జీవించుట, పరమున స్వర్గలోకములో అన్వయానందము ననుభవించుట! ఈ రెండు కోరికలు మనోభ్రాంతిజనితములే— వెఱ్ఱి అడియాసలే. ఈ లోకమున కేవల(అమిశ్రిత)సుఖముగాని, స్వర్గలోకమున శాశ్వతసుఖముగాని లేదు. ఇవి స్తుత్యర్థము, దుఃఖోపశమనార్థము, ప్రోత్సాహార్థము వేదశాస్త్రపురాణాదులలో వ్రాసియుంపబడిన బూటకపుమాటలు! మత నిర్దిష్ట కర్తవ్యములు, సత్కార్యములు, చేయ నొల్లకుండువారిని. "ఈ కొంచెము మాత్రము చేయుము; కోటిగుణాధిక ఫలము చేకూరును" అని యాశలుకలిగించుటకై చెప్పినవి, తల్లి బిడ్డచేత పాలు త్రాగించుటకై అభూత, కల్పిత కథలు చెప్పి యేమఱుచుట, జోలపాటలు పాడి నిద్రపుచ్చుట వంటివి. ఉద్దేశముమంచిదే, కార్యము కూడ నెఱవేఱును.

* * *

260. సకామము లనుకారణముచేత ఈ నిర్దిష్టారాధనలు, కర్మములు త్యజింపవలసిన దేనా? అవి నిషేధింపుమని నేను బోధించితినా? లేనేలేదు. నీ హృదయవాంఛితము తదనుకూలమైయున్నంతకాల మవి అవశ్యము చేయుచుం

డుము. ఈ అనుష్ఠానములు మనోవైశాల్యమును, మానసోల్లాసమును కలిగించును, సద్భావములు, సత్కర్మాచరణములు సాత్త్వికభావమును పవిత్రమనఃప్రవృత్తినికలిగించును, ఉన్నతతరములగు మతకర్తవ్యములందును, అస్వార్థకర్మములందును, విశ్వాసము, ఆసక్తి కలిగించును. కాని యొకవిషయమునుమాత్రము జ్ఞప్తిపెట్టుకొనుము. అవి వేదోక్తనియమములేయైనను, కర్మకాండము—యజ్ఞయాగాదక్రియాకలాపములకు సంబంధించిన భాగము—లోనివి, భక్త్యాదేశవిషయకము లేకావు. భగవత్ప్రేమమందు క్రయవిక్రయములు, బేరములు, లాభనష్టగణనలు, కర్మఫలవాంఛలు, ఉండవు. హృదయేశ్వరునికి దేహమానసాత్మల పరిపూర్ణాత్మార్పణమే ఉండును; ఆయనను ప్రేమించుటందే సంపూర్ణసంతుష్టి యుండును; ఏలన, ఆయనను ప్రేమించినప్పుడింకే వాంఛనీయార్థముగాని అభిలషణీయమై యుండదు. ఆ ప్రేమకు ప్రేమయే పరమార్థము. అట్టిభక్తుని నైజమే ప్రేమించుట; "ఆయనను ప్రేమింపనిది నేనుజీవింపజాలను, ప్రాణము నిలుపుకొనజాలను" అనునదే అతనివైఖరి. ఇది అత్యగ్రదశ, భక్తిప్రేమల ఉత్కృష్టస్థితి—భగవంతునందు పరమ, పరిశుద్ధ, నిష్కామప్రేమ. కాని అట్టిభక్తి అత్యపూర్వము, ప్రాథమికదశలో అది అప్రయత్నముగా కలుగదు. కావుననే కర్మకాండానుష్ఠానము, వైధిభక్తి, శాస్త్రములతో నిర్దేశింపబడినది. ఈ కర్మములు పరిపూర్ణ భక్తిశ్రద్ధలతో అనుష్ఠింపబడినయెడల. ఈశ్వరకృపచే మనస్సు క్రమక్రమముగా పరిశుద్ధమునంది, కల్మషపదార్థమంతయు కొట్టుకొనిపోయి,

నశ్వరవస్తుకాంక్ష తుచ్ఛముగాతోచి, క్షణభంగురములగు ప్రపంచవస్తువులయెడ విరక్తికలుగును. హృదయ మప్పుడు అక్షర, పరమ, దశ నొంద పరితపించును. ఆ దశను పరాభక్తియని, పరమజ్ఞానమని అందురు.

* * *

261. అవిరామబ్రహ్మచర్య సత్యనిష్ఠలు పండ్రెండేండ్లభ్యసించినయెడల వాక్సిద్ధిలభించును, దివ్యశక్తి తేజరిల్లును. అట్టివానిమాట లెప్పుడుగాని అసత్యములుకాజాలవు; అతడెవని నేమన్నను—శాపోక్తిగాని, ఆశీరుక్తిగాని—అది సిద్ధించును. ఎవనిక్షేమము సతము కోరినను, వానికి సుఖజీవనము కలుగును. అతని పరిశుద్ధమానసమునందే నిర్ణయముత్పన్నమైన నది జరుగును.

* * *

262. భగవదనుభూతి నర్థించునతడు ఎట్టిసందర్భములందేని సత్యనిష్ఠను వీడరాదు. అతడు సత్యమును పరిత్యజించుటకన్న వేయి దుఃఖములు, ఆపదలు—అనుభవింపవలసినచో—అనుభవించుటే మంచిది, అతడు అట్లొనర్పసంసిద్ధుడై, అవన్నియు ఉల్లాసముతో ఎదుర్కొనెనేని, సత్యస్వరూపుడేయగు భగవంతు డతనికి సాక్షాత్కరించును. సత్యమును కోల్పోవుట భగవంతునే కోల్పోవుట. సత్యప్రభావమమోఘము పితృవాక్సత్యత్వమును నిరూపించుటకై రాముడరణ్యమున కేగెను. సత్యపరిపాలనార్థము పాండురాజపుత్త్రులైవురును ద్రౌపదీసమేతులై దేశభ్రష్టత కంగీకరించిరి. అందుకొఱకే హరిశ్చంద్రచక్రవర్తి సర్వమును కోల్పోయి

భిక్షాటనముచేయవలసినవా డయ్యెను. నిష్ఠురసత్యవ్రతనిష్ఠకై ప్రాణములుసైత మాహుతిచేసినవారి నెందఱినో మనపురాణములు పేర్కొనియున్నవి. మన గురుదేవుడగు శ్రీరామకృష్ణుడు పరమార్థమునుసాధించినపిదప కాళికాదేవికి సర్వమును — జ్ఞానాజ్ఞానములు, పవిత్రతాపవిత్రతలు, పుణ్యాపాపములు, ధర్మాధర్మములు—సమర్పించి, ఈద్వంద్వముల నెల్ల కైకొని, తనకు విశుద్ధప్రేమ నిమ్మని ప్రార్థించెను. కాని "అమ్మా, ఇదిగో నీ సత్యము, ఇదిగో నీ అసత్యము" అని మాత్రము చెప్పజాలకపోయెను. ఏలయనగా, ఆయనయే చెప్పినట్లు సత్యమునువిడనాడిన యెడల ఆయన కిక నేమి ఆధారము (పట్టుకొమ్మ) కలదు?

* * *

263. కాలము ప్రచండమారుతమువలె అతిశీఘ్రగమనముతో గడచిపోవుచున్నది. జీవితము ప్రతిక్షణము క్షీణించిపోవుచున్నది. బ్రదుకుకు నామాంతరమే చావు. ఈ దేహము ఎప్పుడు రాలిపోవునో తెలియదు. కావున మరణించుటకు మన మెల్లప్పుడును సిద్ధముగా నుండవలెను. నిరర్థకముగా కాలయాపనచేయవలదు. పిమ్మట చేయుదమని అవశ్యకర్తవ్యముల నెప్పుడును ఆలసింపవలదు. ఈ క్షణము నుండియే మఱుజన్మముకై నీవు ఏదేని సేకరించియుంప యత్నింపుము. సిరిసంపదలు ఈలోకమునకుమాత్రమే ఉపకరించునవి, అవి మరణానంతరము నీవెంటరావు. సాధనలు, భగవత్ప్రార్థన, పరలోకమున నుపయోగించునవి. అవి నిజముగా నీ స్వామ్యములు, నీ వెంటకైకొనిపోదగినవి, ఆ

పదార్థ మెంతస్వల్పమైనను, అందులో ఏ ఇసుమంతయేని వ్యర్థముగాపోదు. దానిసహాయములో నీవు మార్గమున అంతవఱకు పురోగమింపగలుగుదువు.

* * *

264. సాధనలమూలమున నీ వీ జన్మమున నార్జించి పెట్టుకొనినదానితో జన్మాంతరమున ప్రారంభింతువు. అనగా, ఈ జన్మమున పారమార్థికసాధనల నెచట విరమింతువో, అదేస్థానమునుండి జన్మాంతరమున ప్రారంభించి, గమ్యాభిముఖుడవై వేవేగముగ సాగుదువు. కొందఱు నైసర్గికముగనే భగవద్భక్తికలిగి జన్మించుట కిదియే కారణము; కొలదిపాటి సాధనచేతనే వారికి చిత్తైకాగ్రతయు, సూక్ష్మసత్యసహజానుభూతియు ప్రాప్తించును; కొంచెము కదలించినంతనే వారిలోని ఆంతరవహ్ని వెలికివచ్చును. ఈ కదల్చుటయే గురూపదేశము, లేక దీక్షాదానము. అట్టి జీవాత్మలను 'కొంచెము ఊదినంతనేమండు ఎండుకట్టెలు' అని శ్రీరామకృష్ణుడు అనువాడు, తక్కినవారి నాయన "పచ్చికట్టెలు"— సులభముగామండనివి;వారికై గురువు మిక్కిలి శ్రమింపవలసినవారు—అనును. గురువు ఊదిఊది అలసిపోవచ్చును; కాని వారు రాజుకొను — కార్యోన్ముఖులగు — లక్షణము లేచూపరు. అట్టివారు—ఒకవేళ తామేయత్నించినకూడ—చాలకాలము, గాఢముగా—కష్టింపవలసియుండును. వారికి పరమార్థసిద్ధి లభించుట కెన్నో జన్మములు పట్టునేమో.

* * *

265. ప్రతివారును తమ పూర్వకర్మఫలముల ననుభవించియే తీఱవలెను; తమతమ కర్మఫలముల ననుభవించిన

పిదపగాని, అనగా తమతమ కష్టసుఖానుభూతిని పూర్తి చేసి కొని, అందువలన పాఠము నేర్చుకొనినపిదపగాని, ముక్తి నొందునవకాశమే లేదు. అయినను; భగవదవతారమూర్తిని గాని, ఈశ్వరునియొద్దనుండి ప్రత్యేకాధికారమునొంది జన్మిం చిన నిత్యసిద్ధునిగాని, ఆశ్రయించినచో, అట్టి పురుషుని యను గ్రహముచే, అనేకజన్మములొందినగాని తీర్పబడజాలని ఫలములు గల సంచితకర్మము లొకజన్మముననే నిశ్శేషముగా తీఱి పోవును.

* * *

266. ధర్మమార్గానువర్తు లగువారికి ప్రాపంచిక క్లేశ, బాధానుభూతులనంతముగా కలుగుచుండుటయు, అధర్మ మార్గానువర్తులై దౌష్ట్యమునకలవడినవారు సుఖజీవనము గడుపుచుంటయు, లోకమునందు సాధారణముగా కానిపిం చును. ఇంద్రియభోగవాంఛ వీరిలో బలిష్ఠమైయుండుటచే, వీరిజీవితపరమార్థమదియే. భోగ్యవస్తువుల నెట్లైన సాధించుకొనగలిగిరేని, తమ బుద్ధినైశిత్యమున కానందిం చుచు, తాము సుఖులైయున్నట్లు వారు తలంతురు. మల ములో బ్రదుకు పురుగు మలముననే సుఖించుచు, మలము వలననే పుష్టినందుచుండును. కాని అట్టివారు అవివేక కారణ మున, మాయావృతులై, ఈ జన్మమున తాము ఆచరించు చుండు దుష్కృత్యముల భారముచే జన్మాంతరమున నపార వ్యథావేదన లనుభవింపవలసియుండునని వారు విచారింపనే విచారింపరు. తమ పశుప్రకృతివలన వా రొకవేళ క్షుద్రపశు శరీరమున జన్మింపవలసివచ్చునేమో, ఎవ రెఱుఁగుదురు! ఆ

దెట్లున్నను, అట్టి అగాధతమస్సులో మునిగియుండువారు, మనస్సాక్షిరూపవృశ్చికముచే కుట్టబడకుండిరేని, వారు, మనుష్యరూపమృగము లనుటకు సందియము లేదు.

* * *

267. స్వార్థభావముచే కన్నుగానకయుండువారు, ఇంద్రియములకు దాసులైనవారు, అన్యాయార్జితసంపదచే ఉన్మత్తులైనవారు, బైటి కెంతసీటుగా, ఎంత ఉల్లాసవంతులుగా కానిపించినను, వారిహృదయమున యథార్థసుఖశాంతు లుండునని ఒకనిమేషమాత్రమేనియు తలపవలదు. ఐహికవస్తుభోగము, జరుగుచున్నంతకాలము మధురముగనే తోచును; కాని అది హృదయమును నమలివైచుబాధలకు, కష్టములను కారణమగుసమయ మొకప్పుడు వచ్చును. ఆత్మసుఖలోలురజీవితము నిరంతరభయ, వ్యాకు, లాశాంతి, నైరాశ్య, పూరితముగా పరిణమించును. చివరకు వారు మరణమును, ఆత్మహత్యనుకూడ కోరుదురు. వారు శోచనీయులు.

* * *

268. మనస్సు ఉదారసద్భావములవలన, సాధుసంగ్రమువలన, సత్కార్యాచరణమువలన పరిశుద్ధమగును. అప్పుడుగాని అది శాంతిల్లి, జపధ్యానములం దేకాగ్రము కాదు ముఱికి అద్దములోని ప్రతిబింబము అస్పష్టముగా నుండునట్లు మలినమానసము దివ్యభావములను, దివ్యాశయములను, గ్రహింపజాలదు. ఇందుచే, సాధనలు, భగవత్ప్రార్థనలు, చాలముఖ్యము. ప్రారంభదశలో వీనికి మన

స్సంతవిముఖముగానున్నను, మనము బలాత్కరించి వీనిని చేయింపవలెను. అభ్యాసము సాగుకొలది, వీనియం దభిరుచి జనించి మన కవి ప్రీతికరములగును. రోగి ఔషధముగ్రైకొన నిచ్ఛగింపకున్నచో, బుజ్జగించియో, బలాత్కరించియో, అతని నది కైకొనజేయవలెను. కాని కొందఱురోగులు, నోటమందుపోసినను, దాని నుమియుదురు. వారివ్యాధి ఎట్లు కుదురును?

* * *

269. సాధనలు, తపశ్చర్యలు, ఎంతయధికముగా చేయుదువో, ఈశ్వరకృప నీకు ప్రాప్తించుచుండుటను, ఈశ్వరుడు నీ హృదయమున నిలిచియుండుటను, అంత అధికముగా కనుగొందువు. ఆయన నీ కెన్నో విధములుగా తోడ్పడుచుండుట కూడ కనుగొందువు, తన్ను సాక్షాత్కరింపజేసికొనుట కవసరమైనవాని నన్నిటిని—తాను వెనుక నిలిచి—చేకూర్చుచుండుటనుకూడ కనుగొందువు. మనమనస్సును ఆయన ఆకర్షింపనిచో, అది యెన్నడేని ఆయన కభిముఖమగునా? తన్ను ఏకైకలక్ష్యముగా నెంచి పరితపించుచు, తనకై సర్వమును పరిత్యజించి, తన సాక్షాత్కృతికై వేదన నొందు ఆత్మగలిగి, మఱేదానితోను సంతుష్టినొందక, యుండువారి, యందఱిహృదయములను ఆయన అట్లు ఆకర్షించును. ఆ దివ్యాసంతుష్టిని 'ప్రేమోన్మాద' మందురు. ఈశ్వరునికై తీవ్రపరితాపము నొందుటయు, ఆయనయందే జీవించుటయు, ఒకటియే. భగవత్ప్రసాదముయొక్క అంతరతమద్వారమును తెఱచు తాళపుచెవి పరితాపమే.

* * *

270. జపధ్యానములు కొంతకాల మనుష్ఠించినపిదప "ఇన్నిదినములనుండి ఎంతగా సాధనలాచరించినను, అణుమాత్రసిద్ధియు లభింపలేదు!" అని తలపవలదు. చిరతరాభ్యాసానంతరముకూడ ఫల మేమియు కనిపింపకున్నచో, నీయం దేదో లోప మెక్కడనో ఉన్నదని, ఏదో యొక నెఱ్ఱయో, రంధ్రమో కలదని, దానినుండి నీ యర్చన మంతయు — పాత్రమునుండి నీటివలె — కాఱిపోవుచున్నదని, ఎఱుగుము. అంతరపరిశోధనచే దానిని కనిపట్టి పూడ్చివేయుము. తదనంతరము నీ పాత్రము క్రమక్రమముగా నిండి, నీ హృదయము పారమార్థిక శక్త్యానందపూరితమైయుండును. "ఇంత పరిశ్రమించుచున్నాను, ఇంతగా సాధన లభ్యసించుచున్నాను"—ఇట్టిభావములు భ్రాంతిజనితములు, అహంకారసూచకములు. ఇట్లు తలపవలెను · "నే నెంత ప్రయత్నించినను, ఎంత పరిశ్రమించినను, ప్రభూ, నీ సాక్షాత్కృతి నందుట కి దెంత అల్పియము, ఎంతతుచ్ఛము! నిన్ను ప్రాపించుశక్తి నాకు కలదా? నీవు అవ్యాజకరుణ చూపితివేని, నేను నిన్ను కనుగొననేర్తును. వేఱుమార్గ మేదియు లేదు, నిన్నే ఆశ్రయించియున్నాను. నీ అనంత కృపవలన నన్ను దయజూడుము. ప్రభూ, నన్ను రక్షింపుము. జన్మబంధమునుండి విముక్తునొనర్పుము"

* * *

271. జపధ్యానములు సర్వకాలములందును, సర్వ ప్రదేశములందును, సర్వస్థితులందును అభ్యసింపవచ్చును. ధ్యానమునందు సంసిద్ధినొందినవారు "ఆవృత్తచక్షు"లై

(చూపును లోనికి మరల్చినవారై) అంగడివీధిలోని "రణ గుణధ్వని"లోగూడ ఏకాంతత ననుభవించుచు, ఏకాగ్ర బుద్ధితో నుండగలుగుదురు. వారు సుఖదుఃఖములందు, భాగ్యదౌర్భాగ్యములందు,నిందాస్తుతులందు, ఒకేవిధముగా నుందురు. "స్థితధీ" (స్థితప్రజ్ఞులు, బ్రహ్మజ్ఞులు) అని గీతలో పేర్కొన్నది వారినే.

* * *

272. అట్లే జపమునందుసంసిద్ధినొందినవారు ప్రతి ఉచ్ఛ్వాసముతో, ప్రతినిశ్వాసముతో, స్వయంసిద్ధజపము నొనర్చుచుందురు, అందుకై వారు ప్రయత్నింపబనిలేదు. "అజపాజపము" (స్వయంసిద్ధమంత్రోచ్చారణము) అనునది దీనినే. వారి కిట్టిస్థితి లభించుటకు కారణము. చిరతరాభ్యాస ఫలముగా వారిమనస్సులు జపమునందు సుప్రతిష్ఠితములై, బైటికి సంభాషణాదికార్యము లొనర్చుచున్నను, వారి మనస్సులోపలఇష్టమూర్తిమంత్రము అవిరామముగా శబ్దించు చునేయుండుట. బుద్ధిపుట్టినేని సంభాషించునపుడును, వ్యవహరించునపుడును, — జనబోధనార్థము — వారొక జపమాలనుకూడ వాడుదురు. కాని కూరగాయలు, సంబార ములు బేరమాడుచు మిథ్యాచారులును, కపటవైష్ణవులును, చేసినట్లు జపమాలను కటకటలాడునట్లుత్రిప్పుచు తమ మతా నుష్ఠానము ప్రకటించుకొనుటవంటిదికాదిది. జపముచేగాని, ధ్యానముచేగాని, సంసిద్ధినందినమహాత్ముల కొకేదశ ప్రాప్తిం చును. గాఢసాధనలు, మనస్సంయమనము, పారమార్థిక పరిశ్రమ, భగవద్ధ్యానము : వీని నతిదీర్ఘకాలము అభ్యసిం

చిన చివరిఫలమే రెండును. "ధ్యానసిద్ధునికి ముక్తి కర గతము".

* * *

273. ప్రాణాయామమనగా — ఒకనిర్దిష్టవిధమున— ఉచ్ఛ్వాసనిశ్వాసములు సమముగా, మృదువుగా ఆడునట్లు చేయుట; అనగా ప్రాణమును, లేక ప్రాణానిలమును — స్వాధీనములో పెట్టుకొనుట, క్రమబద్ధముగా, నిర్దిష్టవిధి ననుసరించి, ప్రాణాయామము దీర్ఘకాల మభ్యసించిన చో, మనస్సు ప్రశాంతమగును, ఆ మనస్సును ఏ వస్తువులపై ప్రయోగింతుమో ఆవస్తువుపై అది కేంద్రీకృతమగును, అవస్తువునుగూర్చి పరిపూర్ణజ్ఞానముసిద్ధించును. ప్రాణాయామముయొక్క పారమార్థిక ఫలము—ముఖ్యమైనది—ఇదియే. మనశ్శరీరములమీదగూడ దానిప్రభావము ఆశ్చర్యకరమైనదే. శరీరమున కది ఆరోగ్యమును, బలమును, తేజస్సును ఇచ్చును. మనస్సునకుసైతము అది ఉల్లాసమును, శాంతిని, క్షాంతిని, పౌరుషమును, స్థైర్యమును చేకూర్చును. నిర్నిరోధ సంకల్పశక్తి, ఆకర్షణశక్తి, గల మూర్తిమత్త్వముకూడ తేజరిల్లజేయును, కావున మన స్సేకార్యముపై ప్రయుక్తమైనను, ఆ కార్యము సిద్ధించుచుండును. ప్రాణాయామఫలముగా యోగులు దీర్ఘజీవితమును, అనేక అలౌకికశక్తులను, పొందుదురు. కాని ఆ శక్తులు (అష్టసిద్ధులు) పరమార్థసిద్ధికి అడ్డుతగులును.

* * *

274. లోకములో జంతువుల కెంతసావకాశముగా ఊపిరియాడునో అంత దీర్ఘకాల మవి జీవించును; వేవేగముగా ఊపిరియాడు జంతువులు అల్పాయుష్యములు. ప్రాచీన కాలములందు మనుష్యులు ప్రకృతితో పొందిక గలిగి జీవించుచుండిరి గనుక మనుష్యజీవితము సామాన్యముగా నూఱేండ్లుగా నుండెడిదట. మనుష్యుడు శతాయుష్కుడని వేదములు చెప్పుచున్నవి. స్వరోదయ యోగశాస్త్ర ప్రకారము :

| జాతి | నిమిషమున ఉచ్ఛ్వాస నిశ్వాసములు | ఆయుఃపరిమితి |
|---|---|---|
| మానవుడు (ప్రాచీన కాలమున) | 12–13 సార్లు* | 100 ఏండ్లు |
| ఏనుగు | 11–12 సార్లు | 100 ఏండ్లు |
| సర్పము | 7–8 సార్లు | 120 ఏండ్లు |
| తాబేలు | 4–5 సార్లు | 150–155 ఏండ్లు |
| కోతి | 31–32 సార్లు | 20–21 ఏండ్లు |
| కుందేలు | 38–39 సార్లు | 8 ఏండ్లు |

* * *

275. బలముకొలది శ్వాసము విడుచుట నిషిద్ధము. అఱచేతిలోని యవధాన్య (Barley) పిష్టము (పిండి) కూడ

* ఈకాలమున అది సామాన్యముగా 15-16 సార్లు. అందుచే మానవుని జీవిత పరిమితి తగ్గినది.

ఎగిరిపోకుండునంత మృదులముగా శ్వాసము విడువవలెనని యోగశాస్త్రములు చెప్పుచున్నవి.

* * *

276. సాధన లారంభించునప్పటినుండి — నిర్దిష్ట శాస్త్రజ్ఞానముగాని, శిక్షణముగాని, సాధనలుగాని లేక — మనస్సును నిర్విషయస్థితికి(దానిలో భావాదులేమియు లేకుండునట్లు) తెచ్చుప్రయత్నము చేయుచు, అందుచేత మహోత్తమ దశయగు నిర్వికల్పసమాధి—శుద్ధబోధములో నిమగ్నత నొందుస్థితి—నొంద నభ్యసించుచున్నామని, మనస్సును నిరాలంబముగానుండుటకై విషయశూన్యముగా చేయుచున్నామని తలచువారు తామసికదశలో కూలుదురు; అనగా వారు జడులుగా, మతిభ్రష్టులుగా పరిణమింతురు. బుద్ధిశూన్యదశ నందుటచే వారు సూక్ష్మసత్యములను గ్రహించు శక్తిని కోల్పోవుదురు.

* * *

277. యోగములో విజయమందుటకు ప్రథమ నియమము "నాకు విజయము సిద్ధము" అను విశ్వాసము అని శివసంహిత చెప్పుచున్నది. రెండవ నియమము భక్తిశ్రద్ధలతో సాధన లభ్యసించుట; మూడవది గురూపాసన, నాలుగవది సమచిత్తత, ఐదవది ఇంద్రియనిగ్రహము; ఆఱవది మితాహారము, ఏడవ దేదియు లేదు. అనగా, ఈ ఆఱు నియమములు సక్రమముగా నెఱవేఱిన యెడల వేఱేమియు అవసరము లేదు, విజయము సిద్ధము. మోక్షార్థులెల్ల రకును— వినాయింపు లేక—ఇది వర్తించును.

278. మనస్సంయమనమువంటి కష్టకార్యము లోకమున నింకేదియు లేదు. "ఈది సప్తసముద్రములు తరింపవచ్చును, గాలి నంతయు పీల్చవచ్చును, పర్వతములతో బంతియాడవచ్చును, కాని ఈ యన్నిటికన్న చంచలచిత్తమును వశపఱచుకొనుట కష్టము" అని శ్రీరామచంద్రుడు హనుమానునితో చెప్పెను. ఐనను భయపడనక్కఱలేదు, నిరాశ నొంద బనిలేదు. వీరభావసాధకుడు ఈశ్వరునే నమ్మి దృఢదీక్షతోను, అవిరామపరిశ్రమముతోను, మనఃపూర్తిగా, శక్తివంచనలేక, సాధన లనుష్ఠించినచో, ఈశ్వరకృపవలన అసాధ్యములనుకూడ సాధింపగల్గును.

* * *

279. వివేకానందస్వామి యొకసంస్కృతశ్లోకమును రచించి, అమెరికానుండి తనసోదరశిష్యులకు వ్రాసినజాబులో దానిని పంపెను. అందలి రెండుపాదము లివి

నమలిచ్చైతుము చుక్కలగమిని, త్రిజగ
ములం బెకల్తుము బల్మి సమూలముగను;
ఏ మెవరమైనదియు మీర లెఱుంగరొక్కొ?
భృత్యులము మేము శ్రీరామకృష్ణునకును.*

ఇట్టి అవిరళమగు ఆత్మవిశ్వాసమువలనను, గురుభక్తివలనను, అసాధ్యముకూడ సాధ్యమగును. స్వామిజీ కివి కలవుగనుక ఆయన లోకవిజేత యయ్యెను. ఏసుక్రీస్తుకూడ ఇట్లు పలికెను

---

* ఆంగ్లమూలమునకు తెనుగుసేత.

"మీకు ఆవగింజపాటి విశ్వాస మున్నను మీ రీ పర్వతము నిక్కడనుండి లేచి అక్కడికిపొమ్ము అని చెప్పుడు, అది యట్లే పోవును. మీ కేదియు అసాధ్యముగా నుండదు". మన గురుదేవుడగు శ్రీరామకృష్ణుడు వివిధ పారమార్థికానుభూతులను, ఈశ్వరసాక్షాత్కృతులను పొందిన పిదప నిదర్శనార్థము అంబికతో ఇట్లు చెప్పెను. "అమ్మా, నా దివ్యానుభూతు లన్నియు వాస్తవములైనచో, ఈ పెద్దబండ ముమ్మారు దుముకులాడుగాక!" ఇట్లు పలికిన వెంటనే అది దుముకులాడెనట. ఇవన్నియు నిరర్థక వాక్యమాత్రము లేనా?

* * *

280. దేహములో షట్చక్రములు నిజముగా కలవా? ఈ ప్రశ్నమునకు స్వామిజీ యిట్లు బదులు చెప్పెను: " 'యోగిజనవర్ణితములగు షట్చక్రములు మానవశరీరమున స్థూలరూపమున నుండవు, కాని యోగశక్తివలన అవి ఉత్పన్నములై వారికి కానిపించును' అని మా గురుదేవుడు చెప్పువాడు".

* * *

281. గుణత్రయవిభేదానుసారముగా కర్మము మూడు తెఱగులది: మంచిది (ఉపకారకము) సాత్త్వికము; చెడ్డది (అపకారకము) తామసికము; ఈ రెంటి మిశ్రము రాజసికము. కర్మాదులవలన అంతఃకరణము (సూక్ష్మశరీరము)పై ముద్రితమగు చిహ్నమును సంస్కార మందురు. దానినే మనము కర్మ, అదృష్ట, ధర్మాధర్మ, పుణ్యాపుణ్యాది నామములతో సూచింతుము. కారణములేని కార్య మేదియు ఉండజాలదు.

మన మనోభిరుచులు—మంచివి, చెడ్డవి, ఎట్టివైనను—పూర్వార్జితసంస్కారము లుద్రేకించుటవలన కలిగినవే. వానిలో వేనికి అనుకూలవాతావరణ మేర్పడునో అవియే అభివ్యక్తములై కార్యరూపము లగును. తక్కినవి సంచిత సంస్కారరాశిలో వేచియుండి, అనుకూలవాతావరణము కలిగినప్పుడు సత్ఫలములనో, దుష్ఫలములనో ఇచ్చును. మన కార్యము లన్నియు మంచిచెడ్డల కలయికగలవే గనుక మనకు లభించు ఫలములుగూడ సుఖదుఃఖమిశ్రణము గలిగియుండును. మంచి అధికముగానుండుదానిని మంచిదని, చెడు గధికముగా నుండుదానిని చెడ్డదని మనము పేర్కొందుము.

* * *

282. కర్మము — ప్రతిదియు — బంధకారణమే

సుఖముగాని, దుఃఖముగాని, రెండును బంధనములే ఈ రెంటికి అతీతుడైన వానికిగాని ముక్తి లభింపదు. "నేను" అను (కర్తృత్వ)భావములేక పరహితార్థము కర్మము లాచరించు వారు నిష్కాములు గనుకను, అస్వార్థపరులు గనుకను. పేరు ప్రతిష్ఠలుకోరరు గనుకను, వారి కర్మము ఎన్నడును బంధ కారణము కాదు. వారి హృదయములందు ప్రేమ అవిర్భ వించును, సర్వభూతములందును ఈశ్వరునే చూచుటచేత, వారు కర్మమునంతయు ఆయనను సేవించుచున్నామను భావము తోనే చేయుదురు. కావున వారి కర్మమంతయు పురాకృత కర్మములో గర్భితమైయున్న ఫలములను శమింప జేయును, నూత్నసంస్కారరూప మగు కర్మఫలములను కలిగింపదు. కావున మరలమరల జననమరణములు కలిగించుకారణము

నుండి తప్పించుకొని వారు శరీరపతనానంతరము మోక్షము నందుదురు.

* * *

283. ఇంద్రియభోగమునందు సుఖము లేదు. యథార్థ సుఖము త్యాగమునందు మాత్రమే కలదు. సత్యాసత్యవివేచన మూలముననో మాటిమాటికి కష్టము లనుభవించియో, ఐహికవస్తువులన్నియు అవాస్తవికములు, విషాదాంతములు అని యెఱిగి, గుణపాఠము నేర్చుకొని, వానిని భోగించుకోరిక లెల్ల వీడి, బుద్ధిపూర్వకముగా సర్వసంగపరిత్యాగ మొనర్చు వారుమాత్రము పరమసుఖము నార్జించుకొని, అమృతత్వము నొందుదురు. స్వామిజీ తన "భక్తియోగ" గ్రంథములో చతుర్యోగము లన్నిటికి త్యాగమే ప్రాణమని నిరూపించి యున్నాడు.

* * *

284. "సర్వకర్మముల కీశ్వరుడే కర్త, నేనుకాను" అని యెఱుగును గనుక కర్మయోగి కర్మఫలములం దాసక్తి గొనక వానినెల్ల భగవంతుని కర్పించును "పురుషుని(ఆత్మ) కొఱకు ప్రకృతిగాని, ప్రకృతికై పురుషుడుకాడు" అని రాజయోగి ఎఱుగును. పురుషుడు ఆత్మ, ప్రకృతి భౌతిక పదార్థము, కావున అతడు ప్రకృతికి కేవల భిన్నుడు. వారి సంబంధము తాత్కాలికము, శాశ్వతము కాదు. పురుషుడు ప్రకృతి కధీనుడుకాడు. ఆయన ప్రభువు, ప్రకృతి దాసి. ఆయన తనకార్యము నిర్వహించుకొనుకొఱకే ప్రకృతియొక్క-ఉనికి. దానికర్తవ్యము పురుషుని వివిధానుభూతులద్వారా

కై కొనిపోయి అందుమూలమున నతడు తన సత్యస్వరూపమును కనుగొనునట్లు జేయుటయే. కావున రాజయోగి ప్రకృతి తానేయని తలపడు. అందుచేత అతడు ప్రకృతియందు భ్రాంతిజనితాసక్తిని పెట్టుకొనడు.

*  *  *

285. జ్ఞానయోగియొక్క త్యాగము అత్యంతకష్టము. ఏలన అతడు ప్రప్రథమమునుండి ఈ అఖిలప్రపంచము, దానితో తనకుగల సంబంధము, అయథార్థము—మాయ—అనియు, ఈ జీవిత మంతయు స్వప్నతుల్యమనియు భావించుకొననలయును. అతనిది "నేతి, నేతి, ఇదికాదు, ఇదికాదు, నే నిదికాను. అదికాను—నాకు కనుపించున దేదియు, నాకు గల దేదియు నేనుకాను. నేను దేహమను కాను, మనస్సును కాను. ఇంద్రియములను కాను, నాకు సుఖము లేదు. దుఃఖము లేదు. జననము లేదు, మరణము లేదు, నాకు బంధము లేదు, ముక్తి లేదు, నేను అఖండబ్రహ్మమను, పరమాత్మను, నేను చైతన్యస్వరూపుడను, నిత్యశుద్ధుడను, నిత్యబుద్ధుడను, నిత్యముక్తుడను": ఇది అతని మార్గము. ఎఱుకతో నతడు తన యథార్థతత్త్వమగుఆత్మపై—బాహ్యవస్తువులనెల్ల విడనాడి—ధ్యాననిమగ్నుడు కావలెను.

*  *  *

286. భక్తియోగిత్యాగము అన్నిటిలో సులభతమము, అది స్వాభావికము గావచ్చును. అందు కష్టనిష్ఠురములు లేవు, మనస్సును బలాత్కారముగా అణచిపెట్ట బనిలేదు, దానిగమనమునకుమాత్రము నూత్నమార్గము కల్పింప

వలెను. - బహువిధఐహికవిషయసక్తతచే నిరంతరవ్యథార్తులను, నైరాశ్యమును అనుభవించి, మానవుడు అవి అవాస్తవికములని కనుగొని, వాంఛావైముఖ్యము నొందినచో, వానియందతనికిగలసక్తత అప్రయత్నముగా భ్రంశమంది, నిత్యసత్యస్వరూపుడు, శాశ్వతుడు, పరమసుఖనిత్యమూలము అగు ఈశ్వరుని సాక్షాత్కారమొందుటకై అతని హృదయాత్మలు పరితపించును; భక్తిప్రేమలతో హృదయము నిండిపోవును. ఈ కలియుగము—ఇనుపయుగము, పాపపంకిలమగుభ్రష్టయుగము—నకు భక్తిమార్గమే అర్హతమ మని శ్రీరామకృష్ణుడిందుచేతనే చెప్పెను.

* * *

287. యోగ, కర్మ, జ్ఞాన, భక్తులకు పరిపూర్ణసామరస్య మెవని జీవితమున కలదో, అతడే ఆదర్శమహాపురుషుడు, సాధుశిరోమణి, లోకగురువు. ఈ సార్వలౌకికమతమనెడి అధునాతనాదర్శమును దివ్యగురువగు శ్రీరామకృష్ణుడు తా ననుష్ఠించినపిదప లోకమునకు ప్రసాదించెను. ఇది యుగధర్మము,అనగా ఈ యుగమున కనుకూలించు ధర్మము.

* * *

288. త్యాగములేనిది ఈ నాల్గు యోగములలో ప్రతిది ఎట్లసాధ్యమో, అట్లే యథార్థభోగము (ఐహికవస్తుపరిభోగము) కూడ త్యాగములేని దసాధ్యము. త్యాగశూన్యభోగ మెల్ల వ్యథామయమే. అనగా దానివలన వెతలే కలుగును. త్యాగమునం దెంత సుఖము కలదో ఊహింపలేక, త్యాగ మను మాట వినుటతోడనే మనుష్యులు భీతిలి

పాటిపోవుదురు మానవునితో త్యాగమవలంబింపుమని చెప్పి నచో, ఆ మాటకు నీవు సన్న్యసింపుము, నీ ఆలుబిడ్డలను, నీ ప్రియబంధువులను, ఇంటిని, ధనమును, ఆస్తిని విడనాడుము అనియేనా అర్థము? నీ శక్త్యనుసారము నిత్యజీవితమునందు కొంచెము త్యాగమేల అనుష్ఠింపరాదు? త్యాగమునం దెంత సుఖము, ఎంత ఆనందము కలదో, అది హృదయమున కెంత వైశాల్యము, మనస్సున కెంత ఉల్లాసము కలిగించునో నీ కప్పుడు తెలియవచ్చును. ఆహ్లాదము కలిగింపనిది త్యాగమే కాదు. అదేదో మఱొకటి.

* * *

289. త్యాగము మన ప్రాణమునకు ప్రాణము. ఇది నిస్సంశయము. మనము — ఆ సంగతి ఎఱుగకే — ప్రతి క్షణము త్యాగ మొనర్చుచున్నాము. మనము శ్వాసత్యాగము చేయుటలేదా? గాలి లోపలికి పీల్చుకొనుట బైటికి విడుచుటకే కదా? అందువలననే గదా మనము జీవింపగలుగు చున్నాము! ఆహారించుటవలనను. ఇతర పుష్టికర వస్తుసేవనము వలనను రక్తము హృదయస్థానమున నెట్లుచేరునో, అట్లే, అది అప్పుడే రక్తనాళములలోనికి — శుద్ధరక్తమును కొనిపోవునట్టి దుష్టరక్తమును కొని తెచ్చునట్టి, నాళములలోనికి — ప్రవహించి వానికి బలమునిచ్చును. లేనిచో, మరణము తప్పదు. మన మితరుల యొద్దనుండి గాని ప్రకృతినుండి గాని కైకొనునది, మన మార్జించుకొనునది — విద్య, శాస్త్రజ్ఞానము, జగత్తును గూర్చిన సత్యములు, ద్రవ్యము, పారమార్థికత — పరహితార్థమే, పరుల అక్కఱలను తీర్చుకొఱకే. ఇతరులకు ధారాళ

ముగా ఇచ్చివేయుటకు వెనుదీసితిమేని, మన కుండునది కాల క్రమమున వ్యర్థముగాజీర్ణించిపోయి, ఎవరికిని ఉపయోగింపక పోవును. "ఇచ్చివేయుట" అనుమాటను జ్ఞప్తి పెట్టుకొనుడు —బదులుకుబదులుగా ఇచ్చి కైకొనుట కాదు. దానము, లేక, త్యాగకార్యము స్వేచ్ఛాకృతముగా, స్వతఃసిద్ధమైన దిగా, ఫలకాంక్షారహితమైనదిగా నుండవలెను. అప్పుడే అది అనశ్వరశ్రేయోదాయక మగును. స్వామీజీ ఇట్లు చెప్పి యున్నాడు "ఇమ్ము, ఇచ్చివేయుము, బదులు కోరకుము. బదులుకోరినవానిసముద్రము నీటిబొట్టంతదిగా ఇంకిపోవును".

* * *

290. త్యాగనిదర్శనములు బాహ్యప్రకృతియందెల్లెడల కానవచ్చును. సూర్యచంద్రులు, నక్షత్రములు వెలుతురును వేడిమిని ఇచ్చుచున్నవి. వృక్షములు ఫలములను భరించి, నీడనిచ్చి, పుష్ప, మకరంద, సౌరభముల వెదజల్లుచున్నవి, ఏళ్లు దప్పితీర్చుచున్నవి, భూమి సర్వజీవసుఖానుభూతికై ఆహారాదుల నుత్పత్తి చేయుచున్నది. అన్నియు తమ తమ ప్రకృతి ననుసరించి పరహితార్థమై నిశ్శబ్దముగా, తమ్ముతాము దారాళముగా ఇచ్చివేసికొనుచున్నవి. మానవుడొక్కడే—అవసానకాలమున కూడ "నాది", "నాది" అని ఏడ్చుచు, అర్చుచు—దౌర్భాగ్యుడై, పరిహాసాస్పదుడై పోవుచున్నాడు.

* * *

291. యోగులు, త్యాగులు—స్వోపయోగార్థము—దానములు పరిగ్రహింపరు. పరిగ్రహించినచో, వారి

స్వాచ్ఛందత, చిత్తశుద్ధి, తఱిగిపోవును. దానస్వీకారముచే ఉపకారిబద్ధభావము కలుగును. దాతయొక్క పాపము పరిగృహీతయొక్క మనశ్శరీరములను కలుషితమొనర్చును. "నాకిది లభించుగాక, అది లభించుగాక! ఇది జరుగుగాక, అది జరుగుగాక! నాకిది కావలెను, అది కావలెను"-ఇట్టివాంఛల కధీనులై, ఆ వాంఛలు తీర్చుకొనుటకై దానము లంగీకరించుటను పరిగ్రహమందురు. అపరిగ్రహము (లేక, దానములు స్వీకరింపమి) నిష్కామ త్యాగలక్షణము. కాని కేవల దేహసంరక్షణార్థమే ఏదైన కైకొనుట పరిగ్రహము కాదు. మఱియు జ్ఞానులు దేహపోషణమునకు, దేహసుఖమునకు, అత్యావశ్యక మగు స్వల్పమునందు కూడ ఆసక్తినొందరు. ఎట్టి భోగమందును సుఖములేదని వారు నిస్సంశయముగా ఎఱుఁగుదురు. వారు సుఖలుబ్ధులును కారు. కాని వారిలో నెవరైనను విశ్వహిత కర్మము పూనుకొని, దానిని ఎక్కువ చక్కగా, ఎక్కువ విరివిగా జరుపుకొఱకు దానము లంగీకరించుట దోషము కాదు.

* * *

292. పేరు, పేరువలనసూచింపబడినవస్తువు అభిన్నములు, ఈశ్వరుడును ఆయన పేరును ఒకటియే. ఆయన రూపములు, గుణములు, భావాకృతులు, ఎట్లు అసంఖ్యాకములో, అట్లే ఆయన నామములు కూడ అసంఖ్యాకములు. ఆయన నామప్రభావము నిర్నిరోధము, అనంతము. ఏనామము నీ కిష్టముగానుండునో దానిని జపించుచుండుము. ఆయన దాని నాలకించును. ఆయన నామజప మాత్రముచేతనే

అభిమతార్థము లన్నియు సిద్ధించును, ఆయనయు సాక్షాత్క రించును. ''జపాత్ సిద్ధిః''.

* * *

293. గురుపరంపరా లబ్ధ పారమార్థికోపదేశము లనుసరింపనిది సంసిద్ధి ప్రాప్తింపదు. పారమార్థికోపదేష్ట్ర పరంపరలో గురువునుండి శిష్యున కొకశక్తి ప్రవహించు చుండును. ఆ శిష్యుడు కాలక్రమమున గురువైనప్పుడు అతని శిష్యుల కాశక్తి సంక్రమించును. అనాదికాలము నుండియు గురువు లనుష్ఠించుచుండిన కఠిన పారమార్థిక సాధనల ఫల ముగా, వా రర్చించుచుండిన దేవతల దివ్యనామ నిగూఢ శక్తి బీజమంత్రరూపమున కేంద్రీకృతమయ్యెను. ఆ మంత్రమే సాధకుని కాశాకారణము, ఆధారము, ఇష్టమూర్తియొక్క సజీవ చిహ్నము. ఆ మంత్రము ఏకాగ్రబుద్ధితో సర్వదా జపించుచుండినచో, దాని మహాప్రభావము సత్యమగుట గోచరించును. కాని సాధకుడు గురుపరంపరలోని విశుద్ధ మనస్కుడగు అధికారిక గురువునొద్దనుండి నిర్దిష్ట విధమున ఉపదేశము నొందవలెను. అంతట గురువునందు పరిపూర్ణ భక్తిశ్రద్ధలతో అత డుపదేశించిన సాధనలను నిర్దిష్ట విధ మున అనుష్ఠించుచున్నచో, సంసిద్ధి శీఘ్రముగా లభించును.

* * *

294. గదితలుపులు బిగించుకొని నిద్రించు మనుష్యుడు ఎవరైన తలుపుతట్టి తన్ను పేరబిలిచినచో ఎట్లు తలుపు తెఱచునో, అట్లే ఎవడైన భగవన్నామమంత్రము జపించుచు అకృత్రిమభక్తితో, తీవ్రశ్రద్ధతో, సాధన లనుష్ఠించిన చో,

సర్వభూతాంతరస్థుడైయుండు భగవంతుడు మేల్కాంచి, సాధకుని హృదయదేవాగారముయొక్క తలుపు తెఱచి ఇష్టమూర్తిరూపమున కానిపించి అతని హృదయకాంక్షను తీర్చును.

* * *

295. భగవన్నామముయొక్క నిరవధిక తేజోవైభవ ప్రభావములు ఎట్టివనగా, దాని నుచ్చరించిరేని, పాపులు, దుర్దశాపీడితులు, దురాక్షేపకులు కూడ ముక్తినందుదురు, భక్తిహీనుల కందు అభిరుచిజనించి, ప్రాపంచికవిషయము లందు విరక్తి కలుగును. ఇతరసాధన లేవియు చేయజాలవేని, తుదకాయన నామమునైనను జపించుచు, పరితాపహృదయముతో ఆయనను ప్రార్థింపుము, నీకప్పుడు బలము, మనశ్శాంతి, చేకూరును, కాలక్రమమున ఆయన కరుణవలన ఆయనయెడ ప్రేమయు, భక్తియు ప్రాప్తించును.

* * *

296. తపస్య మూడువిధములైనది —— శరీరసంబంధమైనది, వాక్సంబంధమైనది, మనస్సంబంధమైనది. వ్రతములు, తపస్సులు, రోగిదీనజనాదుల సేవ ఇత్యాదులు మొదటి తరగతివి. సత్యనిష్ఠ రెండవతరగతిది. ఇంద్రియనిగ్రహము, ధ్యేయవస్తువుపై కేంద్రీకరణము మూడవతరగతిది. పరమ సంసిద్ధినొందగోరువా రీ త్రివిధతపస్య నభ్యసింపవలెను.

* * *

297. భగవంతునికొఱకాకాంక్ష, అతడు లభింపమిని కొఱతగాభావించుచుండుట : ఇదియే ఆస్తికధర్మసారము.

వాయువు, ఆహారము, వస్త్రములు, ఆశ్రయము (తలదాచుకొనుటకు) — దేహయాత్ర కత్యావశ్యకములగు ఇట్టివానికొఱతయే మనలను మిక్కిలి బాధించును. మీ కీ విధమున భగవంతుడు అవసరమై యున్నాడా? నిజమునకు మనకాయనతప్ప అన్నియు కావలసియుండును — మనజీవితమునకు సామాన్యముగా అవసరమైయుండున వన్నియు బాహ్యప్రపంచమునుండియేగదా మనకుచేకూరును? బాహ్యప్రపంచము మన కీయజాలని వస్తు వేదో మన కతిముఖ్యముగా కావలసియున్నప్పుడు, హృదయముయొక్క క్షుత్పిపాసల నది తీర్పజాల దని మనము కనుగొన్నప్పుడు, మనదృష్టి నంతర్ముఖమొనర్చి అచ్చటనుండి సహాయముకోరుదుము: మాటిమాటికిబాధ లనుభవించినపిదప మనముచేయుచుండినదంతయు బాలక్రీడామాత్రమైనది, జగత్తు స్వప్నతుల్యమగుమిథ్య, కైకొనజూచునదంతయు దొరకక జాఱిపోవుచున్నది అను సత్యము అంటగాల్చినట్లు మనపై ముద్రితమైనప్పుడు — హృదయ మొక నిత్యపదార్థమును—సర్వలోపములను వ్యథలను సమూలముగా నశింపజేయునట్టి దానిని—ఆర్జించు కొనుటకై హృదయము పరితపించును. అట్టి పదార్థము భగవంతుడొక్కడే. ఈ మనోగతి—అనగా ఐహిక వస్తువులయెడ వైముఖ్యము, భగవంతుడు లభింపమికి తీవ్ర పరితాపము—ఆస్తిక ధర్మజీవనముయొక్క ప్రథమసోపానము.

* * *

298. నరకకారణమగు అధర్మముయొక్క వంశపరంపర శ్రీమద్భాగవతములో ఇట్లు పేర్కొనబడియున్నది.

అధర్మముయొక్క భార్య మిథ్య; ఈ దంపతులకు గర్వ మను కుమారుడు, మాయ (మోహము) అను కుమార్తె పుట్టిరి. వా రొకరినొకరు పెండ్లాడగా వారికి లోభ మను కుమారుడు, వంచన యను కుమార్తె కలిగిరి. వీ రిరువురు వివాహమాడగా ఈర్ష్యాక్రోధము లుద్భవించిరి. కలి(యుగము)వారికుమారుడు, దురుక్తి కుమార్త; దురుక్తిని కలి పెండ్లాడి, భీతి యను కుమార్తను, మృత్యువను కుమారుని కాంచెను. వారికిద్దత్తే బిడ్డలు. యాతన, నరకము. ఇంకెవ్వరును లేరు.

* * *

299. పురుషార్థములు నాల్గింటిని చేకూర్చు ధర్మము యొక్క కుటుంబము ఈ పదుమువ్వురు అక్కసెల్లెండ్రతో కూడినదట: శ్రద్ధ, ప్రేమ. దయ, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, వృద్ధి, బుద్ధి, శక్తి, క్షమ, లజ్జ, మూర్తి (ఆకృతి). ఈ పదుమూగురు ధర్మము భార్యలు. వీరిలో శ్రద్ధ సత్యమను వానిని, ప్రేమ ప్రసాదమనువానిని, దయ అభయమును, శాంతి ఆత్మనిగ్రహమును, తుష్టి హర్షమును, పుష్టి గౌరవ మును, క్రియ యోగమును, వృద్ధి దర్పమును, బుద్ధి అర్థమును, శక్తి స్మృతిని, క్షమ క్షేమమును, లజ్జ వినయమును కనిరి. ధర్మముయొక్క కనిష్ఠభార్యయగు మూర్తి—సర్వసుగుణాల వాలము—నరనారాయణు లనెడి దేవఋషులను, నర-దేవుని, దేవ-నరుని, కనెను.

* * *

300. హృదయబుద్ధుల కైక్యభావము కుదురనప్పుడు హృదయవాక్కు నాలకింపుము. జ్ఞానేంద్రియములన్నిటికి బుద్ధి

కేంద్రస్థానము (1) చెవి, వినునది, (2) కన్ను, దర్శించునది, (3) ముక్కు, వాసనచూచునది, (4) చర్మము, స్పృశించునది. (5) నాలుక, రుచిగాంచునది. ఏవిషయమునుగూర్చియైన యెఱుగగోరినచో దానికివలయు మనఃశక్తి బుద్ధినుండియే మనకువచ్చును. మన మూర్తిమత్త్వమునకు మూలములగు భావములకు, ప్రేరణలకు, అనుభూతులకు హృదయమే నిలయము. బుద్ధిధనులు సర్వవేదశాస్త్రములందును, సర్వవిద్యాశాఖలందును, సర్వవిజ్ఞానశాస్త్రములందును పాండిత్యము నొందియుందురు. విద్వాంసులుగా, అధ్యాపకులుగా, తీవ్రబుద్ధులుగా, అనేకవిషయములందు నిపుణులుగా, జ్ఞానపూర్ణులుగా, వారి ప్రాముఖ్యము. హృదయ ధనులు దయా, మనోవైశాల్య, సానుభూతి, సర్వభూత ప్రేమాదిగుణములు పూర్ణముగాకలవారు. మానవులను మహోన్నతభావ ప్రేరితుల నొనర్చిఆత్మసాక్షాత్కారసీమకు కొనిపోవగలది హృదయము మాత్రమే. బుద్ధికి, తార్కికశక్తికి అచట ప్రవేశమే లేదు. కేవలపుస్తకజ్ఞానము గలవాడు స్వార్థపరుడుగా, క్రూరుడుగా పాపిష్ఠుడుగా నుండవచ్చును. కాని ఉదారహృదయుడు చావనైన చచ్చునుగాని అట్టివాడుగా నుండనేరడు.

* * *

301. సాధ్యమైనన్నివిధముల హృదయమును ప్రోదిచేసి పెంపొందింపుము. ప్రేమయనెడి గంగానదికి హృదయమే గోముఖ–మూలస్థానము. ఈశ్వరవాణి వినవచ్చునది హృదయద్వారముననే. ఈశ్వరు డావిష్కృతుడగునది హృదయగుహాయందే. భగవంతుని అధిగమించుటకు, జ్ఞానభక్తి

మోక్షము లార్జించుకొనుటకు శాస్త్రపఠన మక్కఱలేదు, పాండిత్యమొంద బనిలేదు. గ్రంథపఠనమువలన శీలనిర్మాణము కానేరదు, మూర్తిమత్త్వము పెంపొందదు—"విద్యావంతులైన మూఢులు" మాత్రము నిర్మితు లగుదురు. "గ్రంథముకాదు, గ్రంథి (ముడి, అనగా బంధము)" అని శ్రీరామకృష్ణుడు చెప్పినాడు.

* * *

302. ఆధునికవిద్యావిధానము అసందర్భవస్తుకదంబ మనుట స్పష్టము. పెక్కింద్రియం దది మానసాజీర్ణత్వమును కలిగించును. అది "ప్యాస్" (పరీక్షనిచ్చుట) కాదు, మెడకొక "పాశము"ను చుట్టుట. అక్కటా, భారతీయులకు ఈ 'ప్యాస్' చేయుటయం దెంత మోహాతిశయముకలిగినది! జీవితకాలమం దత్యుత్తమమగు యౌవనమున మనదైహిక మానసికశక్తి నంతయు అందుకే వినియోగించుచున్నాము. దారిద్ర్యపీడితులమయ్యును ఎంతో కష్టముతో, ఎన్నో బాధలు, ఎన్నో మనస్సంక్షోభములు అనుభవించి, ఇందుకై ఎంతో ధనము సేకరింతుము—కాని ప్రాయికముగా చివరకులభించు ప్రతిఫలమేమి? ఆరోగ్యమునకు చేటుతెచ్చుకొనుట, జీవన సంగ్రామమున అపజయమునంది సర్వత్ర చిమ్మచీకట్లు కాంచు చుండుట! ఇదంతయుకాక చిన్ననాడే పెండ్లియాడియుండి, ఆలు బిడ్డలను పోషించుబాధ్యత కూడ నున్నచో స్థితి ఎంత "రసాభాసము"గా నుండును! మన విశ్వవిద్యాలయములకు "బానిస భాండాగారములు" (బానిసీంద్రను తయారుచేయు కార్ఖానాలు) అను పేరు అకారణముగా రాలేదు. ఇప్పుడేర్పడిన

రీతి బడిచదువు, కాలేజీచదువు, తిండిసంపాదించుకొనుట కుపయుక్తముకాదు. లోకజీవనమునందు ఏవిధముగను ఉపయోగింపదు. ఇంతేకాక, అది హానికరము, ఆత్మమారకము. విద్యావంతు లనబడువారియందే నైతికాధారములేక, మతవిశ్వాసశూన్యులై, జాతీయతాభ్రష్టులై, జీవన్మృతులై యుండువా రెక్కువగా కానిపించుచునది. మహోత్తమ సంస్కార భాగ్యము గలవారు మాత్రమే తప్పించుకొని బ్రదుకుదురు.

* * *

303. దుర్లభమగు ఈ మనుష్యజన్మము నందితివి గనుక, ఎవరిని పొందినచో ఇంకేమియు పొందనవసరముండదో, ఆయనను పొందజూడుము. ఎవరి నెఱిగినచో, సర్వము విదితమై, ఇంకేమియు నెఱుగుటకు మిగిలియుండదో, ఆయన నెఱుగ యత్నింపుము. ఎవరిని ప్రేమించినచో తక్కిన ప్రియవస్తువులన్నియు—కామినీకాంచనలోలుపత సహా—దుమ్ముగా, బూడిదగా కనిపించునో, ఆయనను ప్రేమింపుము. మృత్యురహితజీవనము ప్రాప్తించుతీఱున నీ జీవితమును నిర్మించుకొనుము.

* * *

304. కాని అత్యున్నతాదర్శము నెడ అట్టి ప్రబల శ్రద్ధాసక్తు లుండవలెను. పారమార్థికానుష్ఠానము—ఏకాగ్రము, నిష్ఠురము అగు అనుష్ఠానము—వలయును. రతి† యెత్తు అనుష్ఠానము మణుగెత్తు వాగ్దానములకన్న ఎక్కువ

† 25 రతులు = 1 మణుగు.

తూగును. దివ్యప్రేమామృతబిందు వొకటి సాగరవిస్తృత శాస్త్రజ్ఞానమునకన్న బాగుగా దప్పిని తీర్చును. ప్రేమ చిక్కగాకాచినపాలు, మీగడ, వెన్న వంటిది, వేదశాస్త్రాది గ్రంథజ్ఞానమంతయు మజ్జిగ అనవచ్చును. సిద్ధాంతచర్చ, శాస్త్రవివరణము, ఉపన్యాసములు మున్నగునవి క్రింది శ్రేణులవారికి—వా రవి విని సుఖమొందుదురుగాక, కోరు వారిని మజ్జిగ త్రాగనిమ్ము. నీవు చిక్కగాకాచిన పాలు, మీగడ, వెన్న, తనివితీఱ కైకొనుము.

* * *

305. నైర్మల్యము సత్య, శివ, సుందర స్వరూపుని కునికిపట్టగు నిరంతరహిమాచ్ఛాదిత కైలాసపర్వతము వంటిది. నిర్మలహృదయమందు మాత్రమే ఈశ్వరుడు ప్రతి బింబించును. అణువును గూర్చిన, సూక్ష్మ, పంచ, మూల, భూతములనుగూర్చిన; శరీరముల—స్థూల, సూక్ష్మ, కారణ శరీరముల—లోని ఆంతరప్రవర్తనములనుగూర్చిన, అవి అసాధారణ మార్గము లవలంబించినచో కలుగు వ్యాధులను గూర్చిన; గ్రహగమనమార్గములను, తత్ఫలములనుగూర్చిన; భౌతికశాస్త్రమునుగూర్చిన; జ్యోతిశ్శాస్త్రమునుగూర్చిన; మహాసత్యములను మనయోగులు, ఋషులు పూర్వయుగము లందే కన్గొనిరి. ఇప్పుడు ఆధునిక విజ్ఞానశాస్త్రము వానిని ధ్రువపఱచుచున్నది. ఇదెట్లు సాధ్యమయ్యెను? వారియొద్ద దూరదర్శని, సూక్ష్మదర్శిని వంటి సాధనములు, ఆధునిక పరికర సమగ్రశోధనాలయములు లేనేలేవు. తమ నిర్మల బుద్ధుల ఆంతరదృష్టిని విచారణీయ విషయములపై కేంద్రీ

కరించు మాత్రముననే వారు తెలిసికొన్న, లేక, వారికి తెలుపబడిన, నిగూఢసత్యములు ఈ కాలపు విజ్ఞానశాస్త్ర కోవిదుల కాశ్చర్యకరములై యున్నవి.

* * *

306. నీకు ఈశ్వరపరమప్రేమ, జ్ఞానము, మోక్షము కావలెనను గాఢవాంఛ కలదేని నీవు బాహ్యాంతరశుచిత్వ మును సాధించుకొనవలెను. మనశ్శరీరములు రెండును నిర్దుష్ట ములుగా, నిర్మలములుగా, చేసికొనవలెను. శ్రీ గురుదేవు డిది సాధించుమార్గము కామినీకాంచనపరిత్యాగము (అనగా స్త్రీకాంక్షను, ధనకాంక్షను విడనాడుట) అని చెప్పినాడు. ఆ పరిత్యాగము అత్యంతకష్టమే కాని అసాధ్యము కాదు. నీ యావచ్ఛక్తితో పోరాడుము. నిరంతరాభ్యాసముచే — తీవ్రస్వయంకృషిచే, పారమార్థిక శిక్షచే—సర్వము సాధ్య మగును. కాని ఈశ్వరకృప లేనిది ఈ స్వయంకృషిని పూను కొనుటకూడ సాధ్యముకాదు. "(గాలిపటము లెగురవేయు టలోవలె)కోటిమంది వానిలో నొకరిద్దఱివిమాత్రమే దారము తెగి స్వేచ్ఛనందును." ఆ ఒక రిద్దఱిలో నీ వొకడవుగా నుండవని ఎవరు చెప్పగలరు? కావున ఈ శ్రద్ధావిశ్వాసము లతో కార్యారంభుడవు కమ్ము.

* * *

307. మనము ఎఱిగియే పాపముచేయుదుము. మన మేమిచేయునది ఎఱిగియు, అది వెతలను తెచ్చుచుండియు, మనము ఆ పనిని మానుకొనము. కాని అవివేకమును, అజ్ఞతను, మూఢతను అభినయించి, దొంగయేడుపు లేడ్తుము. కావలెనని పాపమొనర్చువారు నాస్తికు లనుటకు సందేహము

లేదు. పాపులగుటమాత్రముననే మోక్షావకాశము నశించి పోదు. కాని ఎఱిగి పాపము చేయువారికి ముక్తి కలుగనే కలుగదు. నిద్ర నభినయించువాని నెవరు లేపగలరు? ఆస్తిక ధర్మానుష్ఠానము బాలక్రీడవంటిది కాదు! చిత్తము, నోరు (మాట, చేత) పొందికగానున్నగాని, మనుష్యుడు త్రికరణ శుద్ధికలిగియున్నగాని, సాధింపదగినదేదియు వానికి ప్రాప్తింపదు.

* * *

308. కుయుక్తిచేత, వంచనచేత, ఘనకార్య మేదియు నిర్వహింపబడదు. బాహ్యానటనవలన, వాక్ప్రౌఢిమవలన, మనుష్యులను మోసగింపవచ్చును. కాని కపటము భగవంతుని కడ అక్కఱకు రాదు. నిన్ను నీవే మోసగించుకొందువు. నీ పారమార్థికానుష్ఠానములు, ప్రార్థనలు, ఓటిచెంబులో నీరు పోయుటవలె వ్యర్థశ్రమ మగును. అలసట లేక కష్టించుట వలనగాని, ఆత్మత్యాగ మొనర్చుటవలనగాని మహాకార్యములు జరుగవు, మానవునికి అప్పుడే శీలనిర్మాణ మగును.

* * *

309. ''నే నేమియు చేయను. ఏమియు చేయజాలను, నాకుగా నీవది చేసిననే అది జరుగగలదు'' —— ఇది మతి భ్రష్టుల మాటలు. ''నోటియొద్దకు ఎత్తుము, అప్పుడు నేను తిందును''. ఇట్టి మనోవైఖరిగలవారు మరణించుట వారికిని, సంఘమునకును, ఎంతో శ్రేయస్కరము; ప్రకృతి నియమానుసారము వారు క్రమక్రమముగా బలసత్త్వములుడిగి, మరణించుట తప్పదు. ఇతరులసహాయమును——దృశ్యమో,

అదృశ్యమో అగు బాహ్యసహాయమును—నిరంతర మపే క్షించుచు జీవించుట మరణప్రాయమే. స్వాతంత్ర్యము స్వర్గము; పారతంత్ర్యము నరకము.

*  *  *

310. కర్మసిద్ధాంతము నంగీకరించినవా డెల్ల అదృష్ట వాదిగా ఏల ఉండవలెను? కర్మసిద్ధాంతము మానవస్వాతంత్ర్య సందేశము నెప్పుడును చాటుచున్నదిగదా. నాదుష్కర్మము చేత నేను బద్ధుడనై, పతనమొందినచో, సత్కర్మప్రభావ మున నేను ఆత్మోద్ధరణ మొనర్చుకొనగల ననుట యుక్తి యుక్తమే గదా. నన్ను నేను బంధించుకొనగలనేని, నే నా బంధమును విప్పుకొనగలననుటకు సందియమేల? ఇందుగల భేద మంతయు సంకల్పమునకును, క్రియకును మంచి నియమ మొనర్చుకొని, మంచికార్యములు చేయుచు, మంచిమార్గ మున జీవించుచు, దుష్కర్మబంధములను ఛేదించివైచుకొని మన మేల విమోచనమొందరాదు? ఎన్నటికి మోక్షము నొందు అవకాశమే లేనియెడల మనుష్యజాతియే మతిచెడి ఘోరోన్మాద దశకు వచ్చియుండును. మఱొక విషయము. దుష్కార్యము లొనర్చుచున్నచో మన కెక్కువ ఉపకారము కలుగుచు, మన సంకల్పము లెక్కువగా సిద్ధించుచుండునేని, మనము సత్కర్మాచరణప్రయత్నమే ఏల చేయుదుము? అట్లైనచో, పారమార్థికత, సౌశీల్యము, దయ, ప్రేమ, సౌభ్రాత్రము: ఇవన్నియు ప్రపంచమునుండి అదృశ్యమై, మానవులు ప్రత్యక్షమృగములుగా మాఱిపోయియుందురు.

*  *  *

311. అనంతుడగు ఈశ్వరుడు స్వల్పము, పరిమితము అగు మానవదేహమున నెట్లు అవతరింపగలడు? ఈ ప్రశ్నమునకు స్వామిజీ యిచ్చిన సమాధాన మిది: "ఈశ్వరుడు అనంతుడనుట నిజమే, కాని మీ రనుకొనువిధమున కాదు. మీ స్థూలభావదృష్టికి 'అనంత' మనగా జగత్తునంతయు ఆక్రమించుకొనియుండు బ్రహ్మాండమైన భౌతికవస్తువు. కావుననే మీరు అంతపెద్ద, అంతవిస్తృతిగల, వస్తువు ఈ కొద్దిపాటి మానవశరీరములో నెట్లు ఇముడగల దని ఆశ్చర్య మొందుచున్నారు. నిజమునకు 'ఈశ్వరుని అనంతత్వము' అనగా నిరవధికమగు ఆయన పారమార్థికసత్త్వసారము, మానవశరీరమున నవతరించునప్పుడు అది అణుమాత్రమైనను పరిచ్ఛిన్నము కాదు."

* * *

312. నిర్గుణబ్రహ్మమే సగుణబ్రహ్మముకూడ. సగుణ బ్రహ్మమునకు, ఈశ్వరావతారమూర్తికి భేద మేమియు లేదు. కాని అవతారమునకు, జీవునికి (వ్యక్తిగతాత్మకు) భేదము కలదు. మనుష్యుడు తనకర్మప్రభావముచేత మాటిమాటికి జన్మించుచుండుట తప్పించుకొనేరడు. కాని ఈశ్వరుడు తన దివ్యసంకల్పమాత్రముననే లోకసంగ్రహణార్థము, అధర్మ నిర్మూలనార్థము, ధర్మపునరుద్ధరణార్థము, సాధుభక్తజన కృపాప్రదానార్థము ప్రతియుగమున మానవరూప మెత్తుచుండును. మఱియు, జీవులు సత్త్వ రజస్తమోగుణత్రయాత్మకప్రకృతి కధీనులై జన్మించుచుందురు. కాని అవతార పురుషుడు ప్రకృతికిగాని, త్రిగుణములకుగాని అధీనుడు కాడు.

ఆయన ప్రభువు, నియామకుడు. అవతారపురుషుడు అభివ్యక్తుడైన భగవంతుడే—మానవాకృతిగల బైటి గుల్లమాత్రమే భౌతికము.

* * *

313. మహోన్నతములుగా, మహాతేజోవైభవములుగా, మన మూహింపగల గుణములన్నియు అవతారమూర్తి యందుమాత్రమే అభివ్యక్తములై, సమగ్రగ్రాహ్యములై యుండును. దివ్యగుణము లన్నిటి కాయన మూర్తరూపము. ఆయనదాల్చు మానవరూపమున ఈశ్వరుడే పెక్కువిధముల క్రీడించును. కాని అవతారమూర్తి తాను లోకములో నిర్వహింపవలసిన విశిష్ట కార్యసాధనార్థము తన యథార్థ తత్త్వమును కొలదిమంది నిర్మలహృదయులగు భక్తులకు, అత్యంత సన్నిహిత మిత్రులకు మాత్రము ఎఱుకపఱచును. ఆయన మనుష్యమాత్రునివలెనే ప్రవర్తించును గనుక జను లాయనను గ్రహింపక, గుర్తింపజాలకపోవుదురు. ఆయన జీవితకాలములో ఆయనను పరిహాసించువారును ఉందురు.

* * *

314. స్వయంకృషిని, ఈశ్వరకృపను సమన్వయ పఱచు టెట్లు? ఇవి పరస్పరవిరుద్ధములుగా కానిపించును గాని నిజమున కట్టివి కావు. స్వయంకృషి కూడ ఈశ్వరదత్తమే. ఆయన కృపాలబ్ధమే. పౌరుషహీనులగు భక్తులు నిమ్నశ్రేణి వారు. భక్తులగు మహావీరుడు, అర్జునుడు, ప్రహ్లాదుడు ఎంత పౌరుషవంతులో, ఎంత సాహసికులో చూడుము! మహావీరుడు (హనుమంతుడు) సముద్రలంఘనమునకు కూడ భీతిల

లేదు — "జయ! శ్రీరామ!" అను జయధ్వానము చేయుచు సముద్రమును ఒక్క గంతున దాటెను! ప్రహ్లాదుడు మాటిమాటికి మరణ మెదుర్కొన్నను జంకక విష్ణునం దుల్లముచేర్చి ఆయనశరణుచొచ్చెను. తత్ఫలము విష్ణువు ప్రత్యక్షమై అతనిని రక్షించెను. అర్జునుని ధైర్యసాహసము లందఱెఱిగినవే. దేదీప్యమానములగు ఇట్టి యుదాహరణములు పురాణములందు పరశ్శతములు కలవు.

* * *

315. వీరభావభక్తు డిట్లనును "నేను జగన్మాతబిడ్డను కానా? ఈశ్వర సేవకుడను కానా? నేను దేనికై భయపడ వలసియుండును? నేను చేయజాలని దేమి కలదు?" అత డిట్లు కేక వేయును

"పర దేవత మా యమ్మయె
పరిపాలన సేయు నీ భువనమున నే నె
వ్వరి వెఱతు?" "బ్రహ్మామాయీ"*
స్వరాష్ట్రమును విల్వనేర్తు భక్తిబలమునన్.

మరల నిట్లు

"అమ్మ, యీ పారమార్థికాహవ ధరిత్రి
కరుగుదె, న్మెవ్వరమ్మయో, ఆత్మజుండొ—
ఓడుదురొ చూతు"; "సీతోడ యుద్ధమాడి
నేఁడె యిది నిర్ధరించెద; నిధన మొందు

* బ్రహ్మమేయగు జగజ్జనని (వంగభాష).

వెఱపు నాకేల? నశ్రమ విజయమంది
మోక్షరమఁగొంచు జయభేరి మ్రోగుచుండ.
"కాళినామంబు మజ్జిహ్వాకాగుణాక్వ
ణిత మశనిమ్రోఁతతో దిశల్ నిండుచుండ
నాజి నెవ్వరు నామ్రోల నాఁగఁ గలరు?"
"అమ్మరో నేను నీదు బలమ్ముతో నె
నిను రణమ్మున నోడింతు ననుచు రసిక
చంద్రుఁడు వచించు నిన్నుఁ గొల్చు సాధకుండు".

శ్రీ గురుదేవుడు దీనిని మిక్కిలి సముచితముగా "బందికాంద్రభక్తి"అని పేర్కొనువాడు. అనగా, దౌర్జన్య రూపమగు భక్తి అమ్మ ఆభరణనిక్షేపముపై దొమ్మిగాపడి "మార్, మార్"* అను భీకరయుద్ధారావముతో దోచు కొనిపోవుట.

* * *

316. మగటిమిగలవారి కీశ్వరుడు దయాపరుడై తోడ్పడును. ధైర్యోత్సాహములు, కార్యతత్పరత లేని భక్తులు నిష్ఫలులు, నిర్జీవులు; కాన తామసికస్వభావులు. "మనము ప్రాతస్సాయంవేళల భగవన్నామము స్మరించి కొంత ప్రీతినందుచున్నాముకదా. కాలపరిపాకమున ఆయన అనుగ్రహించి గమ్యమును చేర్చును. మన కిప్పు డేమివచ్చు

---

* అనగా, చంపుము, నాశమొందింపుము! అడ్డమువచ్చినవారి నెల్ల పడగొట్టుము.

చున్నదో, అదియే చాలును" అనేక జన్మములు గడచిన పిదపగాని వారికీశ్వరానుభూతికై పరితాపము కలుగదు. వీరు క్షుద్రులగు కన్నపుదొంగలవంటివారు; భయస్థులు; చేతికి దొరికిన కొంచెముతోనే తృప్తిపడువారు. కాని వీరు కూడ దొంగతనములో నిపుణులుగా నుండవలెను—ఏలన వారు కన్నము వేయు ఇంటివాడు మేల్కొనియున్నాడు.

* * *

317. "నేను క్షుద్రుడను, నేను నీచుడను" అని తలచుకొనుటే స్వామిజీకి అసహ్యము. దాని నాయన ఏవగించువాడు. "అది నాస్తికత, ఒకవిధమగు వ్యాధి, ఒక వెఱ్ఱి. 'నేను తుచ్ఛుడను, నిష్ప్రయోజకుడను' అని ఎల్లప్పుడు తన్నుదాను హీనునిగా భావించుకొనుచుండువాని నెవ్వరును మనుష్యునిగా గణింపరు. అట్లు పలుకుట వినమ్రతయా, అహంభావరాహిత్యనటనయా? 'నేను పాపిని, నే నెందుకు పనికిరాను, నేను దుర్బలుడను' అని భావించుకొనుచుండువాడు క్రమాధికముగా అట్టివాడే అగుచుండును. 'నాయమాత్మా బలహీనేన లభ్యః' (ఈ ఆత్మ బలహీనులకు లభ్యము కాదు). మనశ్శరీర దౌర్బల్యముగలవారు ఆస్తికధర్మము ననుష్ఠింప నేరరు. ఏ మాత్రము విలువగల కార్యమునుగాని వారు సాధింతురని తలపరాదు. అట్టి విషమభావములను పాఱదోలుము. తద్విరుద్ధముగా భావార్థక (Positive) వాక్కులి ట్లాడుము: 'నాయందు అనంతశక్తి ప్రచ్ఛన్నమై యున్నది. దానిని మేల్కొల్పవలెను'. తాను సింహమని భావించువాడు పంజరమును భేదించుకొని వెలువడు సింహము

వలె లోక జాల (net) రంధ్రములనుండి వెలువడును. నీరు డవై యుందువు గాక! 'అభీః! అభీః!' నిర్భయుడవై యుండుము! నిర్భయుడవై యుండుము! ఆస్తిక ధర్మజీవన మవలంబించుచున్నను, ఐహికజీవన మవలంబించుచున్నను, భయమును కాలిక్రింద త్రొక్కి నలిపివేయుము. లేనిచో నీ విప్పటికే మునిగియున్న తమస్సులోనే మునిగియుందువు."

* * *

318. తనకును, ఇతరులకును నిజముగా శ్రేయస్సు చేకూర్చుటకై ఏమి చేసినను అది ఆస్తికధర్మమే. తక్కిన దంతయు ఆస్తికధర్మవిరుద్ధము.

* * *

319. ఆత్మసాక్షాత్కారసిద్ధియొక్క ఆవశ్యకత తమలో కాంచియుండని వారికి, ముక్తికై ఆతురతలేనివారికి నీ వెంత బోధించినను అదంతయు నిరర్థకమే. ఒక చెవితో విందురు, రెండవచెవిద్వారా అదంతయు బైటికిపోవును. మన దేశములో చదువురాని కాపులును, పల్లెటూరిప్రజలును వేదాంతులే. పాశ్చాత్యవిద్వాంసు లనేకులకన్న బాగుగా ఆస్తికధర్మమహోన్నత సత్యములను వారు స్వాభావికముగనే గ్రహింపగలుగుదురు. "బ్రహ్మసత్యం జగన్మిథ్య" అని మనము పసితనము నుండియు వినుచున్నాము. సకాలమున భూమిని సిద్ధపఱచి, మంచివిత్తనములు చల్లనియెడల పంట తృప్తికరముగా పండునా? ఐహికభోగవాంఛ లుడిగిపోయినవారిభక్తి గడ్డివామిపై నిప్పురవపడినప్పటివలె వెంటనే మహాజ్వాలయై

ప్రజ్వలించును. "వాసనకు* నిప్పంటింపుము" అని చాకలి పలికిన రొుక్క మాటనువిని లాలాబాబు ఐహికజీవితమును పరిత్యజించి, ఇంటిని వీడిపోయెను. వేశ్యపలికిన నిందావాక్యముచే బిల్వమంగళునకు జ్ఞానము వచ్చెను. అతడు వెంటనే ఐహికజీవితమును విడనాడి కృష్ణప్రేమను యాచింపనారంభించెను. బృందావనములోనివా రెట్టి మహాద్భుతనిష్ఠురభక్తిననుష్ఠించుచు జీవించి అభిమతార్థమునందిరి! ఈ జన్మముననే సంసిద్ధినొందనున్నవారి కీ విధముననే ఏర్పడుచుండును.

* * *

320. త్రికరణశుద్ధి కలిగియుండుము. నీ పాపములన్నియు క్షమింపబడును. నిష్కపట్యము నిన్ననేకపాపములనుండి రక్షించును. నిష్కపటచిత్తుడు, ఘోరపాపియైనను, సకాలమున భగవత్కృపనంది సాధుసత్తముడగును.

* * *

321. జీవితము ఊషరక్షేత్రముకాదు. తగు శ్రద్ధయు, కృషియు లేనియెడల అది వన్యవృక్షములతో, వన్యమృగములతో, పాములతో, తేళ్ళతో నిండి భయావహస్థితికి వచ్చును. ఈ క్షేత్రమే—ఈ మానవజీవితమే—శ్రద్ధతో పెంపొందింపబడెనేని, గురునిర్దిష్టసాధనలు భక్తిశ్రద్ధలతో, గాఢపరిశ్రమముతో, అనుష్ఠింపబడెనేని, సుఖశాంత్యానంద

---

* "వాసన" శబ్దమునకు బెంగాలీలో "కోరిక"యనియు, "ఎండు అరటిమట్ట" అనియు రెండర్థములు. ఈ మట్టల బూడిదను గుడ్డలుతుకుటలో చవుడుగా చాకళ్ళు వాడుదురు.

రూపమగు అమూల్యసంపదను చేకూర్చును. సాధకుడగు రామప్రసాదుడీ శ్లోకగేయము రచించెను:

వ్యవసాయవిద్య నెఱుంగవు,
సువర్ణవజ్రములు పండు సుక్షేత్రము మా
నవజన్మ, దీని బీడిడి
తివి, మనసా, క్రూరదుర్విధిప్రేరణచేఁ॥

* * *

322. ఈ లోకములో జడపదార్థము, మృతపదార్థము ఏదియు లేదు. మన కట్లు తోపజేయునది తమస్సుతో (చీకటి, అజ్ఞానము) కప్పబడియుండు చైతన్యమే (తెలివియే). ఆ తమోచ్ఛాదనము తొలగించినచో, మాయాతమస్సు అదృశ్యమై, శుద్ధచిత్తు (లేక పరమాత్మ) ఆవిష్కృతమగును. అప్పుడు లోక మాత్మమయముగా కానిపించును. ఆనంద రూపకము (చెలమ) వెల్లివిరియుచుండును.

* * *

323. జగత్తులో ఏ కార్యము, ఏ భావము, ఏ శక్తి, నశింపదు. ఎప్పుడో ఒకప్పుడు, ఏదోయొక అనిరీక్షితరీతిని, నీ జీవితముననో, మఱొకరిజీవితముననో, ఇచటనో, మఱొక చోటనో, ఆ భావపునైజము ననుసరించి సత్ఫలముసో, దుష్ఫలముసో అది యొసగును. కావున ఉదారాశయా! నీవు అత్యున్నతసుఖము నర్థించితివేని, దుష్టపథమును పట్టక నైతికపథము ననుసరింపుము.

* * *

324. శ్రీ శ్రీ చండి (శ్రీ దుర్గాసప్తశతి) మార్కండేయ పురాణములో నొక భాగము. శాక్తేయులకు అంత పరమపావనగ్రంథ మింకేదియు లేదు. అది ప్రతికూలగ్రహములను, ప్రతికూల దేవతలను శాంతిపఱచుటకును, రానున్న (లేక, వచ్చుననితోచు) అరిష్టములను పరిహరించుకొనుటకును, అభ్యుదయసిద్ధికొఱకును, అసాధ్యవ్యాధులను కుదుర్చుకొఱకును, అనుదినమో, కొన్ని నిర్దిష్టశుక్లపక్షదినములలోనో, శాస్త్రోక్తకర్మకలాపములతో, శాస్త్రోక్తవిధులతో పారాయణము చేయబడును. దేవీపూజా (శరన్నవరాత్రపూజా) దినములలో పూజకానుషంగికముగా నిత్యమిది అధ్యయనింపబడుచుండును. ఇందు దేవియొక్క ధ్యానోపాసనా ఘట్టములలో చిత్రింపబడినంతసమగ్రముగా, అంత సర్వాంకషముగా, పరతత్త్వభావము జగత్తులో మఱే ఇతర మతశాస్త్రములోను ప్రదర్శితముకాలేదని స్వామిజీ చెప్పువాడు. మఱియు, మనము గ్రహించి అభ్యసింపవలసిన విషయము లెన్నియో చండియందున్నవి. స్త్రీల నెల్లరను తల్లులుగా, జగన్మాత అంశములుగా కాంచుచు, అట్లే గౌరవించుచుండవలె ననుట ఇందొకటి. శ్రీరామకృష్ణుని జీవితములో ఈ భావము అత్యద్భుతముగా నిదర్శితమైయున్నది.

* * *

325. దేవాసురులకు జరిగిన యుద్ధమొక్క-దానిలో చండికాదేవి సర్వదేవశక్తులకు మూర్తరూపమై ఉద్భవించుటయు, ఆ దేవగణసమష్టిశక్తియొక్క బలము మూర్తిభావము చేత అసంఖ్యాక రాక్షసవీరాగ్రేసరవ్రాతపు భయంకరశక్తి

పరిమార్చబడుటయు ఇందు వర్ణింపబడినది. శక్తిపూజ యనగా జగన్మాతృరూపమున దివ్యశక్తియొక్క కేంద్రీకరణమును ఆవాహనచేయుటే

* * *

326. మనభారతదేశప్రస్తుతస్థితి కీ పారము నన్వయించుకొనినచో —— మన దేశమునకు, మన దేశీయులకు, శ్రేయస్సుసమకూర్చుకొనుటకు మన మెల్లరము, పరస్పర భేద భావములను. స్వార్థగమ్యములను, మఱచి, ఏకీభవించి, యొక నాయకు నెన్నుకొని, అతని యాజ్ఞను శిరసావహించి. కలిసి పనిచేసితిమేని, విరోధిపక్ష మెంత బలిష్ఠమైనను, మనలను ప్రతిఘటించి నిలువజాలదు; నిలువసాహసింపదు, లోబఱచు కొనసేరదు. మనకు సర్వతోముఖ విజయము సిద్ధము.

* * *

337. మనహిందూసంఘము వ్యవస్థీకృతము (Organised) కానిది, ఇమిడిక లేనిది గనుక, మనము దుర్బలులము, అసహాయులము ఐతిమి. అందుచే మనము బహువిధ పీడనలపాలగుచు, అంతయు మానముతో నోర్చుకొనవలసిన వారమగుచున్నాము. గత్యంతరము లేక అట్లునడచుకొనుచు—నీతిపథము ననువర్తించి అహింసాసిద్ధాంతము ననువర్తించుచున్నాము—అని ఆత్మవంచన చేసికొనుచున్నాము. గాంధీ మహాత్ముడు దీనిని "దుర్బలులఅహింస" యని తెగడి యున్నాడు. నిజమగు అహింసావర్తనమును "బలిష్ఠుల అహింస" యని ఆయన పేర్కొనును. శత్రువుయొక్క క్రూర కృత్యములకు ప్రతీకారము చేయునట్టియు, వానిని అడచివైచు

నట్టియు శక్తియు, బలమును పూర్ణముగాకలిగియుండియే, అతనియెడ అహింసాభావమువహించి, ప్రేమచూపుట నిజమగు అహింస. స్వామీజీ అభిప్రాయముకూడ ఇదియే. అపకారముగాని, దౌర్జన్యముగాని చేసినవానిని శిక్షించుటకు ఒక్క చెంపపై కొట్టినందుకు బదులు రెండు చెంపలు వాయింపనేరవేని, వాడు నిన్ను చంప నుద్యుక్తుడై యున్నప్పుడు నీవు వానిని చంపజాలవేని నీవు పురుషుడవని చెప్పుకొనదగుదువా? నీయందుగల అట్టి అహింసా పౌరుష సూచకము కాదు, హైందవశాస్త్రబోధకూడ ఇదే.

* * *

328. స్వామీజీ అమరనాథయాత్రకు బయలుదేరుటకుమున్ను ఎవరో యొకరు ఆయన నిట్లడిగిరి "మహాశయా, బలిష్ఠులు బలహీనులను మన యెదుట పీడించుచున్నచో, మనము ఏమిచేయవలెను?" వెంటనే ఆయన ఇట్లు బదులిడెను. "సందేహమేల? బలిష్ఠులను చావమోదుము!" దుర్బలతతో, స్తబ్ధతతో కూడిన క్షమాపణకూడ యథార్థమైనది కాదు. అంతకన్న కలహమాడుటయే మేలు. దేవయోనిదళములనేని (Legions of angels) తెచ్చి సులభ విజయము సాధింపగలిగి యున్నప్పుడు, క్షమింపుము.

"గృహస్థుని కాత్మసంరక్షణమే విధేయము!"

* * *

329. కావున హిందువు లోకజాతిగా జీవింపగోరినచో, బలము నార్జించుకొనుట అత్యావశ్యకము. దాని నార్జించుకొనుటకు ముఖ్యమార్గము ఏకీభావము. మన మతమందు

మనకు అచంచలవిశ్వాసము కలదేని, మతసంరక్షణార్థమై జీవితమునేని అర్పింప మనము జంకకుందుమేని; మన మతమును నిందించుటకుగాని, మన విగ్రహములను, మన దేవాలయములను మైలపఱచుటకుగాని ఎవ్వరును సాహసింపరు, మన స్త్రీలను చెఱచుటకుగాని, వారిని ఘోరావమానములకు, క్రూరహింసలకు పాలుపఱచుటకుగాని సాహసింపరు. హిందువు లొకేజాతిగా నిలిచియుండవలెనన్నచో అందఱును ఏకీభవించి, ఏకమనస్కులై యుండవలెను. వేఱు మార్గము లేదు. కులభేదములు, స్వప్రయోజనములు, స్వజన ప్రయోజనములు మఱచి, తమలో తమ కుంగు ఈర్ష్యా విరోధములను విడనాడి, ధర్మమును, సంఘమును, సంస్కృతిని, తమ్మును, రక్షించుకొనుటకై ఏకీభవింపగలిగిరేని, మన మతాచారములను, మత విధులను నిందలపా లొనర్ప ఇతర మతములవారు వెఱతురు.

* * *

330. బరానగరమఠదినములలో స్వామీజీ తన సోదర శిష్యులకీ నీతికథ చెప్పెను: "ఒక భూస్వామి యొద్ద ఇద్దఱు తోటమాలీ లుండిరి. అందు ఒకడు చాలసేపు ఆయన యెదుట మోడ్పుచేతులతో కూరుచుండి భక్తిరుద్ధకంఠముతో ఇట్టిమాట లనుచుండువాడు: "ఆహా, నా స్వామి కన్నులెంత సుందరములు! ముక్కెంత రమ్యము! రూప మెంత మనోజ్ఞము!" రెండవమాలి ప్రొద్దుగ్రుంకువఱకు పొలములలో శ్రమించి పనిచేసి, ప్రతిసాయంతనవేళ వివిధములగు శాకములు, ఫలములు, పుష్పములు పండించి స్వామిముం

దుంచి నమస్కరించి వెళ్ళువాడు. వీ రిరువురిలో భూస్వామి కెవరిపై ఎక్కువ ప్రీతి? అట్లే కర్తవ్యము లాచరింపక స్తోత్రములచే, సంకీర్తనములచే, తన ప్రసాదము నందజూచువాని కన్న మనశ్శరీరశక్తి నంతయు వినియోగించి కర్మములు నిర్వహించుచు, ఆ కర్మమంతయు ఈశ్వరారాధనముగా నెంచువానిని ఈశ్వరుడు ఎక్కు ప్రీతితో చూచును. ఇది చెప్పి సోదరశిష్యులతో స్వామీజీ యిట్లనెను. "జాగ్రత్త! 'కన్నులెంత సుందరములు! ముక్కెంతరమ్యము' గణములో గాని, ఘంటికదళములోగాని (దేవునిసాయంకాలార్చన వేళ ఘంట వాయించుటేపనిగాగలవాడు, అనగా కర్మకలాపానుష్ఠానముతోనే ముగించుకొనువారి గణములోగాని) చేరుదురేమో!" అని బిగ్గరగా మందలించెను.

* * *

331. పారమార్థికతసాధించుట అనగా ఆత్మానుభూతినొందుట. అది గలవాడే యథార్థమైన ఆస్తికధర్మపరుడు. నిజమునకు మన మెల్లరము నాస్తికులము. మన లోపలను, వెలుపలను భగవంతుని చూడగలిగితిమేని, ఆయన సర్వగతుడను సుస్థిరవిశ్వాసము మనకు కలదేని, మనము పాపకృత్యము లెట్లు చేయగలుగుదుము? ఆయన సర్వజ్ఞుడగుటచే మనము తలచు చెడుతలపు లన్నియు ఆయన కెఱుకపడుచున్నవని మనము నమ్మగలిగితిమేని, మనము సిగ్గుపడి అట్టితలపులను మానుకొనియుండబని లేదా? ఆయన సర్వశక్తిమంతుడగుటచే మన పాపకృత్యములకు శిక్షగా మనలను నరకములో త్రోయగలడని మన మెఱిగినచో, మనము ఆయన వలని

భయముచేత ఆ కృత్యములు విరమించియుండమా? మనము లజ్జచే, జనాపవాదభీతిచే, దండింతురను వెఱపుచే. సత్పురుషులవలె నటింతుము – కాని నిజముగా కాము. మతధర్మానువర్తనులవలె నటింతుమేగాని అధర్మప్రవర్తనమును వీడము. కాని రహస్యముగా, తెలివితో, ఇతరులకు తెలిసి బహిరంగము కాకుండునట్లు జాగ్రత్త తీసికొందుము. ఇట్టివారికన్న నాస్తికులమని యొప్పుకొనువారు వేయింతలు శ్రేష్ఠతరులు.

* * *

332. స్వామిజీ యిట్లు చెప్పవాడు: ఇతరుల కెన్నిసార్లు, ఎంతపాటి, సాహాయ్యము చేయగలిగిన అది చేయుచుందుము. కాని నీ ఉద్దేశ మేమియో విచారించుకొనుచుందుము. స్వార్థముకొఱకో, ప్రయోజన మేదియో సాధించుకొనుకొఱకో, అయినయెడల, అది నీ తోడ్పాటునొందినవారికంతగా ఉపకరింపదు, నీకును ఉపకరింపదు అని యెఱుగుము. అట్లుకాక నీ యుద్దేశ మస్వార్థమైనచో. నీ సేవవలన ఇతరులకు సుఖక్షేమములు కలుగుటేకాక, నీకును నిరవధిక ధన్యత లభించును. ఇది నిజము—మీరిప్పుడు బ్రదికియుండుటెంత నిజమో, అంత నిజము.

* * *

333. ఆరాధన (పూజ) రెండు తెఱగులది బాహ్యారాధన (కర్మకలాపసహితము), మానసికారాధన. దేవుని విగ్రహామునుగాని, పటమునుగాని, మృత్తికా, లోహపాత్రమునుగాని, దారు, శిలాప్రతీకమునుగాని ముందుంచుకొని అందు ప్రాణప్రతిష్ఠచేసి బాహ్యారాధన చేయవలెను. మనము

మానవులముగనుక మనకు ప్రాణాధారములగు వస్తువులను, మనకు సుఖ సంతుష్టులను గూర్చు వస్తువులను సమర్పింతుము—పాద్యము, ఆచమనీయము, అర్ఘ్యము, ఆసనము, వస్త్రము, అలంకారములు, పుష్పదామములు, ఆభరణములు, సుగంధకుసుమములు, చందనగంధము, ధూపము, దీపము, నైవేద్యము, ఫలమూలములు, మధురభక్ష్యములు, అన్నము, పూరీలు, శాకములు, పాయసము, పానీయజలము, తాంబూలము—పిదప శయ్య, చామరము, స్తోత్రగీతికలు, జంత్రగాత్రగానము, నృత్యము, ఆరాత్రికము (కర్పూర హారతి). ఈ వస్తువులు అన్నిగాని, కొన్నిగాని దొరకనిచో, భక్తితో జలముమాత్ర మర్పించి పూజచేయవచ్చును.

* * *

334. మానసికపూజయందు పూజాద్రవ్యములుగాని, దేవతావిగ్రహములుగాని అక్కఱలేదు. ఆయన మూర్తిని హృదయస్థముగా ధ్యానించుచు, ఆయనకు పూర్వోక్త ద్రవ్యములు మానసికముగా అర్పించుచున్నట్లు భావించుటను మానసికపూజ యందురు. ఈ పూజ చేయుటకు ఎల్లరకు—బ్రాహ్మణునికి, చండాలునికి (అస్పృశ్యు డనబడువానికి) సమానాధికారము కలదు. ఈ పూజకు దైహికనిర్మలతగాని, స్నానాదికర్మనిర్మలతగాని, కాల, స్థలాది శాస్త్రనియమములుగాని పాటింపబనిలేదు. మనోవిలీనతమాత్రమే అవసరము.

* * *

335. సర్వాహారపదార్థములు జీవకోటి యొక్క ఉమ్మడిసొత్తు; ప్రతిజీవికి అందు కొంత పాలు గలదని ఉపనిష

ద్బ్రోధ. ఇతరుల నోటిది తీయక, ఇతరులకు హాని, బాధ కలిగింపక, ఒక కడియన్న మేని ఎవరును నోటబెట్టుకొననేరరు. ఆహారమును దేవుని కర్పింపక, ఆకలిగొని తిరుగాడు అతిథులకు, పశువులకు, పక్షులకు వలయుభాగము వేఱుగా ఉంపక, తనకై మాత్రము వండుకొని తినువాడు పాపియనియు, అట్టి యన్నము పాపకళంకితమైనదనియు శాస్త్రములు చెప్పు చున్నవి. ఆకలిగొన్నవానికి కొంత పెట్టక భుజించు గృహస్థునికి నరకహింసకూడ శాస్త్రములు విధించుచున్నవి. (బృహదారణ్యకోపనిషత్తు, 1 వ అధ్యా., 5 వ బ్రా., 2 వ శ్లో.) ప్రతివాడును, తనపూర్ణశక్త్యనుసారము ప్రాణిసేవ చేయవలెను.

* * *

336. తనకుగాని, తనకుటుంబమునకుగాని, తనబంధువులకుగాని సుఖమో, ఇతరస్వార్థప్రయోజనమో పొందుట కొనర్చు పని ధర్మముకానేరదు, ప్రాపంచికవ్యవహారమాత్రమగును. కళత్ర, పుత్త్రి, బాంధవ వర్గము నెడ గల అనురాగమునకు మాయ అని పేరు. అది ఐహికజీవితమునకు—సంసారమునకు—సంబంధించినది. సర్వభూతముల యెడగల అనురాగమునకు ప్రేమ, దయ యని పేరు. అట్లే ఇహపర సుఖక్షేమార్థ మాచరింపబడు తపఃపూజాసాధనాదిమత నిర్దిష్టసత్కార్యములు స్వార్థకర్మములే; ఆ కారణముచే అవి ధర్మకార్యములు, పారమార్థికకార్యములు కావు. కాని, అవే కార్యములు నిష్ఫలాపేక్షతో సర్వజనాభ్యుదయార్థము, పుణ్యములో ఎల్లరకు సమభాగము లభించుగాక యని నిర్వహించినయెడల తనకును, ఇతరులకును సహస్రగుణాధిక

ఫలము లిచ్చును. దయాస్వరూపుడగు బుద్ధదేవుడు ఇట్లు ఉద్ఘాటించెను: "జగత్తులోని వ్యక్తి మానవు లెల్లరును ముక్తి నొందువఱకు నాకు ముక్తివలదు!" ఎంత మహోదాత్తాదర్శము!

* * *

337. జగద్ధితార్థ మస్వార్థకర్మ మొనర్చుచో సహస్రగుణాధిక ఫలము లభించునుగదా యనెడు ఆశ నీహృదయాంతరాళమున మెదలుచుండెనేని, అది ఇంకను నిష్కామకర్మమే యగునా? కానే కాదు. ఒకటికి వేయింతలఫలమును ఆశించి చేయు కర్మమే యగును. వంచకులమాటలకు మోసపోయి నూఱురూపాయలనోట్లుగా మాఱునని పదిరూపాయలనోట్లు, నూఱంతలబరువుగలవిగా మాఱునని బంగరునాణెములు, బంగరునగలు; ఇచ్చి, చివరకు తా మిచ్చినదానినికూడ పోగొట్టుకొను మూఢుల చర్యవంటి దది.

* * *

338. * శ్రీరామకృష్ణు డెట్లు సర్వమతసామరస్యమునకు సజీవమూర్తిభావమో, అట్లే చతుర్యోగ (జ్ఞాన, భక్తి, కర్మ, రాజయోగ) సంయోగాభ్యాసపరిపూర్ణతకును ఆయన మహోజ్జ్వలనిదర్శనము. సర్వతోముఖసమగ్రశీలనిర్మాణమునకిదియొక్కటియే మార్గము. శ్రీరామకృష్ణజీవిత దివ్యతేజఃప్రదీప్తబుద్ధియై స్వామీజీ ఈ మహోదాత్తసత్యమును— చతుర్యోగయుగపత్సాధనను (ఒకేసారిగా అభ్యసించుట)—

---

* 338 మొదలు 347 వఱకు "ఉద్బోధన్" పత్రిక (శ్రీరామకృష్ణమఠ బెంగాలీ ప్రచురణము)లోనుండి గైకొనబడినవట. క. మ.

తాను స్థాపించిన రామకృష్ణమఠ సేవాసంస్థల ఆదర్శముగను, నిర్దిష్టసాధనమార్గముగను నియమించెను. తన మనీషా విశేషముచే ఆయన కల్పించిన మఠనాంకేతికచిహ్నము (**EMBLEM**) లో ఈ భావము మనోహరముగా చిత్రితమై యున్నది. ఆ చిహ్నము (ముద్ర)—దాని భావముతో సహా—ఈ క్రింద చూపుచున్నాము.

* * *

**339.** ఈ చిత్రపటములోని తరంగరూపతటాకజలము కర్మమును, కమలము భక్తిని, ఉదయసూర్యుడు జ్ఞానమును, వీని నన్నిటిని చుట్టుకొనియుండు సర్పము మేల్కొంచిన కుండలినీశక్తిని, హంస పరమాత్మను సూచించును. కావున యోగము కర్మభక్తిజ్ఞానములతో కూడి నప్పుడు పరమాత్మసిద్ధికలుగునను భావమును ఈ చిహ్నము తెలుపుచున్నది.



* * *

**340.** ఆత్మసాక్షాత్కారసిద్ధియనగా తన్నుమాత్రము బ్రహ్మముగా నెఱుగుటకాదు; సర్వభూతములనుకూడ బ్రహ్మముగాకనుగొనవలెను. సర్వత్ర—తన లోపల, వెలుపల—బ్రహ్మమునే చూచుచుండుట పరమార్థసిద్ధి (లేక, ముక్తి) అని ఉపనిషత్తులు తెలుపుచున్నవి. శ్రీచైతన్యుని యొక్కయు, శ్రీరామకృష్ణునియొక్కయు జీవితములందిందుకు ప్రత్యక్షనిదర్శనములు కానవచ్చును. ఈ జీవబ్రహ్మైక్యసిద్ధాం

తము పర్వతారణ్యవాసులగు ఋషి, యోగిజనులయు, కొలది మంది పారమార్థికసాధకులయు, సాధనవిషయమగుటచేత ఎంతో దీర్ఘకాలముగా గిరిగహ్వరములందును, శాస్త్రగ్రంథ సంపుటములందును, తత్త్వశాస్త్రజ్ఞుల విద్వచ్చర్చావివాదములందును దాగియుండెను. ఈ మహోన్నతసత్యము గృహస్థసన్న్యాసిజన దైనందినజీవితములం దెట్లు అనుష్ఠానసాధ్యముగా చేయదగునో శ్రీరామకృష్ణునిసూచనలవలన గ్రహించి స్వామిజీ సర్వభూతములను నారాయణస్వరూపములుగా చూచుచు సేవించుమార్గమును లోకమునకు ప్రకటించెను. జీవబ్రహ్మైక్య(వేదాంత) సిద్ధాంతము అభ్యాసముచే ప్రత్యక్షానుభూతమై, మానవసేవార్థ ముపయోగింపవచ్చునని ఆయన ఉద్ఘాటించెను. "ఆత్మనో మోక్షార్థం, జగద్ధితాయచ" అను ఆదర్శము పరస్పరవిరుద్ధము కాకపోవుటేగాక, పరస్పర సహకారకముకూడ నని లోకమునకు బోధించు నుద్దేశముతో ఆయన రామకృష్ణమఠ రామకృష్ణమిషన్ లను స్థాపించెను.

• • •

341. స్వామిజీ స్థాపించిన నర–నారాయణ సేవా సిద్ధాంతము (అనగా నరుని దైవముగా సేవించుట) కేవల మపూర్వమైనది. బౌద్ధయుగములో భిక్షుకు లొనర్చుచుండిన, మధ్యయుగములందు రోమన్ క్యాథోలిక్ సన్న్యాసు లొనర్చుచుండిన, మానవోపకార కార్యములకు, ఈ సేవకు సమూలభేదము కలదు. బౌద్ధభిక్షువు లాపన్నమానవాళికి చేయు సేవకు జాలియు, దయయు మూలములు, నిర్వాణ సాధన కుపకరించునను భావముకూడ నొకమూలమే. క్యాథొ

లిక్ సన్న్యాసు లొనర్చుచుండిన అట్టి సేవకుకూడ జాలియు, దయయునే మూలములు. కాని అట్టి సేవావిధానములందు సేవ్య – సేవక భేదము (సేవితుడు, సేవకుడు అను భేదము) అనివార్యము. ఈ విధముగా సేవించువారు తా మగ్రపదవి నధిష్ఠించి సేవితులు తమకు కృతజ్ఞతాబద్ధులైయుండితీరవలె నని తలంతురు. కాని "ఆర్తనారాయణుల" యొక్కయు, "దరిద్రనారాయణుల" యొక్కయు (స్వామిజీ నిర్మించిన పదములు) సేవ ఉపనిషద్బోధితఅద్వైతభావమూలమైనదని ఆయనప్రకటించెనుగనుక, దాతృప్రతిగ్రహీతృభేదము అయథార్థము — ఆత్మదృక్పథమునుండి వారొకటేగనుక; ఇంతే కాక ప్రతిగ్రహీతలు,తమ్ము నారాయణులుగా సేవించు అవకాశమును, అధికారమును, భాగ్యమును సేవకులకు కల్పించుచున్నారుగనుక సేవకులేవారికికృతజ్ఞతాబద్ధులై యుండవలెను. స్వామిజీ ఇట్లుకూడ చెప్పియున్నాడు: "దాత మోకరించి పూజించుగాక, ప్రతిగ్రహీత నిలుచుండి అనుమతించుగాక" ప్రాచీనభావమునకు ఈ నవీనభావమునకు ఎంతఅపారభేదము!

* * *

342 దేవినిగాని, దేవునిగాని జడ, నిర్జీవపదార్థములలో—మృద్దారువిగ్రహములలో (మట్టి, కొయ్య ప్రతిమలలో), మృల్లోహపాత్రములలో (మట్టి, లోహపు పాత్రిములలో), శిలా, చిత్రములలో (రాతి, వాత ప్రతిమలలో)—బ్రహ్మముగా, సర్వభూతాంతరస్థమగు ఆత్మగా ఆవాహన చేసి, పూజింపదగినచో, దైవసృష్టిలో శ్రేష్ఠతముడగు సజీవ మానవుని ఎట్లేల పూజింపరాదు? మానవపూజ యనగా

స్థూలశరీర పూజ కాదు, ఆత్మరూపుడై శరీరమున నిలిచి యుండు నారాయణుని పూజ. నాలో ఆత్మరూపిగానుండు నారాయణుడే. స్త్రీ పురుషు లందఱియందును కలడనియు; అజ్ఞరూపమున, దీనరూపమున, రోగిరూపమున నా యెదుట నుండిన దతడే యనియు, వారి నెల్లర నభిన్నదృష్టితో, భక్తిశ్రద్ధలతో సేవించి, వారికి జ్ఞానము, అన్నము, వస్త్రములు, ఔషధములు ఇచ్చి ఉపచారములు చేయుచుండుట, మున్నగు కార్యములు అక్షరదృష్ట్యా, భావదృష్ట్యా మానవ సేవయే యగును. ఇతర దేవదేవీపూజలలోవలె, ఆత్మాభిన్నతాభావము ఇందుకూడ ఉండవలెను. లేనిచో ఇది యంతయు వ్యర్థశ్రమ యగును. శాస్త్రములుకూడ ఇట్లు చెప్పుచున్నవి. "నీవు శివుడవే అయి శివుని పూజింపుము". "నీవు దేవుడవే అయి, దేవుని పూజింపుము"

* * *

343. స్వామిజీ ఏర్పఱచిన ఈ నర - నారాయణారాధనమానవుడు స్వచిత్తశుద్ధికై చేయు నిఃస్వార్థ, నిష్కామ, లోకహితకర్మాచరణమాత్రమైనది కాదు. జ్ఞాన, యోగ, భక్తి, కర్మల అత్యద్భుత సామరస్యాభ్యాసముచే పరమాత్మానుభూతినిపొందుటకిదియొక అపూర్వసాధన. కావున నే ఇది మోక్షమునకు సరళతమమార్గము. ఎట్లన, సాధకుడు ఈ మార్గమున పయనించుచో జ్ఞానయోగము ద్వారా ఈశ్వరుని తానుగనే భావించుకోవలెను, రాజయోగము ద్వారా ఆయనను తనలోని ఆత్మగా ధ్యానింపవలెను; భక్తియోగము ద్వారా మనఃపూర్వకభక్తితో ఆయనలో చేరి

పోవలెను; కర్మయోగము ద్వారా ఆయనను నిస్స్వార్థ నిష్కామ కర్మములతో సేవింపవలెను.

* * *

344. స్వామిజీ ప్రతిపాదించిన ఈ నర-నారాయణ సిద్ధాంతము ముక్తిమార్గమైయుండుటేకాక మానవుని కత్యంత గౌరవమిచ్చుటచే మహోన్నత ప్రశంసాపాత్రమైయున్నది. ఈ సిద్ధాంతప్రకారము మానవుడు అధముడు, భ్రష్టుడు, శోచనీయుడు కానే కాడు, పరమ సమ్మానపాత్రుడగు శివుడు. అనేకమతములందు అర్చకులు, ప్రచారకులు, ఈశ్వరుడు భూలోకమున తమ్మమాత్రమే ప్రతినిధులుగానియమించినట్లు నటించుచు, ఆయన అంతరిక్షమున నెక్కడనో రత్నసింహాసనముపై కూర్చుండి పాపజన్ములగు మానవుల పాపములకు శాశ్వత నరకావాసశిక్షను విధించు నిష్ఠుర న్యాయాధిపతి యని చెప్పుదురు. స్వర్గకవాటపు తాళము లుండునది అర్చకులచేతనే గనుక, వారు ఈశ్వరశాసనమని యొక చట్టమును లోకమున చాటిరి—పాపులును, పశ్చాత్తప్తులును స్వర్గప్రవేశాధికారమొందుటకు ఈశ్వరుని భూలోక ప్రతినిధులకు ద్రవ్యము, విలువగల వస్తువులు సమర్పించి వారి యనుగ్రహముపొందుట అవసరము అనియే ఆ చట్టము.

* * *

345. ఈ వినాశకర సిద్ధాంతమును ప్రతిఘటించి నిలిచి, వివేకానందస్వామి షికాగోలోని ప్రపంచ సర్వమత మహాసభలో మేఘగర్జారావముతో నిట్లుద్ఘాటించెను : ‘‘అమృతపుత్రులారా, మిమ్ము పాపులను వా రెవరు? మీరు

అమృతత్వమునకు ఉత్తరాధికారులు! మిమ్ము పాపులనుట పాపము! పరమపురుషజ్ఞానమునంది, జననమరణసాగరమును తరింపుడు. ముక్తికి మార్గాంతరము లేదు''. ఎట్టి శాశ్వతాశా సందేశము! ఆత్మదృష్ట్యా నిమ్నశ్రేణులు, అసహాయులు, దరిద్రులు, ''అస్పృశ్యులు'' వీరు సజీవశివులు—కావున మనకు సేవార్హులు, పూజార్హులు. ఈ ఆనందసందేశము ప్రప్రథమమున అధికారిక వాక్కులతో వివేకానందస్వామి చేత లోకమున కందింపబడినది, దేవుడును, ఆయన గురువును అగు శ్రీరామకృష్ణుని దివ్యప్రేరణయే ఇందుకు మూలము.

* * *

346. ఆధునికయుగమునందు ప్రపంచమం దంతట మానవుడు దయావిహీనుడై తోడిమానవుని చంపుచున్నాడు, ఒక జాతి మఱొక జాతిని నిర్దాక్షిణ్యముగా నశింపజేయ జూచుచున్నది — అంతయు స్వార్థప్రయోజనసాధనార్థమే! ఈ యుగమున మనుష్యుడు మనుష్యు నవమానపఱచుట— మనుష్యజాతి పరాభవము!—, మనుష్యుడు మనుష్యు నెడ నికృష్టమనోవైఖరి నవలంబించుట, నైచ్యాహంకారములు చూపుట మితిమీఱిపోయినవి. రక్తపిపాసయందు మానవుడు అరణ్యకమహోగ్రక్రూరమృగములనుకూడ మించినాడు. ప్రాచ్య ప్రాశ్చాత్య దేశములందు పురోగతినందినవని చెప్పబడు ప్రబల జాతులు స్వదేశాభిమాన; జాతీయాభ్యుదయవ్యాజమున, శాంతిస్థాపన నాగరికతావ్యాప్తి పేర, బలహీనాప్రగల్భజాతుల సంపదనంతయు దోచుకొని వారికి సమూలవినాశము కలిగించుచున్నారు. పాశ్చాత్యదేశీయుల

దృష్టికి తెల్లవారును, క్రైస్తవులును కానట్టి ప్రాచ్యులు మనుష్యులే కారు—నాగరిక తాశూన్యులు, మృగప్రాయులు, తమ శ్వేతప్రభువుల ఉపభోగమునకు వలసిన వస్తువుల నుత్పత్తిచేయు పరికరమాత్రములుగా ఈశ్వరునిచేత సృజింప బడినవారు. ఈ ఉపద్రవకరదృక్పథము, భోగ్యపదార్థ సమార్జనార్థ మగు పరస్పరస్పర్థలు ఇవియే సార్వలౌకిక ప్రళయకారణములై మనకాలమున జరిగిన రెండుప్రపంచ యుద్ధములకు మూలకారణములు.

* * *

347. భారతదేశములోనైతము మతము, సంఘము, శాఖ, అధికారవాదము — మతకర్మములందు విశిష్టాధికారములు, అధికతరసమ్మానములు, శాఖాంతరవివాదములు, వివిధభిన్నతలుకలవను అంగీకారము, అస్పృశ్యతాచారము, పరస్పరద్వేషములకు, వైరములకు మూలములై చెలరేగుచు, జాతీయజీవనమును సర్వవిధదుఃఖములతో, దారిద్ర్యముతో, దురవస్థలతో నింపుచున్నవి కావున ప్రాచ్యములోగాని, పాశ్చాత్యములోగాని ఈ దుష్టతమభావపోషణము మానవుల యెడలను, జాతులయెడలను ఈ తుచ్ఛదృక్పథము— తత్ఫలముగా నేర్పడు ఘోరప్రవర్తనము. ఇవియే లోకమున సర్వగతములై యుండు ఈర్ష్యాద్వేషములకు మూలకారణములు. ఈ అత్యంత క్లిష్టసమస్యను పరిష్కరించుటకు స్వామిజీచేత ప్రతిష్ఠింపబడిన నర-నారాయణసేవామార్గము (నరుని నారాయణునిగా చూచి సేవించు మార్గము) ఒక్కటియే సమర్థము. ఈ ఉద్దేశముతోడనే సర్వసమత్వము,

సర్వసఖ్యము, సర్వసమదృష్టిత్వము మూలముగా గల ఈ మహోన్నతాదర్శము లోకు లెల్లర యెదుటనుంచి సర్వక్షేత్రములలో—మత, సంఘ, రాజతంత్ర క్షేత్రములలోనేగాక నిత్యజీవితములోని స్వల్పవిషయములలోకూడ—ఈ ఆదర్శమునే పాటింపుడని ఆయన చెప్పెను. వివేకానందస్వామిచే స్థాపింపబడిన రామకృష్ణమరమిషనుల ఉద్దేశము, గమ్యము, ఈ మహాదర్శమును లోకమున ప్రచారము చేయుటయు, అది ఫలోన్ముఖమగుమార్గములు సూచించుచుండుటయునే.

* * *

348. ఈశ్వరునందు ప్రేమ (Love), నియమములు (Law) రెండు నొకటిగా కూడియున్నవి—మాతృభావమున దయాప్రేమములు, పితృభావమున ధర్మపరిపాలనము. కర్మఫలప్రదాతయు, శరణాగత కర్మబంధన విచ్ఛేదకుడును ఆయనయే.

* * *

349. గాలివీచుచు మేఘముల నొకటిగాచేర్చును; అదియే వానిని పాఱదోలి వేఱుచేయును. మేఘములు సూర్యుని కప్పివైచును. అట్లే మాయ ఆత్మను కప్పివైచును. మేఘములు చెదరిపోయినప్పుడు సూర్యుడు ప్రకాశించును. మనుష్యునికి మనస్సు బంధకారణము; మనస్సే మోక్షకారణము కూడ. అంతరస్థమగు మాయ నాశిల్లినప్పుడు, ఆత్మ స్వతేజస్సుతో ప్రకాశించును. నిలుకడలేక చరించుచుండు భ్రమయే మాయ. నిత్యసత్యము, స్వయంప్రకాశకము అగు ఆత్మను అదెట్లు బయలుపఱుపగలదు?

* * *

350. స్వామిజీ యిట్లు చెప్పియున్నాడు శ్రీరామ కృష్ణునిసర్వమతసమన్వయభావము,సార్వలౌకికమతభావము, లోకమునకు శిక్షారూపముగను, ఆదర్శరూపముగను బోధించుట మాత్రము చాలదు. వానిని అనుష్ఠానసాధ్యములుగా చేసి నిత్యజీవితమున ననుసరింపబడునట్లు చేయవలెను. అనగా, జీవితమునందు మన దినచర్యలవలన హిందువుల పారమార్థికతను, బౌద్ధుల భూతదయను, క్రైస్తవుల వ్యవస్థీకృతకార్యాచరణావైఖరిని, ముస్లిముల సౌభ్రాత్రమును ప్రతిబింబింపజేయవలెను. ఈ గమ్యము సిద్ధించుకొఱకు మనుష్యజాతియందంతట—కుల, మత, వర్ణ భేదములు పాటింపక—సార్వలౌకికమతమును మనము స్థాపింపవలెను.

* * *

351. హిందూమతములోనుండి బౌద్ధమతము పుట్టినది. బౌద్ధమతము క్రైస్తవమతమునకు కారకమైనది. క్రైస్తవమతము మహమ్మదీయమతమునకుమూలమైనది. ఈ ఆధునిక యుగమున ఈ నాల్గుమతములు భారతదేశములో నొకటిగా చేరి సామరస్యముతో ఏకీభవింపవలెను. ఈ కార్యమును నిర్వహించుకొఱకే శ్రీరామకృష్ణు డవతరించినది — బిడ్డలయొక్కయు, మనుమండ్రయొక్కయు వివాదములు, కలహములు తీర్చి, భూమిపై శాంతిసౌహార్దములు పునఃప్రతిష్ఠ చేయుటకు. ఇవి వివేకానందస్వామి పలికిన మాటలు.

* * *

352. నీ యావజ్జీవితకాలము పారమార్థికబోధన నెంతో వినియున్నావు. నీకు మార్గదర్శకముగా నుండదగు

జ్ఞానము నెంతో ఆర్జించినావు. కావలసినన్ని మతధర్మ విధులు నీ వెఱుగుదువు, ఇతరుల కవి బోధించుచుందువు కూడ. కాని నీ బోధనలలో కొన్నిటినైన నీ జీవితమున నీ వభ్యసించినట్లు చూపగలిగిననే తప్ప నీ మాట లెవరు విందురు? మాటకు, చేతకు (నటనకు, అనుష్ఠానమునకు) అపార భేదము కలదు. శాస్త్రము లసంఖ్యాకముగా చదువుట, బోధన లసంఖ్యాకముగా వినుట మోక్షసిద్ధి కవసరము లేదు. మోక్షమార్గములుగా నిర్దిష్టములైన నియమములలో చివర కొక్కటియైన నీ జీవితమున నభ్యసింప గలిగితివేని, నీవు ధన్యుడవపుదువు, లోకమునకు కూడ శ్రేయస్సు కలుగును; జగన్మాత కృపచేత నీవు ఈ జీవితాంతమున అపారసంసార సాగరమును దాటి ఆనందమయ పదమును చేరుదువు.

*　　　*　　　*

৪5৪. సోదరులారా! మనము మాతృగర్భమునుండి దిసమొలతో, ఒంటరిగా వచ్చితిమి. ఈ లోకమును వీడు నప్పుడు కూడ ఒంటరిగానే పోవలెను. మన వెంట నెవ్వరును- మన మొండొరులను విడిచి యొక్క క్షణమేని ఉండజాలని వారు సైతము—రారు. ప్రాణాధికములుగా చూచుకొను ప్రియతమ వస్తువులను కూడ వెంట తీసుకొని పోజాలము. అప్పుడే పుట్టిన బిడ్డ యేడుపు వాని జీవితారంభమునకు గుర్తు. ఆ యేడుపు ఎల్లర నానందమయుల జేసెను. నీవు మరణించు నప్పుడు ఇతరు లేడ్తురు గాక నీవు మాత్రము నిరాకుల బుద్ధితో, శాంతముగా, నీ అగాధతమాంతస్తత్త్వమునుండి

అలౌకిక హర్షానందము లుబికి, నీ ముఖము నళ్ళముచుండ నిర్గమింపుము. అప్పుడు నీ జీవితమును చక్కగా గడపినవాడ వవుదువు. అప్పుడు నీకు జీవిత మాకర్షకముగా, మరణము భయంకరముగా నుండదు. జీవమును మరణమును కూడ జయించినవాడ వౌదువు. నీ వప్పుడు జీవ మరణములకును, బంధముక్తులకును, తేజోంధకారములకును, మంచిచెడ్డలకును, సుఖదుఃఖములకును—ద్వంద్వము లన్నిటికిని—అతీతుడవై, వాని కపారదూరస్థుడవై యుందువు. అది నిన్ను నీవు—నీ యథార్థస్వరూపముతో—ఎఱుగుక్షేత్రము—శాశ్వత ప్రశాంతి క్షేత్రము, సచ్చిదానంద క్షేత్రము. ఈ నిత్యక్షేత్రముచు— ఈ జీవిత పరమగమ్యమును — అధిగమింప గోరితివేని, మాయను విదిగ్చివేయుము; ఈ మిథ్యాప్రపంచసక్తతను వీడుము; సత్యద్రష్టలు, జ్ఞానసిద్ధులు అగు మహాపురుషుల ఉపదేశముల ననుసరింపుము; వారి తత్త్వముతోడి సామరస్యము చేకూర్చుకొనుము. అట్టి సద్గురుని—నీ యిష్టమూర్తి యొక్క సజీవప్రతినిధి—సహాయ ముండెనేని జీవితగమ్యసిద్ధి సులభతరముగా నుండును. సత్యమంతయు ఇదియే — సర్వ శాస్త్రబోధయొక్క సమష్టి—బ్రహ్మ మొక్కడే సత్యము, తదితరమంతయు మిథ్య! తత్త్వమసి! నీవే అది! ఈ జన్మము ననో, అనంత జనన మరణముల యనంతరమో — ప్రకృతి నియమానుసారముగా—ప్రతి పురుషునికి, ప్రతి స్త్రీకి, ఎఱుక పడవలసియున్న అంతిమ—పరమ—సత్య మిదియే.

నా ప్రియాత్మవేయగు నీవు ఈశ్వరకృపవలనసత్యాను భూతి నిప్పుడే పొంది, ఈ క్షణమునుండి కలకాలము ముక్త

డవుగా నుందువుగాక! మీ యందలిని ఈశ్వరు డను గ్రహించుగాక!

ఓమ్! శాన్తిః! శాన్తిః! శాన్తిః! ఓమ్!

ఓమ్! నీకును నాకును శాంతి సిద్ధించుగాక! బహిరంతరముల సర్వత్ర శాంతి వెలయుగాక! సర్వభూతములకు శాంతి కలుగుగాక! భూలోకమునను, సర్వ స్వర్గలోకము లందును శాంతి నిలుచుగాక!

శాన్తిః! శాన్తిః! శాన్తిః!

ఓమ్! ఓమ్! ఓమ్!

ఓమ్. శ్రీరామకృష్ణార్పణమస్తు.

